100 గురుజాడ
శతవర్ధంతి సభ

## గురజాడ వాడిన వస్తువులు



గురజాడ అప్పారావు వాడిన కుర్చీలు, మేజాబల్ల



1910 నాటి గురజాడ ఫోటో



గురజాడ వాడిన పుస్తకాలు




గురజాడ వాడిన కళ్ళద్దాలు



గురజాడ వాడిన కుర్చీ



గురజాడ అప్పారావు ఇంటి లోపలి భాగం

సాహిత్య
# ప్రస్థానం

సంపుటి : 14 | నవంబర్ - డిసెంబర్ 2015 | సంచిక : 11




## గురజాడ అప్పారావు శతవర్ధంతి ప్రత్యేక సంచిక

ఈ సంచికలో...





చిరునామా

సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
అజామాబాద్, హైదరాబాద్ - 500 020

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు,
ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002, సెల్: 9490099059

ssprasthanam@gmail.com
www.prasthanam.com

సంపాదకీయం....

# మందగించక ముందుకే!

బ్రతికి చచ్చియు ప్రజల కెవ్వరు బ్రీతి గూర్చునొ వాడె ధన్యుడు! అపూర్వ స్నేహాన్ని ఆదర్శ దాంపత్యాన్ని నిర్వచించిన దమను పితియసు గేయంలో గురజాడ అప్పారావు రాసిన చరణాలివి. ఆయనకు అక్షరాలా వర్తిస్తాయి. అస్తమించిన వందేళ్ల తర్వాత కూడా ఆయన సాహిత్య కిరణాలు తెలుగువారి చైతన్యాన్ని జేగీయమానం చేస్తున్నాయి. యావత్ జాతి ఆయనను సగౌరవంగా స్మరించుకుంటున్నది. ఆ బాటలో నడుస్తానని ప్రతిన బూనుతున్నది.

గురజాడ తెలుగు భాషా సాహిత్యాలను సామాజిక చైతన్యాన్ని గొప్ప ముందంజ వేయించిన సంస్కర్త. సంస్కారి. నాటి మహారాజుల నుంచి మామూలు మనుషుల వరకూ సమకాలీనులను అమితంగా ప్రభావితం చేసిన వైతాళికుడు. ఒకానొక శిథిల సమాజంపై ఒకే ఒక్క నాటకంతో అగివర్షం కురిపించిన కలం యోధుడు. అయినా రాచరికపు హద్దులు బద్దలు కొట్టి రాజభక్తిని దైవభక్తిని దేశభక్తి వరకూ నడిపించిన దార్శనికుడు. తాను ఆస్థానాలలో వున్నా అట్టడుగు జనానికి కూడా అక్షర జ్ఞానం కలిగించేందుకు ప్రజల భాష కావాలని పరితపించిన మహా మనీషి. కుల మత చాందసాలను చీల్చి చెండాడి జ్ఞానమొక్కటే నిలిచి వెలుగుతుందని ప్రకటించిన ప్రజ్ఞావంతుడు. పుక్కిటి పురాణాలు మూఢవిశ్వాసాలు గాక శాస్త్ర విజ్ఞానం మార్గదర్శకం కావాలని ఆకాంక్షించిన నిత్య పిపాసి. ఇప్పటికీ అనేక విధాల అసమానతలకూ అణచివేతలకు అత్యాచారాలకు గురవుతున్న మహిళల విముక్తి వికాసాలే ధ్యేయంగా అహరహం కృషి చేసిన దీపధారి గురజాడ.

గురజాడ జీవిత సాహిత్యాలను ప్రగతిశీల సమాజం ఎప్పుడూ మహత్తర వారసత్వంగా గౌరవిస్తూనే వుంది. ఆయన రచనలను సమగ్రంగా ప్రచురించి, విస్తృతంగా ప్రచారంలో పెట్టింది అభ్యుదయ ఉద్యమమే. దేశంలో మత చాందసం, అసహనం వెర్రితలలు వేస్తున్న ఈ సమయంలో గురజాడ బోధనలకూ రచనలకూ అంతకు మించి ఆయన అందించిన స్ఫూర్తికీ చాలా చాలా చాలా ప్రాధాన్యత ఏర్పడుతున్నది. అందుకే సాహితీ స్రవంతి ఇప్పటికే ఆ కార్యక్రమాలు ప్రారంభించింది. పాతవాటి పునర్ముద్రణతోపాటు అనేక ప్రచురణలు తెస్తున్నది. విద్యాలయాల్లో దేశభక్తి గీతాలాపనతో పాటు బహుముఖ ప్రయత్నాలూ ప్రయోగాలూ జరగనున్నాయి. ఉభయ తెలుగు రాష్ట్రాల్లోనూ పాలకులు పెంచుతున్న అశాస్త్రీయ పోకడలకు ఒక సమాధానంగా నిలిచే సందర్భం గురజాడ శతవర్ధంతి. సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచిక కూడా అందుకే అంకితం.

**మూడు యాభయిల మన గురజాడ పాట**

**ముందుకే నడిపించు ముత్యాల బాట**

**ఆ మహాకవికీ యుగకర్తకూ ఇదే మా నివాళి.** ◈




# తన తర్వాత నూరేళ్ళకు..

◈ తెలకపల్లి రవి

*యాభై మూడవ ఏట మరణించినా– ఆ తర్వాత ఇప్పటికి వందేళ్లు గడిచినా తెలుగువారి హృదయాల్లో శాశ్వతంగా జీవిస్తున్న ధన్యుడు. తెలుగు భాషను సాహిత్యాన్ని కూడా అజరామరం చేసి ప్రజలకే అందించిన ప్రజాస్వామ్య ప్రియుడు. వెరసి మహాకవి గురజాడ ఒక వెలుగు జాడ. ఒక అడుగు జాడ. ఇప్పటికి ఆయనపైన, ఆయన రచనలపైన, జీవితంపైన, ప్రత్యేకించి కన్యాశుల్యంపైన ఎన్నెన్నో పరిశోధనలు, విశ్లేషణలూ వ్యాఖ్యానాలు, సంకలనాలు, సంపుటాలు. అయినాసరే– ఇంకా తన లోతును కనుక్కోమన్నట్టు చూస్తుంటాడాయన. బహుశా తెలుగులో మరే రచయితకు లేనంత ప్రఖ్యాతి ప్రశస్తి, సుదీర్ఘ సుసంపన్న జీవితం ఆయనకే ఎందుకు లభించింది?*

నెలలు నిండకుండానే పుట్టి, షష్టిపూర్తి కూడా కాకుండానే కన్నుమూసిన దుర్బల జీవి. ఈ స్వల్ప జీవిత కాలంలోనే అనల్పమైన దార్శనికతతో కాలాన్ని ముందుకు నడిపిన ప్రతిభామూర్తి.

ఒకే ఒక సంపూర్ణ నాటకం, రెండు అసంపూర్ణ నాటికలూ, కొన్ని తెలుగు, ఇంగ్లీషుకవితలూ, నాలుగైదు ఖండకావ్యాలు, ఐదారు కథలూ, మాత్రమే రచించి, డైరీలు లేఖలు మిగిల్చి, వాటిలోని అనేక ఊహలు కాగితంపైన పెట్టకుండానే వెళ్లిపోయిన రచయిత.

కవిగా రచయితగా బోధకుడుగా కార్య నిర్వాహకుడుగా చరిత్ర పరిశోధకుడుగా విద్యావేత్తగా విమర్శకుడుగా ఎన్నో బాధ్యతలు నిర్వహించిన బహుముఖ ప్రజ్ఞావంతుడు.

రాజాస్థానంలో వుంటూనే దేశభక్తిని నిర్వచించిన ధీశాలి. సంప్రదాయ కుటుంబంలో పుట్టి దాన్నే సవాలు చేసిన ధైర్యశాలి. రాజు గారి నుంచి 'అసిరిగాడి' వరకూ అందరితో స్నేహంగా మెలిగిన స్నేహశీలి. అక్షరాన్ని అధికారాన్ని కూడా మేళవించిన ప్రజ్ఞావంతుడు. పాండిత్యం కన్నా జ్ఞానాన్నీ, లోకజ్ఞానాన్ని కూడా గౌరవించి లోకనీతిని రీతిని మార్చడానికి మాత్రమే వినియోగించిన విజ్ఞాన కోవిదుడు. విశాల హృదయుడు. సేవాతత్పరుడు.

ఆశల కోసం ఆశయాలను వదులుకోని ఆదర్శాల ప్రతిబింబం. ఎవరికోసం తన ఉద్యమాన్ని వదులుకోనని ప్రకటించిన ఉక్కు సంకల్పం ఆయన స్వంతం.

దేశభక్తి, ఆధునిక కవిత్వం, ప్రేమ, స్త్రీ చైతన్యం, సంఘ సంస్కరణ వంటి ఎన్నో ఉదాత్త వినూత్నభావాల్లను నిర్వచించి, నిర్వహించి వెళ్లిన కావ్యకర్త, కార్య కర్త. చరిత్రలో తనకంటూ ఒక సుస్థిర స్థానాన్ని సంపాదించుకోవడమే గాదు, తనతోనే నూతన చరిత్ర మొదలైందనిపించుకున్న అసమాన మేధావి.

యాభై మూడవ ఏట మరణించినా– ఆ తర్వాత ఇప్పటికి వందేళ్లు గడిచినా తెలుగువారి హృదయాల్లో శాశ్వతంగా జీవిస్తున్న ధన్యుడు. తెలుగు భాషను సాహిత్యాన్ని కూడా అజరామరం చేసి ప్రజలకే అందించిన ప్రజాస్వామ్య ప్రియుడు.

వెరసి మహాకవి గురజాడ ఒక వెలుగు జాడ. ఒక అడుగు జాడ.

ఇప్పటికి ఆయనపైన, ఆయన రచనలపైన, జీవితంపైన, ప్రత్యేకించి కన్యాశుల్కంపైన ఎన్నెన్నో పరిశోధనలు, విశ్లేషణలూ వ్యాఖ్యానాలు, సంకలనాలు, సంపుటాలు.

అయినాసరే- ఇంకా తన లోతును కనుక్కోమన్నట్టు చూస్తుంటాడాయన.

బహుశా తెలుగులో మరే రచయితకు లేనంత ప్రఖ్యాతి ప్రశస్తి, సుదీర్ఘ సుసంపన్న జీవితం ఆయనకే ఎందుకు లభించింది?

2

చాలా మంది అంటారు 'గురజాడ మరణించిన తర్వాతనే జీవించడం మొదలు పెట్టాడు' అని. ఎవరో ఎందుకు? కేంద్ర సాహిత్య అకాడమీ తరపున గురజాడపై మంచి పుస్తకం రాసిన నార్ల వెంకటేశ్వరరావు ఇలా అంటారు:

" ఏమైనా, ఆయన మరణించిన చాలా కాలానికి తప్ప, గురజాడ ప్రభావం ఆయన జీవించివున్న రోజుల్లో సువ్యక్తం కాలేదనేది అనివార్యమైన సత్యం. ఆదిలో చిన్న ధారగా వుండిన గురజాడ ప్రభావం ప్రారంభంలో నెమ్మదిగా, ఆ తర్వాత వేగంగా, పెరిగి పెద్దదయి, రానురాను పరవళ్ళు తొక్కే ఒక మహా ప్రవాహంలాగా అయింది. ముప్పయిల నుంచీ, కొందరు పులిపి కట్టలూ, పెడకట్టెలు తప్పిస్తే, తెలిసో తెలియకో ఆ మంత్ర ప్రభావం కిందికి రాని తెలుగు రచయిత అంటూ లేడు. ఆధునిక తెలుగు రచయితలలోకెల్లా ఆయన అత్యధిక ప్రశంసనీయులు. చర్చనీయులు, ఆదర్శప్రాయులు. ఆయన వదిలిపెట్టిపోయిన ప్రతి చిత్తునూ సేకరించడం, పాఠాంతరాలను సరిచూడడం, పరిష్కరించడం, ప్రచురించడం జరుగుతోంది. ఆయనను మార్గదర్శకునిగా పేర్కొంటూ పద్యాలూ, పాటలూ, ప్రస్తుతులూ, విమర్శలూ, వ్యాసాలు, జీవిత చరిత్రలూ వెలువడుతున్నాయి."

గురజాడను ఎంతగానో అభిమానించి గొప్పగా చిత్రించిన రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కూడా అదే మాట!

"సధర్ములకు మహాపురుషులెప్పుడూ జ్ఞాపకం వస్తూనే వుంటారు. అయినా సంవత్సరాని కొక్కమాటు వారిని ప్రత్యేక శ్రద్ధాభక్తులతో స్మరించుకోవడం వారి అడుగుజాడల్లో నడిచేవారికి మిక్కిలి శ్రేయస్కరం.

అది సభ్యతకు చిహ్నమున్నూ.

ఈ దృష్టితో ఇవాళ, నేను గురజాడ అప్పారావు గారిని విశిష్ట భక్తితో స్మరించుకొంటున్నాను.

బతికి వుండిన దినాల్లో వారిని ఆంధ్ర ప్రజానీకం గుర్తించలేకపోయింది; కానీ, తరువాత మాత్రం, సంవత్సరం మీద సంవత్సరం గడిచినకొద్దీ వారి విషయమై ఎక్కువగా తెలుసుకుంటోంది. వారి రచనల కోసం అర్రులు చాపుతోంది. అవి చదివి ఆనందముగ్ధం అవుతోంది. ఆ వెంటనే "ఇలాంటి పెన్నిధిని గుర్తించలేకపోయామా?" అనినీ పరితపిస్తోంది.

అసలే ఆంధ్రజాతికి ఆత్మగౌరవమూ, ఆత్మవిశ్వాసమూ ఇంకా గుర్తుకు రాలేదు. దీనికి సాయం, అప్పారావుగారు అసందర్భ పరిస్థితుల్లో బతుకవలసి వచ్చింది.

దేశం ఎంతగా పరుల పాదాల కింద నలిగిపోవాలో అంతగానూ నలిగిపోయాకా, జాతి యెంతగా బానిస అయిపోవాలో అంతగానూ బానిస అయిపోయాకా, భాష యెంతగా శృంఖలాబద్ధం అయిపోవాలో అంతగానూ శృంఖలాబద్ధం అయిపోయాకా, సాహిత్యం ఎంతగా దిగజారిపోవాలో అంతగానూ దిగజారిపోయాకా, భవిష్యత్తు ఎంతగా అంథకార బంధురం అయిపోవాలో అంతగానూ అంథకార బంధురం అయిపోయాకా పుట్టుకువచ్చాడీ మహాకవి.

ఆశ్చర్యపడడానికేమీ లేదు. ఏమంటే, నిజానికి ఇలాంటి పరిస్థితుల్లోనే తరచు ఆదర్శపురుషులు ఆవిర్భవిస్తూ వుంటారు.

అయితే అలాటి నికృష్టస్థితిలో మహాకవి అయితే మాత్రం నరసేవ చెయ్యకుండా భుక్తి యెలా గడుస్తుంది? ఆ పురుషుడు చెయ్యి జారిపోకుండా, జాతి మాత్రం అతని మహత్తు ఎలా గుర్తించ గలుగుతుంది?"

శ్రీపాద వారి వ్యాఖ్య రెండువైపులా పదునున్న కత్తిలాంటిది. బతికి వున్నప్పుడు గురజాడ గొప్పతనం గుర్తించబడలేదంటూనే అందుకు కారణం నాటి సమాజం తప్ప ఆయన లోపం లేదంటున్నారు. అయితే ఆ మాటలపైనా తేడాలున్నాయి. గురజాడను ఈసడించిన వాళ్లే కాదు- బాగా గౌరవించిన వాళ్లు కూడా రకరకాలుగా వ్యాఖ్యానించారు. ఆయన జీవితంపైన, రచనలపైన ఎన్నెన్నో విమర్శలు, వివాదాలు, విసుర్లు! నార్ల మాటల్లోనే చెప్పాలంటే-

"అయితే నిజంగా ఆయన మరణించారా? లేదు. ఆయనకు మృత్యువు "జీవన ద్వారం". తద్వారా మరింత విస్తృతమయిన, మరింత సత్యమయిన, మరింత శక్తివంతమయిన జీవితంలోకి నిష్క్రమించారు. జీవించివున్న రోజుల్లో తెలుగు సాహిత్యంలో అగ్రగామిగా ఆయన ప్రభావం

ఆయన గొప్ప నాటకం 'కన్యాశుల్కం' కూడా వాళ్ల ఆక్షేపణల నుంచీ పూర్తిగా తప్పించుకోలేదు. చతురోక్తీ, చమత్కారమూ, శక్తీ, చురుకు దనమూ అనే సుగుణాలు వున్నాయని ఒకవైపు ఒప్పుకుంటూనే, 'కన్యాశుల్కం'లోని అభిరుచినీ, నైతిక దృష్టినీ వాళ్ళు శంకించారు. సృజనాత్మక, సాహిత్యభాషగా వాడుక భాష వుండాలనే గురజాడ వాదం. ఆయన కవిత్వం కంటే, నాటకం కంటే కూడా వాళ్లను ఒళ్లు మండింపజేసింది.

అతిస్వల్పం. దాదాపు తృణప్రాయం. అభిమాని ఒకడువుంటే, అప్రతిష్టపాలు చేసేవాళ్ళు కొల్లలు కొల్లలు. మరీ తప్పులు పట్టని వాళ్ళు ఆయనను అధ్వాన్నమయిన కవిత్వావగాహనా, అంతకంటే అధ్వాన్నమయిన పాండిత్యమూ వుండే మిడిమిడి కళాభిమాని అన్నారు. తక్కిన వాళ్ళు బూటకపు మనిషి అని ముద్రవేశారు.

ఆయన గొప్ప నాటకం 'కన్యాశుల్కం' కూడా వాళ్ల ఆక్షేపణల నుంచీ పూర్తిగా తప్పించుకోలేదు. చతురోక్తీ, చమత్కారమూ, శక్తీ, చురుకు దనమూ అనే సుగుణాలు వున్నాయని ఒకవైపు ఒప్పుకుంటూనే, 'కన్యాశుల్కం'లోని అభిరుచినీ, నైతిక దృష్టినీ వాళ్ళు శంకించారు. సృజనాత్మక, సాహిత్యభాషగా వాడుక భాష వుండాలనే గురజాడ వాదం. ఆయన కవిత్వం కంటే, నాటకం కంటే కూడా వాళ్లను ఒళ్లు మండింపజేసింది. బజారు భాష, పొలాల భాష, ఫ్యాక్టరీల భాష, రోజువారీ బతుకులోని మొరటయిన అడ్డదిడ్డపు భాష. అధిష్టాన దేవత, సాహిత్యాది సమస్తకళల మూర్తిమత్వమయిన సరస్వతి ఆరాధనకు యెలా అర్హమవుతుంది? అది అపస్వరాలతో ఆమె సున్నితమైన శ్రవణేంద్రియాలను కష్టపెట్టదా? ఆ పాడు పచ్చిపచ్చి మాటలతో అది ఆమె సుతిమెత్తని మనస్సును బాధపెట్టదా? అని వాళ్లు గర్జించారు. తాను అర్ధచదువు మనిషి కాబట్టి, అర్ధచదువుగాళ్ళ భాష అయిన వాడుక భాష తరపున పోరాడుతున్నాడని వాళ్ల గట్టి నమ్మకం.

గురజాడ పట్ల ఛాందస పండితుల ప్రచండ వ్యతిరేకత ఆశ్చర్యాన్ని కలిగించ నవసరంలేదు. ఎందుకంటే అన్నింట్లోనూ ఆయన వాళ్ళకు విరుద్ధమే. అయితే ఆయన జీవితకాలంలో కొద్దిమంది అభిమానులయినా, ఆయన అడుగుజాడల్లో ఎందుకు నడవటానికి సిద్ధపడలేదనేది ఎవరినయినా ఆశ్చర్యపరుస్తుంది. వాళ్లెవరు కానీ వాడుక భాషలో నాటకాలు రాయలేదు. ఆయన ఆవిష్కరించిన కొత్త ఛందస్సులో గీతాలను రచించలేదు. తెలుగు సాహిత్యానికి ప్రప్రథమంగా ఆయన ప్రసాదించిన కథానికపట్ల తగిన శ్రద్ధనూ చూపలేదు. తన కాలానికంటే, ఆయన చాలా ముందుండడమే దీనికి ఒక కారణం కావచ్చు. ఆయన రచనలు రాశిలో పెద్దగా లేకపోవడం రెండో కారణం కావచ్చు. ఒక పూర్తి నాటకం, రెండు అసంపూర్ణమైన నాటకాలు, అయిదు కథానికలు (అందులో ఒకటి ఆంగ్లంలో), ఒక చిన్న పద్య గేయగుచ్ఛం, ఒక చిరు వ్యాసగుచ్ఛం అన్నీ దాదాపు అంతే. కన్యాశుల్కం, నీలగిరి పాటలు మినహాయిస్తే ఇతర రచనలు స్వల్ప పరిమాణంలో వుండేవి కూడా, ఆయన జీవితకాలంలో గ్రంథరూపంలో వెలువడలేదు. వాడుక భాషలోనే రాయాలనే ఆయన పట్టుదల కారణంగా ఆనాటి ప్రముఖ పత్రికలు గురజాడ రచనలను ప్రచురించడానికి విముఖత చూపాయి. మొత్తం రాయడమే అంత తక్కువగా వున్నప్పుడు, ఆ తక్కువగా రాసిన రచనలకు నయితం విస్మృతమయిన ప్రచారం నిరాకరింపబడినప్పుడు ఆయన ప్రభావం తక్కువగా తప్ప; మరొకలా ఎలా వుంటుంది?్చ.

'అడుగుజాడ గురజాడది, అది భావికి బాట/ మనలో వెధవాయిత్వం మరపించే పాట' అన్న శ్రీశ్రీ చరణాలు సుప్రసిద్ధాలు. కానీ ఆ శ్రీశ్రీ కూడా గురజాడ 'ఆధిక్యతకు కారణాలు' తెలుసుకోవడానికి చాలా కాలం పట్టింది. తన మొదటి మహాప్రస్థాన గేయం 'జయభేరి'(1933) రాయడానికి ఒక్క ఏడాది ముందుమాత్రమే ఆయన గురజాడపై తొలివ్యాసం రాశారు. అది 'కన్యాశుల్కంలో స్త్రీ వ్యక్తులు'. ఇందులో భాష, భావాలు కూడా తర్వాత మనకు తెలిసిన శ్రీశ్రీ రాతలంత బలంగా వుండకపోవడం తేలిగ్గానే అర్థమవుతుంది. ఈ లోటు శ్రీశ్రీకి కూడా తెలుసు. అందుకే ఆశలకేం అనంతం... అప్పారావంత వాణ్ని' అంటూ ఒకసారి తన కోర్కెను బయటపెట్టుకున్నారు! 'ముత్యాలసరాలు' రాసిన ఏడాది పుట్టిన శ్రీశ్రీకి కూడా పోటీ నివ్వగలంత నూతనత్వం గురజాడే ఎలా ప్రదర్శించాడో దీన్నిబట్టే తెలుస్తుంది.

మహాకవులనూ, మహాపురుషులనూ ఆరాధించే వాళ్లూ అభిమానించేవాళ్లూ వున్నట్టే అభిశంసించే వాళ్లూ, అపహాస్యం చేసే వాళ్లూ ఎప్పుడూ వుంటారు. ఇప్పటికీ ఒక తెలుగు దినపత్రికలో ఆయనను సంస్కృతీ విధ్వంసకుడిగా తిట్టిపోసే రచనలు వస్తుంటాయి లేదా వేస్తుంటారు.

ఒక రచయితను పొగిడే, తెగిడే అన్నిరకాల వాళ్లల్లోనూ రకరకాల వాదనలు, వైరుధ్యాలు గురజాడ విషయంలో వున్నంతగా మరెవరి విషయంలోనూ లేవు. మరి ఈ వైరుధ్యాలు ఆయనలో వున్నాయా? చూసేవాళ్లలోనే వున్నాయా? అసలు ఆయన గొప్పతనం నిజంగానే జీవితకాలంలో గుర్తింపు పొందలేదా? ఆనాటికి ఆధునిక సాహిత్యకారులు మరెవరైనా అంతకన్నా అధికతరమైన గుర్తింపు పొందిన దాఖలాలున్నాయా? గురజాడ జీవితంసాహిత్య దృక్పథాలు మరోసారి పరిశీలిస్తే తప్ప సమాధానం దొరకని ప్రశ్నలివి. ఈ క్రమంలో ఆయా వాదనల లోతుపాతులు నిగ్గుతేలిస్తే తప్ప అంతుపట్టవు. శతవర్ధంతి అందుకు సరైన సందర్భం. ఆ కాలం నాటికి ఎంతో ముందున్న గురజాడను ఇప్పుడు తిరిగి చూస్తే ఎక్కడ వుంటాడో తెలుసుకోదగిన సందర్భం.

3

చెప్పాలంటే గురజాడ మాత్రమే కాదు-దార్శనికులెవరైనా సరే వారి పాత్రను సరిగ్గా సమగ్రంగా అర్థం చేసుకోవడానికి సమయం పట్టడం ఏమంత ఆశ్చర్యకరం కాదు. ఏమంటే వారు కాలం కంటే ముందుంటారు. ఎంత ముందున్నారనేది ఎవరి అంచనా వారికి వుండొచ్చు. 2002లో సాహిత్య సంచిక 'గమనం'లో మిత్రులు కె.శ్రీనివాస్ గురజాడ గురించిన ప్రస్తావన చేశారు. దానికిగాను ఆయన రచయిత కళ్యాణరావు మాటలను ఉటంకించారు. తనకు గురజాడ కన్నా జాషువా దగ్గరి వాడని అంటున్న కళ్యాణరావు దీర్ఘకాలంగా అభ్యుదయ ఉద్యమాలు అనుసరిస్తున్న వరవడిని ఉల్లంఘించారా? తను అన్న మాటల లోతేమిటో? గ్రహించాడా? అని సందేహాలు లేవనెత్తారు. ఆ సంచికను ఆవిష్కరించిన ప్రొఫెసర్ కె.కె.రంగనాథాచార్యులు మాట్లాడుతూ ఇన్నాళ్ల తర్వాత కూడా గురజాడ వున్నంత నిత్య నూతనంగా శ్రీశ్రీ కూడా వుండకపోవచ్చని వ్యాఖ్యానించారు. కె.శ్రీనివాస్ వ్యాఖ్యలపై స్పందిస్తూ కళ్యాణరావు ఆయన పండిత సంప్రదాయం నుంచి వచ్చినవారు గనకే అలా అన్నారని ఒకింత నిష్ఠూరంగా స్పందించారు. తెలంగాణ ఉద్యమంలో ట్యాంక్‌బండ్‌పై విగ్రహాల వివాదం వచ్చినప్పుడు కూడా గురజాడ కందుకూరి వంటి వారికి, మాకూ సంబంధమేమిటన్న వ్యాఖ్యలు వినిపించాయి. ఆయన రూపొందించిన వ్యావహారిక భాషకూ, తెలంగాణకూ సంబంధం లేదన్నది సారాంశం. గురజాడ కూడా కందుకూరి లాగే స్వతంత్ర పోరాటాన్ని గట్టిగా బలపర్చలేదనే మాట ఎప్పటికప్పుడు ఎవరో ఒకరు ముందుకు తెస్తుంటారు. ఇక దళిత వాదులైతే గురజాడ అగ్రవర్ణ ప్రతినిధి అన్న నిర్ధారణకు వచ్చేశారు. కమ్యూనిస్టులు గురజాడను ప్రధానంగా ప్రచారంలోకి తెచ్చారు గనక వారిని వ్యతిరేకించేవారు ఆయనపై కినుక వహించారు. ఆంధ్రభూమి వంటి పత్రికలలో గురజాడ 'సంస్కృతీ విధ్వంసకుడు' అని నిందించే వ్యాసాలు వస్తే రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ఆయన 'ఏ సంస్కృతికి విధ్వంసకుడో' కొత్తగా సమాధానం రాయవలసి వచ్చింది. ఇలా చూస్తే గురజాడపై వివిధ పార్శ్వాల నుంచి విమర్శలూ, దాడులూ కొనసాగడం నిరంతరంగా జరుగుతుందంటే ఆయన ప్రభావం ఎంత బలంగా వుందో తెలియడానికి అదే ఒక ఉదాహరణ.

కన్యాశుల్కంపై 1980ల తర్వాత అధ్యయనం, ఆసక్తి పెరిగాయని హరి పురుషోత్తమరావు సరిగ్గానే గుర్తించారు. 1992లో ఆ నాటకం శతవార్షికోత్సవాలు జరిగాక దాన్ని ఒక నూతన రచనగానే పరిగణించి, పరామర్శించే పరిస్థితి ఏర్పడింది. ఇలాంటి పరిణామాలన్నీ కలసి గురజాడపై నూతనాసక్తి పెంపొందించాయి. అయితే ఆ ఆసక్తి పెరిగినంతగా అధ్యయనం జరిగిందా? నూతన విషయాలు దృక్కోణాలు వెలుగులోకి వచ్చాయా అంటే చెప్పడం కష్టం. ఎందుకంటే ఈ ప్రశంసలల్లో విమర్శల్లో అత్యధిక భాగం ఆయన రచనల్లో కొన్నింటి చుట్టూ తిరిగాయి. కన్యాశుల్కం, దేశభక్తి గీతం, కొన్ని కథలు వీటిపైనే చర్చ వస్తుంటుంది. అందులోనూ కన్యాశుల్కం పట్ల చాలా మందికి వీరారాధన. పరిశీలనను మించిన పారవశ్యం వారిది. ఈ క్రమంలో గురజాడ వ్యక్తిత్వాన్ని, శక్తిత్వాన్ని తగినంతగా పరిశీలించే ప్రయత్నం జరగకపోవడం వాస్తవం. రాచమల్లు రామచంద్రారెడ్డి మాటలలో చెప్పాలంటే గురజాడ వ్యక్తిత్వాన్నీ ఆధునికతనూ వారు సమగ్రంగా దర్శించలేకపోయారు.

4

సమకాలీనులను మినహాయించితే గురజాడను తెలుగువారికి బాగా పరిచయం చేసిన వ్యక్తిగా మొదటగా చెప్పుకోవలసింది శ్రీశ్రీనే. ఇక ఆయన రచనలను అందించిన వారిలో ప్రథమ స్మరణీయుడు అవసరాల సూర్యారావు. గురజాడ రాతప్రతులను అర్థంచేసుకుని, అనువదించిన వ్యక్తి ఆయనే. చాలా ఏళ్లపాటు అవన్నీ గురజాడ రాసినవే అనుకున్నారు గానీ అనువాదమన్న మాట కూడా మర్చిపోయారు. ఆరోజులలో అవసరాల ఒక చేయి పనిచేయక, చాలా పేదరికంలో వుంటూ కూడా అంకితభావంతో ఈ యజ్ఞం నెరవేర్చాడు. గురజాడ ఏ పదం ఎలా వాడతాడో అవసరాలకు తెలిసినట్టు మరెవరికీ

**సమకాలీనులను మినహాయించితే గురజాడను తెలుగువారికి బాగా పరిచయం చేసిన వ్యక్తిగా మొదటగా చెప్పుకోవలసింది శ్రీశ్రీనే. ఇక ఆయన రచనలను అందించిన వారిలో ప్రథమ స్మరణీయుడు అవసరాల సూర్యారావు. గురజాడ రాతప్రతులను అర్థంచేసుకుని, అనువదించిన వ్యక్తి ఆయనే. చాలా ఏళ్లపాటు అవన్నీ గురజాడ రాసినవే అనుకున్నారు గానీ అనువాదమన్న మాట కూడా మర్చిపోయారు. ఆరోజులలో అవసరాల ఒక చేయి పనిచేయక, చాలా పేదరికంలో వుంటూ కూడా అంకితభావంతో ఈ యజ్ఞం నెరవేర్చాడు.**

తెలియదని ఆరుద్ర అంతటి పరిశోధకుడే మెచ్చుకున్నాడు. ఇప్పుడు సంపుటాల కొద్దీ ముద్రించేందుకు అవసరమైన ఆర్థిక వనరులు, సాంకేతిక సదుపాయాలు వున్నాయి గానీ, ఆ రోజులు వేరు. స్కానర్ల సహాయంతో ఇమేజి పెంచి, చూసుకునే సదుపాయాలు లేవు. కంప్యూటర్లూ లేవు. అప్పట్లోనే అన్ని సంపుటాలు క్రమబద్ధంగా పూర్తిచేయడంలో ఆయన నిబద్ధత కనిపిస్తుంది. దురదృష్టవశాత్తూ ఈ క్రమంలో కొన్నిచోట్ల అనువాదాల తప్పులు దొర్లినమాట నిజమే గానీ, మరీ భావానికి హాని కలిగించేవి ఒకటి, రెండుచోట్లనే వచ్చాయి. తర్వాత కాలంలో చాలా శ్రమపడి, ఇంగ్లీషు మూలాలను తెప్పించిన పాత్రికేయుడు పెన్నేపల్లి గోపాలకృష్ణ, ఆయన కూడా అవసరాల శ్రమను అభినందిస్తూ అక్కడక్కడా లోపాలున్నా, ఆయన కృషి అమోఘమని కొనియాడారు. ఈ సహృదయత వాస్తవికత లేకపోగా అవసరాలపైన, ఆయన ప్రాతినిధ్యం వహించే అభ్యుదయ ఉద్యమంపైన వ్యతిరేకత కారణంగానే కొందరు పనిగట్టుకుని ఆ మహత్తర కృషి మొత్తానికి మసిపూసే ప్రయత్నాలు చేశారు. కొందరు సంపాదకుల ప్రేరణపై మరికొందరు సంపాదకులు ధారావాహికలు రాశారు. అయినా చరిత్ర ఎంత కఠినమైందో, అంత వాస్తవికమైంది కూడా. అవసరాల సూర్యారావు పాత్రను అప్పారావును తల్చుకునేప్పుడు తప్పక గుర్తు చేస్తుంది.

అవన్నీ గురజాడ రచనల సేకరణ కాగా ఆయనపై వచ్చిన తొలి మహత్తర గ్రంథం కెవిరమణారెడ్డి 'మహోదయం'. అందరి మన్నన పొందిన ప్రామాణిక రచన. అయితే అందులో కెవిఆర్ చరిత్రను చెప్పడానికి గురజాడేతర అంశాలకు చాలా ప్రాధాన్యతనివ్వడం వల్ల గ్రంథం విస్తరించడమేగాక, సూటిదనం కొరవడింది. దాంతోపాటు కొడవటిగంటి కుటుంబరావు, రాచమల్లు రామచంద్రారెడ్డితో సహా విమర్శకులందరూ పేర్కొన్నట్టు కెవిఆర్ భాష ఒక పెద్ద ప్రతిబంధకమైంది. గొట్టు భాషలో చుట్టూ తిప్పి చెప్పడం వల్ల, అనవసర భాషా విన్యాసాల వల్ల 'మహోదయం' పండితుల రచనగానే మిగిలిపోయింది. వ్యవహారిక భాష కోసం అంతగా పరితపించిన గురజాడ విషయంలో ప్రత్యేకంగా ఇదొక అపశ్రుతేగానీ కెవిఆర్ తన శైలిని మార్చుకోలేకపోయారు. పైగా అదే ఒక అలంకారమనీ, హక్కు అనీ పొరబడినట్టు కనిపిస్తుంది. జాతకచక్రాల నుంచి రాజుల ఔదార్యం వరకూ అన్నింటినీ పూసగుచ్చి చెప్పడంతో ఈ పుస్తకంలో గురజాడపై వుండాల్సిన కేంద్రీకరణ లేకుండా పోయింది. వాస్తవానికి ఈ రచయిత తన పుస్తకానికి 19వ శతాబ్ది భారతీయ పునరుజ్జీవనంలో గురజాడ స్థానం అని ఉపశీర్షిక కూడా ఇచ్చారు. గురజాడ అధ్యయనికి అద్యుడుగా కెవిఆర్‌నే చెప్పవలసి వుంటుంది. కానీ ఈ పరిమితుల వల్ల దాని ఆస్వాదన ఇచ్చే అవగాహన కూడా దెబ్బతిన్నాయి.

నార్ల వెంకటేశ్వరరావు కేంద్ర సాహిత్య అకాడమీ కోసం రాసిన గురజాడ జీవితచరిత్ర మంచి పుస్తకమే గానీ చాలా చిన్నది. పైగా ఆయన స్వంత భావనలపై అధికంగా ఆధారపడ్డారు. గురజాడను కమ్యూనిస్టులు ముందుకు తేవడం ఆమోదించలేని వ్యక్తి గనుక, కొన్ని తీవ్రమైన పరిమితులు ఏర్పడ్డాయి. పైగా అప్పటికి వచ్చిన సమాచారం కూడా ఏమంత ఎక్కువ కాదు, కెవిఆర్‌లాగా తను ప్రత్యేకంగా పరిశోధించిందీ లేదు. ఈ నేపథ్యంలో నార్ల పుస్తకం ఒక రేఖామాత్ర చిత్రణనే ఇవ్వగలిగింది. వేమన విషయంలోనూ నార్ల ప్రధానంగా ఆయన పద్యాల నుంచి జీవిత చిత్రం వూహించేందుకు ప్రయత్నించారు. గురజాడ విషయంలో అలా చేయడానికి లేక మరోవిధమైన నూతన సమాచారం సేకరించక సాధారణీకరణలకే పరిమితమైనారు. ఆ సందర్భంగా విశాలాంధ్ర సంస్థ నుంచి తీసుకున్న గురజాడ మూలప్రతులను అనువాద దోషాల పరిశోధనకు ప్రధానంగా ఉపయోగించుకుని తన తత్వం బయిటపెట్టుకున్నారు. తను సంపాదకుడుగా ఆంధ్రప్రభలో ఆ కాలంలో 'కామ్రేడ్ గురజాడ' అంటూ రాసిన వ్యాఖ్యానాలు ప్రస్తావించేందుకు తనే వెనుకాడాడు. ఇవన్నీ రాజకీయాలుగా కనిపించవచ్చు గానీ, చెప్పలేనన్ని రాజకీయాలు పనిచేశాయి గనుక చెప్పక తప్పడం లేదు.

5

ఇవన్నీ గురజాడ జీవితం రచనలకు సంబంధించి జరిగిన కొన్ని ప్రధాన ప్రయత్నాలు. కానీ చాలామంది దృష్టిలో గురజాడ అంటే కన్యాశుల్కమే. ఈ ధోరణిపై

పుస్తకంలో చాలా చర్చ వుంది. అదలా వుంచితే - కన్యాశుల్కంపై అనేకానేక అధ్యయనాలు, రచనలు వెలువడ్డాయి. ఆయన కన్యాశుల్కంపై విపరీతమైన ఆసక్తి, ఆకర్షణ పెంచాడు. తనవైన విశ్లేషణలు చేశాడు. బంగోరే అనబడే బండిగోపాలరెడ్డి ప్రత్యేకంగా కష్టపడి, కన్యాశుల్కం మొదటి ముద్రణ తీసి, ప్రచురించారు. ఘనత మలి ముద్రణదే గనుక మొదటి ముద్రణకు పరిశోధనా ప్రాధాన్యత మాత్రమే వుంటుందని పండితులు తేల్చేశారు. కన్యాశుల్కం రెండు ముద్రణలనూ మాత్రమేగాక ఆ మధ్యలో ఆయన ప్రారంభించి, అసంపూర్ణంగా వదిలివేసిన 'కొండుభట్టీయం' కూడా కలిపి చూస్తే గురజాడ ఆలోచనాధార కొంతవరకూ బోధపడుతుంది. ఎందుకంటే 'కొండుభట్టీయం' పూర్తిచేయకుండానే 'కన్యాశుల్కం' పూర్తిగా తిరగరాసే పని చేపట్టారు. కట్టమంచి రామలింగారెడ్డి, కొడవటిగంటి కుటుంబరావు, హరి పురుషోత్తమ రావు పోరంకి దక్షిణామూర్తి, ఆరుద్ర, బంగొరె, రాంభట్ల, భమిడిపాటి కామేశ్వరరావు, వంటి వారెందరో 'కన్యాశుల్కం'పై కొత్తవెలుగులు ప్రసరించారు. నాటకరంగం నుంచి మధురవాణి ఆత్మకథ, గిరీశం లెక్చర్లు వంటి పలు విభిన్న ప్రయత్నాలు జరిగాయి. 'ఆంధ్రుల పతనానికి పన్నెండు కారణాలన్న' గిరీశం మాటను పట్టుకుని బళ్లారి రాఘవ ఒక పుస్తకమే రాశారు. సర్దేశాయి తిరుమలరావు రాసిన 'కన్యాశుల్కం నాటకకళ' ప్రామాణికమైందిగా నిలిచిపోయింది. అయితే అందులోనూ ఆయన నాటక శిల్పానికి, పాత్రలకు సంబంధించిన అనేకానేక లోతుపాతులు చర్చించడం చూస్తాం. కానీ చారిత్రిక క్రమంలో దాని మూల్యాంకనమే ముఖ్యమైన విషయం. చాలా మంది విమర్శకులు ఆ విషయంలో శ్రద్ధ చూపకపోవడం వల్లనే ఛాందసులు కూడా కన్యాశుల్కం ప్రదర్శించే, ప్రశంసించే, పరిస్థితి వచ్చింది. కొందరు దాన్ని కేవలం హాస్య నాటికగా పరిగణిస్తే, మరికొందరు గిరీశంను కథానాయకుడి స్థాయిలో విశ్లేషించడం మొదలుపెట్టారు. అసలు గురజాడ సంప్రదాయ సమాజాన్ని ఆక్షేపించడం తప్ప, ఆ నాటకంలో పరిష్కారం చూపింది లేదనీ, అనుకూల, వ్యతిరేక వ్యాఖ్యాతలు ఉభయులూ వ్యాఖ్యానించడం ఆసక్తికరమైన అంశం. ఒక మహా రచయితనూ ఆయన సృజననూ నిర్దిష్ట నేపథ్యంలో, సామాజిక సారాంశంలో చూడలేని ఫలితమిది. డా.యు.ఎ.నరసింహమూర్తి యూనివర్సిటీ ప్రాజెక్టుగా కన్యాశుల్కం పూర్వాపరాలు ఆనాటి భారతీయ నాటక రంగ పరిస్థితిపై ఉద్గ్రంథమే వెలువరించారు. ఇందులో చాలా అంశాలు విశదంగా వున్నా, రచయిత నవ్య సంప్రదాయ కోవకు చెందిన వారు కావడం వల్ల విశ్లేషణలపై ఆ ప్రభావం పడింది. మొత్తంపైన కన్యాశుల్కం వ్యాఖ్యాతల్లో చాలామంది గురజాడ తనకాలాన్ని దాటిపోయి, కత్తిలా కలాన్ని ఉపయోగించిన ఉధృతిని ఆ స్థాయిలో పట్టుకోలేకపోయారనే చెప్పాలి. 'చెట్లను చూస్తూ అడవిని విస్మరించడం' అన్న ఇంగ్లీషు నానుడి చందాన వీరు కన్యాశుల్కం పాత్రలు, సంభాషణలు, నాటకీయత శిల్ప, విన్యాసం వంటివాటిపై పడి సాంఘిక ధిక్కార కోణాన్ని విస్మరించారు. కొందరు కావాలనే దాటవేశారు. ఇంకొందరు అసలా స్వభావమే లేనట్టు అదొక బ్రాహ్మణ సమాజానికి మాత్రమే పరిమితమైన నాటకమైనట్టు పొరబడ్డారు. బ్రాహ్మణీయ సమాజాన్ని సవాలు చేయాలంటే దాని అగ్రభాగాన వున్నవారి బండారం బహిర్గతం చేయడం ముఖ్యమైన్న మెళకువ లోపించింది. బాలవితంతువులుగా బానిస బతుకులీడుస్తున్న ఆ మహిళలు స్వతహాగా పీడిత లోకంలో భాగమవుతారన్న గ్రహింపు కొరవడింది. బాల్యవివాహాలు ఇప్పటికీ ఆగని వాస్తవాన్ని చూస్తూ కూడా ఇదేదో ఒక కులానికే పరిమితమన్న పాక్షిక కోణం ప్రదర్శితమైంది. మిగిలిన కులాల్లో పునర్వివాహాలు కొంత సులభం అన్న ఒక్క తేడా తప్పిస్తే బాల్యవివాహం అమ్మాయిల వేదన, ఆడవారి బాధలు వంటి విషయాల్లో ఇప్పటికీ సమస్యలు కొనసాగుతున్నాయి. అక్షరాస్యత అధికంగా వున్న కేరళలోనూ, గురజాడ నాడు అంతగా పోరాడిన ఉత్తరాంధ్రలోనూ ఇప్పటికీ బాల్యవివాహాలు అధికంగా వున్నాయని తాజా గణాంకాలు చెబుతున్నాయి.

కన్యాశుల్క వివాహాలను కందుకూరి వీరేశలింగం' నరమాంస విక్రయం'గా ఖండించడంలో చాలా అర్థం వుంది. ఈనాడు ఆ దురాచారం ఆ రూపంలో లేకపోయినా ట్రాఫికింగ్ పేరిట సాగుతున్న పరమ దుర్మార్గమైన వ్యాపారం, అక్షరాలా ఆయన చెప్పిన నరమాంస విక్రయమే. గురజాడ కూడా కొండుభట్టీయంలో దాన్ని ఆ రూపంలోనే చూపించాడు. క్రికెట్ ఆటకు కూడా చీర్‌గర్ల్స్‌ను ప్రయోగించడం, సినిమాలూ, టీవీలలో అడ్వర్టయిజ్‌మెంట్లలో స్త్రీలను శృంగార వస్తువుల కన్నా హీనంగా చూపించడం నిత్యానుభవం. ఇవన్నీ బుచ్చమ్మలు మధురవాణీల నాటికన్నా ఘోరమైన పరిస్థితికి దారితీస్తున్నాయి. పైగా ఈనాడు దేశంలో వ్యాపిస్తున్న పునరుద్ధరణ వాదం మత ఛాందసం స్త్రీల పరిస్థితిని ఇంకా దిగజారుస్తున్నాయి.

'పెద్ద మసీదు' కథలో శాస్త్రులు ముల్లాగా మారిపోవడం ఈనాటి 'ఘర్‌వాపసీ' వాదకులకు సమాధానమనుకోవచ్చు. అందులోనే బాబ్రీమసీదు విధ్వంసం ఛాయలు కూడా కనిపిస్తాయి. 'దేవుళ్లారా మీ పేరేమిటి?' కథలో హిందూ మత శాఖల వైరం పర్యవసానాలు విచిత్రం. అన్ని కథల్లోనూ స్త్రీ పాత్రలే ధిక్కారానికి సూత్రధారులు కావడం చూస్తాం. మొత్తంపైన గురజాడ కథల గురించిన అంచనాలలో భిన్నాభిప్రాయాలు తక్కువే.

6

గురజాడ కన్యాశుల్కం ఔన్నత్యాన్ని అందరూ గుర్తిస్తారు గానీ కవిత్వం విషయానికి వచ్చేసరికి అంచనాలలో విపరీతమైన తేడాలున్నాయి. సనాతనులు సరే- ప్రగతిశీల సాహిత్య కారులనేవారు కూడా ఆయనను 'అకవి' అనీ కాదంటే అల్పపరిణామంలోనే రచనలు చేసిన కవి అని చప్పరించేస్తుంటారు. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం పరిశోధనా గ్రంథంలో వేల్చేరు నారాయణరావు ఆయనను అసంపూర్ణ విప్లవకారుడుగా తేల్చేస్తే, అంతకుముందే సి.నారాయణరెడ్డి ఆయనను అర్ధ యుగకర్తగా నిర్ధారించారు. మహోదయ కర్త కెవిఆర్ కూడా గురజాడ 'యుగకర్త గానీ, శకకర్తగానీ కాకపోవచ్చు' అనడం ఆశ్చర్యకరమైన వాస్తవం. పరోక్షంగా రాయప్రోలునే తదుపరి వారు అధికంగా అనుసరించారని కూడా కెవిఆర్ విశ్లేషిస్తాడు. రాచమల్లు రామచంద్రారెడ్డి కూడా గురజాడ మేధావి గనుక హృదయగతమైన కవిత్వం ఆయన స్వభావానికి పెద్దగా పొసిగేది కాదని వింత వాదన చేశారు. ఇంకా కొంతమంది 'అకవి' అన్న వాదనతో చాలా వివాదమే నడిపించారు. వాస్తవానికి సంప్రదాయవాదులను మించి, సామ్యవాద ముద్రితులే ఈ విషయంలో పోటీపడటం విడ్డూరం. ఆఖరుకు ఆయనను అనుక్షణం నెత్తిన పెట్టుకునే శ్రీశ్రీ కూడా గురజాడను 'గద్య వాఙ్మయ ప్రవర్తకుడు' అని నామకరణం చేశారు. ప్రపంచకవి సమ్మేళనంలో తెలుగువారి తరపున పాల్గొనదగిన ఒకే మహాకవి గురజాడ అని, ఆయన కవిత్వాన్ని కొత్త మలుపుతిప్పారనీ రాశాడు కూడా. 'ముత్యాలసరాలు ఛంధస్సు గురించీ శాస్త్రీయ విశ్లేషణ చేశాడు. అయితే మొత్తంపైన శ్రీశ్రీ గురజాడ వచనాన్ని గురించి రాసిందే ఎక్కువ. దేశభక్తి గీతాన్ని, పూర్ణమ్మనూ మాత్రం అమితంగా కీర్తించాడు. గురజాడ రాసిన కవితలే తక్కువ కాగా అందులో ప్రాచుర్యం పొందినవి మరీ తక్కువనీ, దేశభక్తి, పూర్ణమ్మ మినహా మిగిలినవి పెద్దగా తెలియవనీ, చాలామంది వాదనలు తెచ్చారు. గురజాడ కవిత్వ పరిమాణాన్ని బట్టి మాత్రమే చూస్తామా లేక పరిణామ శీలతకు చేసిన దోహదాన్ని బట్టి చూస్తామా అనే విచక్షణ లేనందువల్లనే ఈ పాక్షిక ధోరణి ముందుకొచ్చిందనేది స్పష్టం. 'వాక్యం రసాత్మకం, కావ్యం' అన్న మాట ప్రాచీనులు చెప్పిందైతే, ఆధునిక ముద్రితులు ఆమేరకైనా అవగాహన చూపించకపోవడం ఆశ్చర్యమే. 'నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే, నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలేనన్న' శ్రీశ్రీ వాక్యం గురజాడకు అక్షరాలా వర్తిస్తుంది. ఆయనను ఆధునిక మహాకవిని చేస్తుంది.

7

తర్వాతి అంశం గురజాడ కథలు. వాటిలోని విషయాన్ని, విలక్షణతను గురించి చాలా చర్చ జరుగుతూనే వుంది. అయితే రెండు దశాబ్దాల నుంచి ఆయన మొదటి కథకుడా? కాదా? అన్నదానిపై చర్చ ఎక్కువగా నడిచింది. చివరకు ఆయన కన్నా ముందు రాసిన బండారు అచ్చమాంబ మొదటి కథా రచయిత్రి అని తేల్చినట్టే చెప్పొచ్చు. తేదీలను బట్టి ఈ వాస్తవాన్ని అంగీకరించేందుకు ఎవరికీ ఎలాంటి అభ్యంతరం వుండనవసరం లేదు. పైగా ఒక మహిళ మొదటి కథ రాయడం గర్వకారణం కూడా. ఇంకా చెప్పాలంటే వివిన మూర్తి గురజాడకు ముందు కథలను లేదా అలాంటి వాటిని సంకలనం చేశాడు. అవి దాదాపు వంద వరకూ వున్నాయి. వాటిలోని ఇతివృత్తం, భాష కూడా గురజాడ కోరుకున్న చైతన్యానికి వ్యావహారికానికి దగ్గరగా వుండటం యాదృచ్ఛికం కాదు. రామతీర్థ ఈ విషయమై ప్రత్యేకంగా ఒక పరిశీలన చేశారు. ఈ కథలలోనే కాదు- ఆనాటి పత్రికా రచనలలో ప్రధానాంశం స్త్రీ విద్య కావడం కూడా గమనార్హం. స్త్రీలు రాసిన వ్యాసాలు, కథలు వంటివి కూడా డజన్ల సంఖ్యలో వున్నాయి. అంటే అది ఆ నాటి చారిత్రిక అవసరమే గాక, సందేశం కూడా. దాన్ని శక్తివంతంగా అందుకోవడంలోనూ, కళాత్మకంగా సృజించడంలోనూ గురజాడ గొప్పతనం కనిపిస్తుంది. వీరేశలింగంతో పోలిస్తే సాహిత్య కోణంలో గురజాడ ప్రత్యేక శ్రద్ధ కనబరిచారన్నమాట ఇక్కడా వర్తిస్తుంది. ఆనాటి అనేకమంది ఇతరుల కన్నా ఆయన స్థాయీ, పరిధీ కూడా ఎక్కువే. రాజాస్థానంలో వున్నాడు గనుక విస్తారమైన గ్రంథ సంపదా, వ్యక్తిగత పరిచయాలూ కూడా అందుబాటులో వున్నాయి. అయితే సామాజిక

కోణంలో చూసినప్పుడు కథల్లోనూ స్త్రీల పాత్రలను శక్తివంతంగా చిత్రించడమే గాక, మత సంబంధాల సంక్లిష్టతను పట్టుకోవడంలో ఆయన విశిష్టత గోచరిస్తుంది. మనుగడ కోసం మనుషులు మతాలు, శాఖలు మార్చుకుంటారన్న సందేశమూ వుంది. 'పెద్ద మసీదు' కథలో శాస్త్రులు ముల్లాగా మారిపోవడం ఈనాటి 'ఘర్‌వాపసీ' వాదకులకు సమాధానమనుకోవచ్చు. అందులోనే బాబ్రీమసీదు విధ్వంసం ఛాయలు కూడా కనిపిస్తాయి. 'దేవుళ్లారా మీ పేరేమిటి? కథలో హిందూ మత శాఖల వైరం పర్యవసానాలు విచిత్రం. అన్ని కథల్లోనూ స్త్రీ పాత్రలే ధిక్కారానికి సూత్రధారులు కావడం చూస్తాం. మొత్తంపైన గురజాడ కథల గురించిన అంచనాలలో భిన్నాభిప్రాయాలు తక్కువే.

8

వ్యావహారిక భాషా వికాసానికి గురజాడ, గిడుగు ముందుండి చేసిన కృషిని కూడా చాలామంది యథాలాపంగా తీసేస్తుంటారు. కాదంటే కొంత విద్యాపరమైన విలువ ఇచ్చి సరిపెడతారు. వాస్తవం ఏమంటే వారు చేసిన ఆ పోరాటం సమాజాని విద్యార్జన ప్రజాస్వామీకరించేందుకు దోహదం చేసిన గొప్ప తిరుగుబాటుగా చూడవలసి వుంటుంది. జనబాహుళ్యం చైతన్యవంతం కావాలంటే చదువు కావాలి. అది జనానికి బోధపడే భాషలో వుంటేనే ప్రయోజనం. తరతరాలుగా సంస్కృతం ఇంగ్లీషు పెర్షియన్ వంటి భాషలు పాలక భాషలుగా వుండి, ప్రజలను కేవలం నిస్సహాయ పాలితులుగా మార్చాయి. తెలుగులో రాయడం చిన్నతనమనేంత ఛాందసం కూడా సనాతన వాదుల్లో వుండింది. ఇప్పటికీ మన సమాజంలో ఏదైనా సంస్కృతంలో శ్లోకం చెప్పి తెలుగీకరించడం పెద్ద గొప్పలాగా చూడటం, చూపడం నిత్యానుభవమే. మరి వందేళ్ల కిందట మరెంత ఘోరమైన పరిస్థితి వుండేదో ఊహించవచ్చు. అప్పట్లో తెలుగును చెప్పేది, చదివేది కూడా ఛాందస వర్గాలే కావడంతో, ప్రాచీన నియమావళిని అనుల్లంఘనీయమైనవిగా పరిగణిస్తూ, ఆ పరిధిలో తమ పాండిత్యం ప్రదర్శించి, కాలం గడుపుకోవడం పరిపాటిగా వుండేది. పద్యాలు తప్ప, సులభ రచనల ప్రసక్తే వుండేది కాదు. అసలే చదువులు చాలా తక్కువగా వుండి- చాలా కులాలకూ, స్త్రీలకూ విద్య నిరాకరించబడిన ఒక సమాజంలో బ్రిటిష్ మిషనరీల కారణంగా చదువు అందుబాటులోకి వస్తే, పాఠాలు, పరీక్షలు గ్రాంథికంలో వుండటం పెద్ద శాపమే అయ్యేది. దీన్నే గురజాడ, గిడుగు ఆక్షేపించారు. ఆ విధంగా నీరు గొప్ప ప్రజాస్వామిక కర్తవ్యం నిర్వహించారు. ఇందుకోసం అనేక స్థాయిల్లో పోరాటాలు చేశారు. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలన్నట్టు మహాపండితులు కూడా వ్యాకరణ సూత్రాలను పాటించలేకపోతున్నారని నిరూపించారు. పండిత పరిషత్తులలో పత్రికా వేదికలలో పాఠ్యపుస్తకాల కమిటీలలో, విద్యావిధాన నిర్ణయ సంస్థలలో బహుముఖీన పోరాటం చేశారు. గిడుగు మెమోరాండం, గురజాడ అసమ్మతిపత్రం ఈ క్రమంలో చారిత్రిక ప్రాధాన్యత పొందాయి. గురజాడ అవసానదశలో కూడా గిడుగును పిలిచి, ఈ విషయమై ఆవేశంగా, ఆవేదనగా మాట్లాడుతుంటే, డాక్టర్లు రావద్దని చెప్పి, ఆపాల్సి వచ్చింది. అయినా సరే 1915 నవంబరు 29న అంటే మరణానికి ఒకరోజు ముందు గురజాడ రాసిన ఆఖరి ఉత్తరం గిడుగుకే కావడం ఆయన దీక్షను తెలియజేసే గొప్ప ఉదాహరణ. శాస్త్రీయమైన ప్రజాస్వామికమైన వాదనను గట్టిగా వినిపించారు గనుకే ఆ మిత్రద్వయం ఆలస్యంగానైనా విజయం సాధించాయి.

9

గురజాడ, కందుకూరో – ఆత్మకథ, డైరీలు, లేఖలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, తదితర అనేక ప్రక్రియల్లో నూతనత్వం ప్రవేశపెట్టారు. గురజాడ డైరీలు, లేఖలు, విజ్ఞాన భాండాగారాలేగాక వ్యక్తిత్వ సంకేతాలు. వాటిలో ఆయన ప్రస్తావించని అంశమంటూ లేదు. నూతనత్వాన్ని గుర్తించడం, ఆహ్వానించడం, నీతి నియమాల పట్ల గతానుగతికంగా వస్తున్న ప్రబోధాల్లో డొల్లతనాన్ని ఎత్తిచూపడం వీటి ప్రత్యేకత. అలాగే తమ కృషి పట్ల ఉద్యమం పట్ల అపారమైన ఆత్మ విశ్వాసం కూడా వాటిలో తొణకిసలాడుతుంటుంది. కవి, రచయిత మాత్రమే గాక విజయనగర సంస్థాన ముఖ్యుడుగా శాసన పరిశోధకుడుగా విద్యాధికారిగా పాత్రికేయ రచయితగా తనకంటే పెద్దవారికి, చిన్నవారికి కూడా ప్రియమైన స్నేహితునిగా గురజాడ మనోభావాలు వాటిలో ప్రతిఫలిస్తాయి. అలాగే ఆత్మీయుల మరణానికి తల్లడిల్లే మానవాంత:కరణం, అసహాయులను ఆదుకునే మానవీయకోణం, అవినీతి, అధికారదర్పాలను అంచుకు రానివ్వని నిక్కచ్చితనం గోచరిస్తాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే వీటిని చదవడం గొప్ప అనుభవం. భిన్న కాలాలను ఒక యుగకర్త కళ్లతో చూసిన భావన మిగులుతుంది. అదే సమయంలో దార్శనికుడుగా, విమర్శకుడుగా ఆయన ఎక్కడా సంకోచం లేకుండా తన భావాలు ప్రకటిస్తాడు. లేఖలలో ఆయన రాసిన అంశాలు ఒకటైతే, ఆయనకు రాసిన వారు కూడా గొప్ప గౌరవం

*గురజాడ, కందుకూరి సంఘ సంస్కరణ విషయంలోనే కాదు– ఆత్మకథ, డైరీలు, లేఖలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, తదితర అనేక ప్రక్రియల్లో నూతనత్వం ప్రవేశపెట్టారు. గురజాడ డైరీలు, లేఖలు, విజ్ఞాన భాండాగారాలేగాక వ్యక్తిత్వ సంకేతాలు. వాటిలో ఆయన ప్రస్తావించని అంశమంటూ లేదు. నూతనత్వాన్ని గుర్తించడం, ఆహ్వానించడం, నీతి నియమాల పట్ల గతానుగతికంగా వస్తున్న ప్రబోధాల్లో డొల్లతనాన్ని ఎత్తిచూపడం వీటి ప్రత్యేకత.*

ప్రకటిస్తారు. ఆఖరుకు రాజకుటుంబంలోనూ, తరాలు మారినా, మనుషులు మారినా ఆయనకు అగ్రపీఠం అలాగే కొనసాగిస్తారు. ఈ కారణాల వల్ల గురజాడ డైరీలు, లేఖలు, మాటామంతీ వంటివి కూడా చాలా ఆసక్తి, రేకెత్తిస్తాయి. చరిత్ర, సంస్కృతి గురించి ఆయన పరిజ్ఞానం అగాథమైనది. ఈ కారణంగానే భవిష్యత్తును కూడా సరిగ్గా దర్శించగలిగాడు.

10

కందుకూరి, గురజాడ బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా స్వాతంత్ర భావన బలపర్చలేదన్నది ఒక నిరంతర విమర్శ. వారి కాలానికే కొందరు ఆ విధమైన కృషీ, రచనలూ చేస్తున్న మాట నిజం. అయితే వారి దృష్టి ప్రధానంగా సంఘ సంస్కరణపైనే వుంది. పైగా గాంధీ కూడా ఇంకా రంగప్రవేశం చేయలేదు. కాంగ్రెస్ కూడా విశ్వసనీయ సంస్థగానే వుంది. ఈ నేపథ్యంలో చూస్తే వారి పరిమితి ఏమీ ఆశ్చర్యంగా గానీ అభ్యంతరంగా గానీ అనిపించదు. అయితే వారుభయులూ కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారనీ, దానిపై వ్యాసాలు రాశారనీ గుర్తుంచుకోవాలి. ఈనాటి ప్రముఖ రచయితలు ఎంతమంది ఆవిధమైన ప్రత్యక్ష, బహిరంగ వ్యాఖ్యానాలకు సిద్ధమవుతున్నారో చూస్తే, వారి బహుముఖ చైతన్యం అర్థమవుతుంది. వ్యక్తుల రాజకీయ సాంఘిక చైతన్యాల మధ్య తేడా చాలామంది విషయంలో చూస్తాం. కనుక దీన్నీ అరిగిపోయిన విమర్శగా పరిగణించక తప్పదు. దీనిపైనా ఈ పుస్తకంలో విశ్లేషణ వుంది గనుక ఇక్కడ ఇంతటితో సరిపెడదాం.

11

ఎవరినైనా వారి కాలాన్ని, స్థలాన్ని బట్టి అంచనా వేయగలం. కానీ తన కాలంలో సంఘానికి, సాహిత్యానికి గురజాడ చేసిన సేవల అంచనాగానీ, పునరంచనా గానీనలభైలలో తెలుగునాటి రాజకీయాలను బట్టి జరగడం ఒక వైపరీత్యం. ఇక్కడ స్పష్టంగా ప్రగతిశీలత, ప్రగతి నిరోధకత్వం అనే కొలబద్ధలు కారణమవుతుంటాయి. తన కాలంలోనూ, తర్వాతా కూడా ప్రగతినిరోధకులకు గురజాడ ఒక పెద్ద ప్రత్యర్థి. కానీ ఆధునిక రాజకీయాలు మొదలైనాక, గురజాడను కూడా సరిగ్గా అంచనా వేయలేదంటే ఆయన భావాలను కమ్యూనిస్టులు ప్రధానంగా ముందుకు తేవడమే కారణం. వారికన్నా ముందే మరెవరైనా ఆ పనిచేసి వుండొచ్చు గానీ, చేయకపోవడానికి కారణం ఆ భావాల పట్ల భయమే అనుకోవాలి. తర్వాత కమ్యూనిస్టులు చొరవ తీసుకుని, గురజాడ రచనల ప్రచురణ పాటలు, బుర్రకథల వ్యాప్తి చేపట్టాక ఆయన 'కామ్రేడ్ గురజాడ'గా కనిపించాడు. మరణానంతర పురస్కారాల్లా గురజాడను ఆవిధంగా కమ్యూనిస్టులలో చేర్చారు వ్యతిరేకులు. అదో దశ. కాగా అభ్యుదయ ఉద్యమంలో భాగమైనవారు కొందరు కూడా ఆవిధమైన పొరబాట్లకే కారణమైనారు. గురజాడను సమకాలీకులు ఎంతగా గౌరవించారో, పైన చెప్పుకున్నాం. ఆవిధమైన వాతావరణం తర్వాత లోపించింది. శ్రీశ్రీకి రావలసిన దానికన్నా ఎక్కువ పేరు వచ్చిందనే వాదన ఒకటి పెరిగింది. గురజాడ కీర్తిని కూడా ఆయన తన ఖాతాలో వేసుకున్నాడన్న విమర్శలు ఆరుద్ర, సోమసుందర్, రోణంకి, అప్పలస్వామి వంటివారి నుంచి తీవ్రంగా ముందుకు వచ్చాయి. శ్రీశ్రీ యుగం అనాలా? గురజాడనే నవ్య సాహిత్య యుగకర్తగా పరిగణించి సరిపెట్టాలా? అనే చర్చ తీవ్రంగానే నడిచింది. గురజాడపై సాధికారికంగా సమగ్రంగా రాసిన మొదటి వ్యక్తి శ్రీశ్రీ గురించి ఈ విధమైన విమర్శలకు ఆస్కారమే లేదు. 'నవ్య సాహిత్య జనకుడు' అని ఆయనే గురజాడను అభివర్ణించాడు. 'ఆయన రోడ్డు వేస్తే, ఆ మార్గాన్ని తాను వెడల్పు చేశాన'ని కూడా చెప్పుకున్నాడు. అయితే నిజానికి గురజాడ తర్వాత రెండు దశాబ్దాలకు 'మహాప్రస్థాన'ం గీతాలందించిన శ్రీశ్రీ స్థానానికి గురజాడ స్థానానికి పోటీ పెట్టి చూడడమే కృత్రిమ వ్యవహారం. భావాల పరంగా తన కాలానికి గురజాడ సాంఘిక దార్శనికుడైతే, తన కాలానికి శ్రీశ్రీ కవిత్వం పూర్తిగా విప్లవ సందేశం. సామాజిక అంశాల్లో మాత్రం గురజాడను, శ్రీశ్రీని పోల్చలేము. ఎందుకంటే ప్రధానంగా వర్గ చైతన్యమే శ్రీశ్రీ కవిత్వానికి దిక్సూచి అయింది. దళితుల గురించి ప్రస్తావించకపోవడమే గాదు– స్త్రీల విషయంలోనూ గురజాడ చాలా ముందున్నాడు. మధురవాణిని సృష్టించి, వేశ్యలను కూడా గౌరవించాలని లేఖల్లో పేర్కొన్న గురజాడకూ –

వ్యభిచార వనిత దగ్గరకు వెళ్లడం అంటే సిగరెట్ తాగడంతో సమానమని రాసిన శ్రీశ్రీకి ఎలాంటి పోలిక లేదు. శృంగార విషయాలకు సంబంధించి భార్యను కూడా శ్రీశ్రీ ప్రస్తావించకుండా వదల్లేదు. అది ఆయన చాపల్యం. కానీ గురజాడ భార్యను సమున్నత స్థానంలో నిలపడమే కాదు- 'ప్రాణమిత్రుడ నీకు అనీ, తను వుంటేనే కలిమి' అనీ గొప్ప గౌరవం ప్రకటించాడు. తన కాలంలోనే గురజాడ బ్రాహ్మణ సమాజం నుంచి వెలివేత వంటిది ఎదుర్కొన్నాడు. శ్రీశ్రీ అదే విజయనగరంలో ఇష్టం లేదంటూనే బ్రాహ్మణ సంఘం సత్కారం వంటిది అందుకున్నాడు. జంధ్యం పోగును గురజాడ అపహాస్యం చేస్తే, శ్రీశ్రీ ఐ గీతంలో దాన్ని పవిత్రతకు ప్రతీకగా ఉటంకించాడు. ఆయన కోణంలో దాన్ని అర్థం చేసుకోవచ్చు గానీ గురజాడతో పోల్చి చూసినప్పుడు ఇవన్నీ వెలవెలబోయే అంశాలే. అయితే ఇక్కడా సాంఘిక, రాజకీయ చైతన్యాల తేడా సూత్రమే వర్తిస్తుంది.

12

గురజాడ విషయంలోనూ చాలాకాలం కొందరు విమర్శకులు ఉపరితల వ్యాఖ్యానాలు, అనుచిత అవహేళనలు చేస్తూ వచ్చారు. ఆయనకు సంబంధించిన చాలా విషయాలు విశ్లేషించిన రాచమల్లు రామచంద్రారెడ్డి గురజాడ మనస్తత్వంలో విపరీత ధోరణులు అని శీర్షిక ఇవ్వడం ఇలాంటిదే. రచనల తత్వాన్ని చూడటం తప్ప మనస్తత్వ విశ్లేషణ మొదలుపెట్టి, అది విపరీతమైందని సూత్రీకరించడం నిజంగా విపరీతమే! కెవిఆర్‌లోనూ ఈ పోకడ కొంత వుంది. ఇక్కడ విమర్శకులుగా ఉభయులూ తమ పరిధి దాటిపోయారని చెప్పక తప్పదు. ఉన్న ఆధారాలను బట్టి చేసిన రచనలలో వ్యక్తమయ్యే దాన్నిబట్టి ఏదైనా చెప్పాలి తప్ప, ఆ సమయంలో అక్కడే వుండి చూసిన వారిలాగా రాసే హక్కు మనకులేదు. ఎప్పుడో పోయినవారి రసికత గురించో, సరసత గురించో రాయడం కుతూహలం తీర్చడానికి తప్ప, అవగాహన పెరగడానికి దోహదపడదు. శ్రీశ్రీ విషయంలోనూ వ్యక్తిగత పరిశీలనలు శ్రుతిమించి, నష్టం చేశాయి. ఆఖరుకు బూదరాజు రాధాకృష్ణ సాహిత్య అకాడమీ కోసం రాసిన పుస్తకంలోనూ అవే పెద్దపీట వేసుకున్నాయి. తన కాలంలోనూ, తర్వాత ఈ విమర్శకుల హయాంలోనూ గురజాడకు కూడా ఆ స్థితి కొంతవరకూ తప్పలేదు. కానీ ఈనాటికి వచ్చేసరికి సాహిత్య, సామాజిక సేవలే ప్రధానంగా చూడాలన్న మెళకువ పెరిగింది.

13

గురజాడ భావాలకూ, సంస్కరణలకూ ఇప్పుడు గతం కన్నా ప్రాధాన్యత పెరిగింది. అందుకు దేశంలో వచ్చిన రాజకీయ, సామాజిక దుష్పరిణామాలు కూడా ఒక కారణం. ప్రపంచీకరణలో భాగంగా మత, మార్కెట్ తత్వాలు విజృంభించిన నేపథ్యం ఇందుకు ప్రధాన భూమిక. ఎప్పుడో తిరస్కరించిన ఛాందసాలు, మూఢ విశ్వాసాలు కొత్తగా వూపిరి పోసుకుంటున్నాయి. కావాలని పోస్తున్నారు. అన్నీ వేదాల్లో వున్నాయష అనే అగ్నిహోత్రావధాన్లు కంప్యూటర్లలోంచే పుట్టుకొస్తున్నారు. స్వచ్ఛ భారత్ వంటి వట్టి మాటలు కట్టిపెట్టి, దేశి సంపద పెంచే గట్టి మేల్ తలపెట్టవలసిన తరుణం. మతాల వారి మంటలు పెట్టే మాటలు కట్టిపెట్టి, చెట్టపట్టాల్ పట్టుకుని దేశస్తులందరు నడవాల్సిన సమయం. మంచి గతమున కొంచెమేనోయ్ అన్నమాట గతకాలము మేలు వచ్చు కాలముకంటెన్ అన్న మహాభారత భావనకు పూర్తి విరుద్ధమైన యుగ సందేశం. జాతీయోద్యమంలోనూ, ఒక పెద్ద భాగం పునరుద్ధరణ వాదం వైపు చూస్తున్న తరుణంలో దాన్నుంచి విడగొట్టుకున్న ఆధునికత ఇది. గురజాడ ఎలాంటి శషభిషలు లేకుండా ఛాందసాన్ని తిరస్కరించాడు. వ్యావహారిక భాషా వాదంలో ఆయన సూటిగానే బ్రాహ్మణాధిక్యతను ఛేదించవలసిన అవసరం చెప్పాడు. ఆ వాదానికి అంతటి వ్యతిరేకత తెలిపిన వారంతా మౌలికంగా సనాతన భావజాలం నుంచి బయిటపడని వారే. కందుకూరి తాపీ ధర్మారావు వంటివారు ఉత్తరోత్తరా వ్యావహారిక భాషా వాదులైనారు. కానీ కొందరు ఇప్పటికీ దాన్ని వదలిపెట్టలేరు. విశ్వనాథ్ కళాఖండాలను మనం మెచ్చుకున్నా, ఆ నేపథ్యంలో వేటూరి, సిరివెన్నెల వంటివారు, ఆత్రేయ, తదితరుల సులభశైలిని వదలిపెట్టి సంస్కృత పద గుంఫనం పునః ప్రవేశపెట్టడం ఇటీవలి అనుభవమే. తెలుగు పేరిట సాగే హడావుడిలో చాలా భాగం గురజాడ వరవడికి వ్యతిరేకమైన సనాతనత్వ ప్రేరితమే. ఆధునిక, ఆధునికానంతర సాహిత్యకారులు చాలా మంది సమాజాన్ని స్మరిస్తూనే, స్వీయ పురా వైభవ స్మరణలోనో, అస్తిత్వ వేదనలోనో మునిగిపోవడం కూడా వాంఛనీయమైంది కాదు. కనుక ఇప్పుడు మరోసారి గురజాడను చదవడం ఇలాంటి వాటిని చక్కదిద్దడానికి, వెనక్కు కొట్టడానికి దోహదపడుతుంది. ◈



తండ్రి వేంకటరామదాసు, కొడుకు రామదాసుతో
గురజాడ అప్పారావు

# మా నాయన గారు

◈ గురజాడ రామదాసు

నాన్న గారి మృతి అనంతరం ఒకనాడు గిడుగు రామమూర్తి పంతులుగారు నాకు సలహాయిస్తూ, నాన్నగారి కృతులను యథాతథంగా ప్రచురించమనీ, ఏ విధమైన మార్పులు చేయవద్దనీ అన్నారు. ఆయన రచనలన్నీ దూరదృష్టితో సాగినవీ, సోషలిస్టు దృష్టితో సాగినవీని. మన దేశంలో కమ్యూనిజం ప్రవేశించినపుడు నాన్నగారి కృతులలో వారికుపయోగపడినవన్నీ వారు వినియోగించుకొని అచ్చువేశారు.

హిందూ సంఘ సంస్కారానికీ, వ్యావహారిక భాషా వికాసానికీ మా నాన్నగారు చేసిన కృషిని గుర్తించడానికి, ఆంధ్ర ప్రజకు అర్థశతాబ్దికాలం పట్టింది. ఆయన మృతి అనంతరం రెండు దశాబ్దాలపాటు 'కన్యాశుల్కం' రచయితగా మాత్రమే వారిని తెలుగు ప్రజలు ఎరుగుదురు. ఆయన జీవితకాలంలో ఒక సాంఘిక నాటకము, 'మినిట్ ఆఫ్ డిస్సెంట్', 'నీలగిరి పాటలు' మాత్రమే ప్రచురించారు. నీలగిరి పాటలు రీవా మహారాణికి అంకితమైనవి. 'మినిట్ ఆఫ్ డిస్సెంట్' ఆయన మద్రాసు విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యుడుగా వుండగా, తెలుగు కాంపోజిషన్ కమిటీ తీర్మానానికి వ్యతిరేకంగా వ్రాసినది. మద్రాసు గవర్నరు కార్యదర్శి గెల్లెటి సూచనానుసారం నీలగిరి పాటలను ఇంగ్లీషులోకి అనువదించారు. విజయనగర సంస్థానోద్యోగులలో ఆయన ప్రముఖుడుగా వుండేవారు. ఆయన కాలమంతా సంస్థాన వ్యవహారాలు చూడటానికే సరిపోయేది. 1912లో మహారాజకుమారి మృతినొందేవరకు సంఘ సంస్కార విషయమై సాహిత్య వ్యాసంగం విషయమై ఆయన ఎక్కువకాలం వినియోగించలేకపోయారు. అయినా తీరిక చిక్కినప్పుడల్లా సాహిత్యకృషి చేస్తూనే వాటిని పత్రికల్లో ప్రచురించేవారు. ఆయన కృతులలో చాలాభాగం అసంపూర్ణాలే. ఆయన అనంతరం కొన్నిటిని సేకరించి, 1929లో ఒక పుస్తకరూపంలో 'ముత్యాలసరాలు' పేరుతో నేను ముద్రించాను. 1927లో కన్యాశుల్కం కన్నడప్రతి వెలువడింది. దానికి అప్పటి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు కట్టమంచి రామలింగారెడ్డిగారు పీఠిక వ్రాశారు. ముత్యాలసరాలు, ప్రచురితమైన సంవత్సరంలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయం బి.ఎ. ఆనర్సు విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా చేసింది. మరుసటి సంవత్సరం ఒరిస్సా ఉన్నత పాఠశాల విద్యార్థులకు పాఠ్య గ్రంథమైంది.

అది మొదలు ఆంధ్ర ప్రజకు నాన్నగారి కృతుల మీద ఆసక్తి పెరిగింది. 1936లో విజయనగరం మహారాజా కళాశాల వజ్రోత్సవ సందర్భంలో నాన్నగారి ఇతర కృతులు కొన్ని ప్రచురించారు. ఆయనవి చాలా కృతులు అసంపూర్ణంగా

***రాయవరం జిల్లా మున్సబు కోర్టులో శిరస్తదారుగా పనిచేసే గొడవర్తి కృష్ణయ్యగారు మా తాతగారికి తమ కుమార్తె కౌసల్యమ్మను యిచ్చి వివాహం చేశారు. వివాహమైన ఆరు సంవత్సరాలకు మా మామ్మగారు గర్భవతియై రాయవరం వచ్చారు. అక్కడ 1862 సంవత్సరం సెప్టెంబర్ 21వ తేదీన ఏడుమాసాల గర్భిణిగా ఉండగానే, ఆవిడకు మా నాన్నగారు జన్మించారు.***

ఉన్నాయని యిదివరకే చెప్పాను గదా.

ఆయన లేఖిని నుండి వెలువడే ప్రతి వాక్యమూ అర్థవంతమైనది గనుక ఆ ఖండాలను ఖండాలుగానే ప్రచురించాను. నాన్న గారి మృతి అనంతరం ఒకనాడు గిడుగు రామమూర్తి పంతులుగారు నాకు సలహాయిస్తూ, నాన్నగారి కృతులను యథాతథంగా ప్రచురించమనీ, ఏ విధమైన మార్పులు చేయవద్దనీ అన్నారు. ఆయన రచనలన్నీ దూరదృష్టితో సాగినవీ, సోషలిస్టు దృష్టితో సాగినవీని. మన దేశంలో కమ్యూనిజం ప్రవేశించినపుడు నాన్నగారి కృతులలో వారికుపయోగపడినవన్నీ వారు వినియోగించుకొని అచ్చువేశారు.

గురజాడ వంశీయులు కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా గురజాడ గ్రామానికి చెందినవారు. రెండు శతాబ్దులకు పూర్వమే పట్టాభిరామయ్యగారు అనే ఆయన ఆంధ్రదేశ ప్రముఖ వ్యాపారకేంద్రమూ, ఫ్రెంచి ఈస్టు ఇండియా కంపెనీ స్థావరము అయిన మచిలీపట్టణానికి తరలివచ్చారు. పట్టాభిరామయ్యగారు మంచి వ్యవహార కుశలుడు. అప్పట్లో ఫ్రెంచి కంపెనీలో దుబాసిగా వున్న శ్రీనాథుల సీతారామయ్య అనే గోల్కొండ వ్యాపారి పట్టాభిరామయ్యగారిని తన దగ్గరకు తీసికొని ఆయన వ్యవహారాలన్నీ వీరిమీద ఉంచారు.

సీతారామయ్యగారు తనయేకైక పుత్రికను పట్టాభి రామయ్యగారికివ్వడానికి ప్రయత్నించారు. శాఖలు వేరుకావడంవల్ల పట్టాభిరామయ్యగారు మొదట్లో అంగీకరించలేదు. మొత్తం మీద ఆ వివాహం జరిగిపోయింది. ఆయనకు నలుగురు కొడుకులు కలిగారు. వారిలో రెండవ ఆయన మా ముత్తాతగారు. ఆయన మూడు వివాహాలు చేసికొన్నారు. మూడవ భార్యకు కలిగిన వెంక్రటామదాసుగారు మా తాతగారు. మా ముత్తాతగారు ఇంగ్లీషు ఈస్టు ఇండియా కంపెనీలో చిన్న ఉద్యోగిగా వుండేవారు. ఆయన పెద్దన్న కొండయ్యగారు విశాఖపట్టణం జిల్లా హెడ్ పోలీసుగా వుండేవారు. మా తాతగారు ఆజానుబాహువు, విశాల నేత్రుడు, ఒకప్పుడు విజయరామ గజపతిరాజు వారి పెదగాడి ఠాణాలో వుండి కొండయ్యగారిని పిలిచి మద్రాసులోని కంపెనీ డైరెక్టర్లను తమ పరిపాలనా విషయాలపై సుదీర్ఘ నివేదికనొకదానిని తయారు చేసి పంపవలసిందని కోరారు. అప్పుడు మా ముత్తాతగారు, తన తమ్ముడి కొడుకుచేత యీ పని చేయించవచ్చునన్నారు. మా తాతగారు దాని నకలును యిచ్చిన వ్యవధి కన్నా తక్కువ వ్యవధిలోనే చక్కని దస్తూరితో తయారు చేయగలిగారు. మహారాజావారు చాలా సంతోషించి వారికేమి యివ్వాలని మా ముత్తాత గారిని అడిగారు. తమ సంస్థానంలో ఏదైనా ఉద్యోగ మిప్పించమన్నారు. అప్పుడు చీపురుపల్లి ఠాణకు పేష్కరుగా మా తాతగారు నియుక్తులైనారు. క్రమంగా అనేక పదవులు నిర్వహించి విజయనగరం ఖిల్లేదారుగా ఆయన విశ్రాంతి తీసి కొన్నారు. రాయవరం జిల్లా మున్సబు కోర్టులో శిరస్తదారుగా పనిచేసే గొడవర్తి కృష్ణయ్యగారు మా తాతగారికి తమ కుమార్తె కౌసల్యమ్మను యిచ్చి వివాహం చేశారు. వివాహమైన ఆరు సంవత్సరాలకు మా మామ్మగారు గర్భవతియై రాయవరం వచ్చారు. అక్కడ 1862 సంవత్సరం సెప్టెంబర్ 21వ తేదీన ఏడుమాసాల గర్భిణిగా ఉండగానే, ఆవిడకు మా నాన్నగారు జన్మించారు. ప్రసవ సమయంలో కృష్ణయ్యగారు భయపడి వైద్యుల్ని పిలిపించగా, వారు పరీక్షించి శిశు ఆరోగ్యానికేమీ లోపం లేదన్నారు. మా నాన్నగారికి మూడవ నెల వచ్చాక వారిని తీసికొని చీపురుపల్లి వచ్చి చేరారు. అయిదవ ఏట ఆయనకు అక్షరాభ్యాసం జరిగింది. అతి త్వరలోనే ఆయన, చదవటం వ్రాయటం నేర్చుకోగలిగారు. ఆయన తన 7వ ఏట విజయనగరంలో ఒక మాధ్యమిక పాఠశాలలో చేరారు. మా తాతగారి ఉద్యోగం చాలా కొద్దిపాటిది అయినందున విజయనగరంలో ఒక ఇల్లు తీసికొని మానాన్నగారి విద్యాభ్యాసానికి కావలసిన ఏర్పాట్లు చేసేందుకు తగిన తాహతు లేకపోయింది. అందువల్ల విజయనగరం సంస్థాన దివాను అయిన జగన్నాథ రాజుగారిని ఆశ్రయించి, మా నాన్నగారి విద్యాభ్యాసానికి సహాయపడవలసిందిగా కోరారు. దివానుగారు చాలా ఉ

దారస్వభావుడు. జీతం లేకుండా స్కూల్లో విద్యనభ్యసించడానికి ఏర్పాటు చేసి, కొద్దిపాటి ఆర్థిక సహాయం కూడా చేశారు. మహారాజా కళాశాల ప్రిన్సిపాల్ చంద్రశేఖరశాస్త్రిగారు చాలా దొడ్డమనిషి. విద్యావ్యాప్తికై ఆయన విశేషకృషి సల్పారు. కొంతమంది విద్యార్థులకు ఆయన ఇంట్లోనే భోజనవసతులు ఏర్పాటు చేశారు. మా నాన్నగారికి కూడా ఆశ్రయమిచ్చారు. ప్రిన్సిపాల్‌గారి తల్లి మా నాన్నగారిపట్ల ఎంతో అభిమానం కనబరిచి తన స్వంత కొడుకుమాదిరిగానే ఆదరించింది. మా నాన్నగారు పాఠశాలలో తన తెలివితేటల వల్ల ఉపాధ్యాయులందరి మన్ననలను పొంద గలిగారు.

మా నాన్నగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు ఏకకాలంలోనే పాఠశాలలో చేరారు. అనతికాలంలోనే వారిద్దరు మిత్రులయినారు. వారి మిత్రత్వం దినదినాభివృద్ధి చెందింది. ఇద్దరూ కూడా భాషా సంస్కరణకు కృషి నారంభించారు. హాస్యం, కవిత్వం అనేవి మా నాన్నగారికి జన్మతః అబ్బిన లక్షణాలు. ఉపాధ్యాయుల బొమ్మలు గీసి, వారిని అపహాస్యం చేస్తూ గేయాలు వ్రాశారు. ఒకసారి వారి ఉపాధ్యాయులొకరు మా నాన్నగారి జుత్తుకు, రామమూర్తిగారి జుట్టుకి ముడిపెట్టి బెంచీమీద కూర్చోపెట్టారు. ఆ ఉపాధ్యాయుడు అలా ముక్కు పొడుం కోసం బయటి కెళ్ళగానే, ప్యూన్‌ను పిలిచి ముడి విడిపించేసుకొని, క్లాసునుంచి పరారయినారు.

క్రిస్టమస్ సెలవుల్లో మా నాన్నగారు రాయవరంలోని తమ తాతగారింటికి వెళ్ళారు. ఒక రోజున తాతగారితో కలిసి మున్సిఫ్ కోర్టుకు వెళ్ళడం తటస్థించింది. కోర్టునుంచి ఆ సాయంకాలం ఇంటికి తిరిగి రాబోయేముందు, కోర్టుహాలు తలుపుపై "జి.వి.అప్పారావు, బి.ఎ., బి.ఎల్. డిస్ట్రిక్ మున్సిఫ్" అని వ్రాసి వచ్చారు. మరుసటి రోజు మున్సిఫ్‌గారు కోర్టుకు వచ్చినపుడు అది చూసి ఎవరు రాసారిది అని అడిగారు. కృష్ణయ్యగారు చూసి తన మనుమడు, బహుశా, ఇది వ్రాసి వుంటాడు అని అన్నారు. మా నాన్నగారిని పిలిపించి ఎవరీపని చేశారు అని మున్సిఫ్‌గారు అడిగారు. 'నేనే వ్రాశాను" అని మా నాన్నగారు తడుముకోకుండా నదురు బెదురు లేకుండా సమధానమిచ్చారు. మా నాన్నగారు నిజం చెప్పినందుకు మున్సిఫ్‌గారు సంతసించి, "నీవు చాలా మంచివాడివి. నీవు చాలా గొప్పవాడివవుతావు. జిల్లా మున్సిఫ్‌వేకాదు, హైకోర్టు జడ్జివి కూడా అవుతావు" అని

**మా తాతగారు చీపురుపల్లిలో కొద్దిపాటి వ్యవసాయం చేయిస్తున్నాడు. మా నాన్నగారు సెలవులకింటికి వెళ్ళినప్పుడల్లా, సాయంకాలాల్లో ఆ పొలానికి వెళ్ళి అక్కడి రైతుల జీవితం, ప్రకృతి సౌందర్యం గమనిస్తూండేవారు. తోలుబొమ్మలాట, భాగవతము అంటే మా నాన్నగారికి ఎక్కువ ఇష్టం.**

అన్నారు. మా నాన్నగారికి నదురు అనేది ఏ కోశానా లేదు.

మా తాతగారు చీపురుపల్లిలో కొద్దిపాటి వ్యవసాయం చేయిస్తున్నాడు. మా నాన్నగారు సెలవులకింటికి వెళ్ళినప్పుడల్లా, సాయంకాలాల్లో ఆ పొలానికి వెళ్ళి అక్కడి రైతుల జీవితం, ప్రకృతి సౌందర్యం గమనిస్తూండేవారు. తోలుబొమ్మలాట, భాగవతము అంటే మా నాన్నగారికి ఎక్కువ ఇష్టం. మా తాతగారు అప్పుడప్పుడు మా నాన్నగారికి కొద్దికొద్దిగా డబ్బునిస్తొంటే, అది పెట్టి విజయనగరం క్లాక్ టవర్ వద్ద సెకండ్ హాండ్ పుస్తకాలు కొంటూ వుండేవారు. ఒకరోజు పెద్దిభొట్ల శాస్త్రిగారితో తీసుకొన్న 'పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్' ను గురించి చెప్పి, దానిని నాలుగుసార్లు చదివానన్నారు. వేసంగిలో కొండల మీదికి వెళ్లినప్పుడల్లా తనతోపాటు కొన్ని గ్రంథాలను తీసికొని వెళుతుండేవారు. మద్రాసులోని అడిసన్ అండ్ కో వారు తమకే క్రొత్తగ్రంథం వచ్చినా, ముందు మా నాన్నగారికి ఒక ప్రతిని పంపించేవారు. ఇలాంటి ఒప్పందం వారిద్దరి మధ్య ఒకటున్నది. ఎస్టేటువారే వీటి ఖర్చును చెల్లించేవారు. మా నాన్నగారు అతిత్వరితంగా చదవటానికి అలవాటు పడ్డారు. మా నాన్నగారి సహాధ్యాయులైన కేసరి కామేశ్వరరావుగారు విజయనగరంలో మా యింటి ప్రక్కనే వుండేవారు. ఆయన ఒకరోజున మా యింటికి వచ్చారు. ఆ రోజున మా నాన్నగారు తత్వశాస్త్రంపై ఒక కొత్త గ్రంథం పఠిస్తున్నారు. ఒకసారి ఆ గ్రంథాన్ని తనకిస్తే చదివి యిచ్చేస్తానని కామేశ్వరరావుగారడిగారు. అది కొత్త గ్రంథమనీ, రెండు మూడు రోజులలో పూర్తిచేసి యిస్తానని మా నాన్నగారన్నారు. కామేశ్వరరావుగారు నమ్మలేక 500 పేజీలు గల ఆ గ్రంథాన్ని రెండు మూడు రోజులలో చదివి ఎలా యివ్వగల వన్నారు. అప్పుడు మా నాన్నగారు తను చదివే పద్ధతిని వివరించారు. తను వూరికే అలా పేజీలు తిరగేసి

*"నిజమే! నాకు ఆలోచనలు లావు; మనసు ప్రశాంతంగా వుండక అనేక విషయాల మీదకు దృష్టి పోతుంది. పురావస్తుతత్వ పరిశోధనలను కావించాలనే పిచ్చి ప్రబలిపోతున్నది. విజయనగరం రాజకుటుంబీకుల చరిత్ర రాయాలనే తలంపు ప్రత్యేకంగా నానాటికి హెచ్చుతున్నది. ఇందునిమిత్తమే నేను బెంగుళూరు వెళ్ళాను. ఓరియంటల్ లైబ్రరీలో గంటల తరబడి కూర్చుని, భోగట్టా సేకరించాను. సందేహాస్పదమైన ఆరోగ్యం కల వ్యక్తి సాధ్యమైనంత త్వరలో తాను చేయగల పనిని యేదో వొకటి చేయడం మంచిది. విజయనగర కుటుంబ పూర్వీకుల వంశ చరిత్రను గురించి కొన్ని కొత్త విషయాలను చెప్పగలిగితినేని అది నాకెంత ముదావహము!*

జూలై 3వ తారీఖున గాని మళ్ళా విజయనగరం చేరుకోలేదు. ఆరు నెలలపాటు మద్రాసులో ట్రీటీ ముద్రణ కార్యక్రమంలోనూ, వేరే చారిత్రక పరిశోధనా వ్యాసంగంలోనూ నిమగ్నులయ్యారు.

మద్రాసులో వున్న ఆరునెలలో అప్పారావు గారు చరిత్ర పరిశోధనలు కూడా చేశారు. మధ్యలో బెంగుళూరు వెళ్ళి వచ్చారు. బెంగుళూరులో వున్నప్పుడే 1895 ఏప్రిల్‌లోనే శాస్త్రీయ పద్ధతులలో శాసన ప్రతిబింబాలు ఎలా తీయాలన్న సంగతిని ఇలా నోటు చేసుకున్నారు.

"బ్రష్‌తో రాతిపలకను చక్కగా తుడిచి నీళ్ళలో కడగవలెను. కాగితమును నీటిలో ముంచి, పైకి తీసి, శాసనపు పలకమీద జాగ్రత్తగా నిండుగా పరచి, బ్రష్‌తో ఒత్తవలెను. శాసనములోని అక్షరములు కాయితం మీద పడేవరకు బ్రష్‌తో అదమవలెను. నీళ్ళలో కాగితాన్ని ముంచేటప్పుడు దానిని టబ్బులో బాగా ఉంచాలి. నౌకరు మొదట నాసిక పేపరును ఉంచాడు. దానిపై పైంటింగ్ పేపరును పరచాడు. రాయి మోటుగా వుండి అక్షరములు స్ఫుటముగా పడనప్పుడు, వొక సీసాలో దీపపు మసి, యింకు పొడరూ వేసి సిరావలె తయారయేటట్టు నీళ్ళు పోయాలి. ప్యాడ్‌పై కొద్ది కొద్దిగా ఈ సిరాను చిమ్ముతూ మెల్లగా వొత్తవలెను. అక్షరములు స్పష్టపడేవరకూ అలాగున యింకును పోస్తూనే ఉండవలెను." *(మహాకవి డైరీలు-పుట 42)*

అప్పారావుగారు తమ పరిశోధనల కోసం కొత్తగా శాసనాల ప్రతిబింబాలు నాసిక కాగితం పైనే తీయించాలని నిర్ణయించుకొన్నారు. శాసనపు నకళ్ళను కాపీ చేసుకోవడానికి అవసరమైన వస్తువు లన్నింటినీ సంపాదించారు. మద్రాసులో ఉన్నప్పుడే తమ ఆరోగ్యం గురించి రచనా వ్యాసంగ ప్రణాళికల గురించి ఇలా రాసుకొన్నారు.

"నేను ఇక్కడకు వచ్చి కొన్ని నెలలయింది. కాని ఇంతవరకూ నా ఆరోగ్యం తిన్నబడలేదు. ఇంతకంటే తిన్నబడుతుందన్న ఆశ నాకు లేదు. ఈ అడ్మిరాల్టి హోమ్‌లోనే ఇది బాగుబడనప్పుడు విజయనగరంలో అసలే లాభంలేదు. చుట్టుపక్కల వాతావరణం, ఇన్ని మంచి సదుపాయాలు, గొప్ప ధనవంతులకూ, ఉన్నతోద్యోగులకూ తప్పించి అన్యులకు అందుబాటులో వుండవు"

"నిజమే! నాకు ఆలోచనలు లావు; మనసు ప్రశాంతంగా వుండక అనేక విషయాల మీదకు దృష్టి పోతుంది. పురావస్తుతత్వ పరిశోధనలను కావించాలనే పిచ్చి ప్రబలిపోతున్నది. విజయనగరం రాజకుటుంబీకుల చరిత్ర రాయాలనే తలంపు ప్రత్యేకంగా నానాటికి హెచ్చుతున్నది. ఇందునిమిత్తమే నేను బెంగుళూరు వెళ్ళాను. ఓరియంటల్ లైబ్రరీలో గంటల తరబడి కూర్చుని, భోగట్టా సేకరించాను. సందేహాస్పదమైన ఆరోగ్యం కల వ్యక్తి సాధ్యమైనంత త్వరలో తాను చేయగల పనిని యేదో వొకటి చేయడం మంచిది. విజయనగర కుటుంబ పూర్వీకుల వంశ చరిత్రను గురించి కొన్ని కొత్త విషయాలను చెప్పగలిగితినేని అది నాకెంత ముదావహము!"

"ప్రస్తుతము నా ఆలోచనలో వున్నవి, మూడు విషయాలు; మహారాజా వారి వంశ చరిత్ర; ఆంధ్రనాటక రంగం; క్షత్రియుల విద్యాసమస్య. ఈ మూడింటిని గురించి యెంతో కొంత నేను కృషి చేయగలను కదా!" *(మహాకవి డైరీలు పుట 82-83)*

చెన్నపట్నంలో గడిపిన ఆర్నెల్లలోనే అప్పారావుగారు తమ ఆలోచనలలో వున్న మూడు విషయాలలో మొదటిదైన 'మహారాజా వారి వంశ చరిత్ర విషయమై పరిశోధనలు ప్రారంభించారు. మద్రాసు సెంటు జార్జికోటకు వెళ్ళి 1895 ఏప్రిలు 15వ తారీఖు నాడు 'విజయనగర వంశ చరిత్రకు ముఖ్యమైన భోగట్టాలు' సంపాదించారు. విజయనగరానికి తిరిగి వెళుతూ బెజవాడలో ఆగి జూన్ 20వ తేదీనాడు 'ఇక్కడ విజయనగరం రాజకుటుంబానికి చెందిన భోగట్టా

కావలసినంత ఉంది. శ్రీకృష్ణ విజయము (కావ్యం) రచించిన రాజకవి అత్యంత ఆత్మీయతతో వర్ణించిన యింద్ర కీలాద్రి చేరువనవున్న బెజవాడ ఎంత మనోహరంగా ఉంది" అని డైరీలో రాసుకున్నారు. తర్వాత ఇలా నోటు చేశారు.

"బెజవాడ ఒకప్పుడు దేశానికి రాజధానిగా వుండేది. చెప్పుకో తగ్గ నగరంగానే వుండేదనుకోవచ్చును. సైనిక ప్రాధాన్యత దృష్ట్యా దీనికి ప్రాముఖ్యత వుండేది. ఇక్కడ చాలా సైనిక బలము వుండేదని కృష్ణా మాన్యుయలులో పేర్కొనబడినది. కృష్ణరాయలు పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేస్తూ బెజవాడలో కొన్ని దినములు వున్నాడు. ఆముక్తమాల్యద 'విజయవాటిం' గొన్ని దినంబులుండి' వాటిక మాధవవర్మ సంస్థాపించాడు. బెజవాడలో 'పూసపాటివారి కోట' అని పిలువబడే ఒక ప్రదేశమున్నది. ఇప్పుడీ జాగాలో యిళ్ళు కట్టబడ్డవి."*(మహాకవి డైరీలు పుట 121)*

బెజవాడ నుంచి ప్రయాణం చేస్తూ మధ్యలో రాజమండ్రిలో ఒకరోజు ఆగారు. వివిధ ప్రాంగణాలలో వున్న అనేక శాసనపు పలకలను పరిశీలించారు. శాసనపు పలకలు ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ దిక్కూ మొక్కూ లేక పడున్నాయి. 'వీటిని చూసిన వాడు లేడు' అని బాధపడ్డారు. రాజమండ్రి నుంచి పిఠాపురం. అక్కడో రాత్రి వున్నారు. తర్వాత విజయనగరానికి ప్రయాణం.

అప్పారావుగారు తమ పర్యటన ముగించుకొని '1895 జూలై 3వ తేదీనాడు ఇంటికి చేరుకొన్నారు. తమ పరిశోధనలను కొనసాగించడానికి తమ నోట్సును పెట్టెలోంచి తీసుకోబోతే పెద్ద షాక్ తగిలింది. మద్రాసులో లోకలు రికార్డులను ఎత్తి వ్రాసుకొన్న వారి బుక్కు తమ వాళ్ళ నిర్లక్ష్యం వల్ల పోయింది. "నెలల తరబడి చేసిన యింత కృషి బూడిదలో పోసిన పన్నీరు" అని ఆయన చింతించారు. అయితే మళ్ళా కొత్తగా ఆ పరిశోధనలే చేపట్టారు.

విజయనగరం వచ్చాక అప్పారావుగారు కాలేజీలో మళ్ళా పాఠాలు ప్రారంభించారు. అయితే ఆరోగ్యం దెబ్బతింటోంది. గొంతు కీచుబడి పోయి చెన్నపట్నంలోనూ, బెంగుళూరులోనూ తెల్లదొరలు పాఠాలు ఎలా చెప్పారో అధ్యయనం చేసి కొత్త మెరుగులు ప్రవేశపెడదామనుకొన్న అప్పారావు గారి అధ్యాపకత్వం కూడా అనారోగ్యం వల్ల కుంటుతోంది.

కాలేజీలో కన్నా వీరి ప్రతిభా సంపత్తిని శాసన పరిశోధనా శాఖలో ఉపయోగించుకోవాలన్న అభిలాష ఆనంద గజపతికి కలిగింది. చెన్నపట్నం నుంచి వచ్చిన దగ్గర్నుంచి ఈ రంగంలో అప్పారావుగారు చేస్తున్న కృషిని గమనిస్తూనే ఉన్నారు. 1896 జూన్ 5వ తేదీ నాడు 'యెస్టేటు శాసన పరిశోధకుని'గా ఆయనను నియమించారు. ఆనాటి నుంచి సంస్థానపు హుజూరు ఆఫీసులో అప్పారావుగారు పనిచేయడం మొదలు పెట్టారు. హమేషా రాజావారి హుజూరున ఉండడం కూడా ప్రారంభమైంది. అప్పారావుగారి వంటి ఆత్మీయులకు సన్నిధిలో ఉండవలసిన అవసరం ఆనందగజపతికి ప్రాప్తించింది. అంతకు ఇరవై రోజుల ముందు మహారాజా వారికి భార్యా వియోగం సంభవించింది.

- ఒక వ్యాకరణ గ్రంథమును వ్రాయుట.
- భారతదేశ చరిత్ర, ఆంగ్ల దేశచరిత్ర.
- ఇంగ్లండులో ప్రచురించుటకై ఆంగ్లములో కొన్ని కథలు, గ్రీకు రాజ్యాల చరిత్రల తారతమ్యం పరిశీలనను రచించుట.
- ఆధునిక జీవితమును అభివర్ణిస్తూ ఇంగ్లీషులో నవలా రచన.
- తెలుగు సారసత్వంపై వరుసవరసగా కొన్ని వుపన్యాసములు. ఈసారి మద్రాసు వెళ్ళినపుడు వచ్చే శీతాకాలంలో అక్కడ అలా ఉపన్యాసము చేయవలెను.

అయితే కొన్ని ప్రత్యేక కారణాల వల్ల అప్పారావుగారు తెలుగులో పద్యరచన చేపట్టవలసి వచ్చింది. సంస్థాన శాసన పరిశోధకునిగా పనిచేస్తూనే ఆయన ఒక పత్రికను ప్రచురించాలని భావించారు. 'ప్రకాశిక' అన్న పేరుతో దానిని వెలువరించడానికి సంపాదకునిగా కూడా 1896లోనే డిక్లరేషన్ తీసుకొన్నారు. పత్రికా నిర్వహణ గురించి ఆయనకు కొన్ని గట్టి విశ్వాసాలు ఉన్నాయి. 1895లోనే మే ఒకటవ తేదీనాడు ఆయన డైరీలో ఇలా రాసుకొన్నారు.

"పత్రికా రచనలో శైలి విషయమున తగు జాగ్రత్త వహించవలసిన అగత్యము వుందా? తప్పక వుంది. మన పత్రికా రచయితలు యే పరిస్థితులలో వుంటూ తమ కృషిని సాగిస్తున్నారో, ఆ పరిస్థితులు దుస్సహమైనవి. అన్ని డిపార్టుమెంటులలోనూ చాలినంత మంది మనుషులు లేరు.

***1896 జూన్ 5వ తేదీ నాడు 'యెస్టేటు శాసన పరిశోధకుని'గా ఆయనను నియమించారు. ఆనాటి నుంచి సంస్థానపు హుజూరు ఆఫీసులో అప్పారావుగారు పనిచేయడం మొదలు పెట్టారు. హమేషా రాజావారి హుజూరున ఉండడం కూడా ప్రారంభమైంది. అప్పారావుగారి వంటి ఆత్మీయులకు సన్నిధిలో ఉండవలసిన అవసరం ఆనందగజపతికి ప్రాప్తించింది.***

వున్న వాళ్ళు బహుకొద్ది. .మేనేజరూ, ఎడిటరూ, ప్రొప్రయిటరూ అన్నీ వొకడే. వున్న వుద్యమాలకు సెక్రటరీ, ఉపన్యాసకుడూ వొకడే. స్కూలు మాస్టరూ, వకీలూ, ఇతర ఉద్యోగ విధులు; దీనితో పుస్తక పఠనమునకు, పరిశీలనకు తీరిక చిక్కదు. కొంతకాలం వరకు వార పత్రికలు హెచ్చు ఉపయోగం. దేశములో ఐకమత్యము లేకపోవడం వొక ప్రధాన లోపం." *(మహాకవి డైరీలు - పుట 101-2)*

పత్రిక పెడదామని అప్పారావుగారు చాలా కాలం నుంచి ఆలోచిస్తున్నారన్నమాట. కాలేజీ లెక్చరర్ ఉద్యోగం మానేశాక తీరిక ఉంటుందని డిక్లరేషన్ తీసుకొని ఉంటారు. ఈ ప్రకాశిక పత్రిక ఎన్నాళ్ళు నడిపారో తెలియదు. చాలా కాలమే నడిపి ఉండాలి. అయితే గురజాడపై పరిశోధనలు చేసిన నిపుణులు వేరే విధంగా భావిస్తున్నారు. 'ఈ పత్రికకు పురిటిలోనే సంధి కొట్టింది' అనొకరు రాస్తే (కె.వి. రమణారెడ్డి - మహోదయం' పుట 131) ఈ పత్రిక వెలువడి నట్టులేదు" అని ఇంకొకరు చెప్తున్నారు. (సెట్టి ఈశ్వరరావు - గురజాడ రచనలు - కన్యాశుల్కం (రెండు కూర్పులు) 'జీవిత వివరాలు' పుట 8) అయితే అప్పారావుగారి లేఖల సాక్ష్యం వల్ల ఈ పత్రికను వారు నడిపారని చెప్పవచ్చు. ఉత్తరోత్తరా 1911లో తన స్వవిషయం తాము చెప్పుకోవడం బాగుండదని విశదం చేస్తూనే ఎవరికో రాసిన ఒక లేఖలో తమ జీవిత వివరాలను ఇస్తూ "పాతికేళ్ళ క్రితం విజయ నగరంలో నేను ఒక పత్రికను నెలకొల్పాను. దానికి సంపాదకుడను నేనే. పేరు ప్రకాశిక" అని రెండున్నర దశాబ్దాల తర్వాత తెలియబర్చారు. (గురజాడ రచనలు - 6వ సంపుటి - లేఖలు-పుట 200)

.....

1897 మే 23వ తేదీనాడు జరిగినది కన్యాశుల్కం ప్రథమ ముద్రణ ప్రతి ఆవిష్కరణకాదు. ఆనంద గజపతి నిర్యాణం.

అంతకు ముందు నాలుగు రోజుల నుంచి మహారాజా వారికి జ్వరం కాపింది. ఆయాసం ఎక్కువైంది. ఊపిరి సలపని ఎగ ఊపిరి. మాట్లాడడానికి ఆయనకు ఉత్సాహం లేకపోయింది. ఆనంద గజపతి జీవితంలోని ఆఖరి గడియల గురించి అప్పారావు గారు ఇలా రాశారు.

"ఎనిమిదయింది. మందు తేడానికి నేను డాక్టరు దగ్గరకు వెళ్ళి వచ్చేటప్పటికి, మహారాజా వారి పరిస్థితి ఆందోళనకరంగా పరిణమించింది. దాదాపు తొమ్మిదయింది. ఆయన నరాలు తోడుకుపోతున్నవి. తొందరగా కంటోన్మెంటుకు డాక్టరు కోసం బయలుదేరాను. ఇట్టే తిరిగి వచ్చాను. తిరిగి వచ్చే సరికి ఆయన చెంత జనానా స్త్రీలు వున్నారు. గదిలోకి వెళ్ళడానికి అవకాశం లేదు.

"మనస్సు పరిపరి విధాల పోతున్నది. అధైర్యం హెచ్చింది. గుండె దడదడ లాడుతోంది. ఏ నిముషంలో ఏ దుర్వార్త చెవిని పడుతుందో కదా! అక్కడే అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను".

"మూడు గంటలయింది. మరి అయిదు నిముషాలకు మహారాజా వారు పరమపదించారు. పరమేశ్వరుడు వారి ఆత్మకు శాంతిని ప్రసాదించుగాక. ఆయన నిర్యాణానంతరం ఇరవై అయిదు నిముషములు కోటలో ఉండిపోయాను. మర్నాడు ఉదయం కడసారి ఆయనను దర్శించుటకు వెళ్ళాను. ఆయన వదనం మామూలుగానే ఉంది. ఏ మాత్రం కళ తగ్గలేదు. నిశ్చలముగా, ప్రశాంతముగా నిర్మల వదనముతో నిదురపోతున్నట్లు కనిపించారు. ఆ గంభీర విగ్రహము అలాగునే వున్నది."

"మహారాజా వారు మరిలేరు. ఎంత హృదయ విదారకము. నేటి నుంచి ఎవరి సుభాషితములు నేను వ్రాయను? ఎవరి ప్రసంగములు విని ఆనందించగలను? ఎవరితో కవితానందమును అనుభవించగలను."

(మాటామంతీ - పుటలు 145-6) ◈

# తెలుగు భాషా జ్యోతి ' అసమ్మతి'




*తన సాహిత్య సంస్థాన కృషి మధ్యలో గురజాడ గొంతు కలుపుతున్నాడే గాని పూర్తి భాగస్వామి కాలేకపోయాడు. **1912** తర్వాత ఆ అవకాశం అవసరం వచ్చాయి. తెలుగు నాట ఇంకా చెప్పాలంటే పండిత విద్యాధిక వర్గంలో వాడుక భాష - వేడుక భాషల మధ్య వేడిగా వాడిగా పోరాటం నడిచింది. ఈ పోరాట ఫలితమే **1914**లో వెలువడిన గురజాడ 'అసమ్మతి పత్రం' డిసెంట్ నోట్.*

దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ అన్న నినాదమిచ్చిన గురజాడకు భాష అంటే పండితులు కాదోయ్- భాష అంటే సామాన్యులోయ్ అన్న భావన మొదటి నుంచి వుంది. కనుకనే ఆయన కన్యాశుల్కం మొదటి జీవద్భాషా నాటకమైంది. ముత్యాల సరాలు ' తేటైన మాటలు' కూర్చుకున్నాయి. అయితే ఇదంతా సృజన పరమైన కృషి. సామాజిక సాహిత్య జీవనంలో ముఖ్యంగా విద్యాభ్యాసంలో కూడా ఈ విధమైన మార్పు రావాలన్నది ఆయన చిరకాల వాంఛ. వ్యవహారిక భాషా ఉద్యమం అందుకు సాధనం కాగా సారథ్యం గిడుగు రామ్మూర్తిది. మొదటి నుంచి ఆయన ప్రజల భాష కోసం పోరాడుతున్నాడు. తన సాహిత్య సంస్థాన కృషి మధ్యలో గురజాడ గొంతు కలుపుతున్నాడే గాని పూర్తి భాగస్వామి కాలేకపోయాడు. 1912 తర్వాత ఆ అవకాశం అవసరం వచ్చాయి. తెలుగు నాట ఇంకా చెప్పాలంటే పండిత విద్యాధిక వర్గంలో వాడుక భాష - వేడుక భాషల మధ్య వేడిగా వాడిగా పోరాటం నడిచింది. ఈ పోరాట ఫలితమే 1914లో వెలువడిన గురజాడ 'అసమ్మతి పత్రం' డిసెంట్ నోట్. దానికి దారి తీసిన పరిణామాలు క్లుప్తంగా చెప్పుకోవాలంటే-

ఆంగ్ల పాలన ఫలితంగా దేశంలో ముద్రణా సౌకర్యం అందుబాటులోకి వచ్చింది. 1720 నుంచి క్రైస్తవ మత గ్రంథాలు వ్యావహారిక భాషలో వెలువడసాగాయి *(నిడదవోలు వెంకటరావు, 1954).* 1806లో మద్రాసులో తెలుగు ముద్రణాలయం ఏర్పడింది. 1813లో బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించిన ఒక చట్టం తర్వాత మద్రాసులోని సెయింట్ జార్జ్ కోటలో ఒక కళాశాల స్థాపించారు. ఇంగ్లీషు భాష ఆ భాషలోని సాహిత్యం అందరికీ అందుబాటులోకి వచ్చాయి. క్రమేణా 1839లో మచిలీపట్నంలోనూ 1855లో మద్రాసులో కళాశాలలు ఏర్పడ్డాయి. మరో రెండేళ్లకే అదే మద్రాసు విశ్వవిద్యాలయంగా మారింది *(కెవిఆర్).* కర్నల్ కాలిన్ మెకంజీ(1753-1821) మధ్య తెలుగు పండితుల సహాయంతో సేకరించిన కైఫీయతులు చరిత్రను పరిచయం చేశాయి. 1816లో కాంబెల్, తర్వాత ఏడాదిలో చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తెలుగు భాషా వ్యాకరణాలు వెలువరించారు. 1820లో ఉపయుక్త గ్రంథ కరణ దేశ భాషా సభ ఏర్పడింది. బ్రౌన్ 1840లో తెలుగు వచనంలో వ్యాకరణమూ, 52-54లో నిఘంటువులు వెలువరించడంతో భాషల పట్ల నూతన చర్చ మొదలైంది. సంస్కృతం, ఇంగ్లీషు గాక దేశ భాషలను ప్రోత్సహించడం తమ పాలనకు ఉపయోగమనుకుంటున్న ఆంగ్లేయ పాలకులు కూడా వచనంలో పాఠ్య పుస్తకాలు రూపొందించాలని భావించారు. అప్పటి వరకూ పంచ కావ్యాలకూ తర్క వ్యాకరణాదులకూ పరిమితమైన విజ్ఞాన బోధలో చరిత్ర భూగోళం ప్రకృతి భౌతిక శాస్త్రాలూ విభిన్న సారస్వత ప్రక్రియలూ చోటు సంపాదించాయి. గురుమూర్తిశాస్త్రి విక్రమార్కుని కథలూ, పంచతంత్ర కథలూ, ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్రా

చరిత్ర వంటివి పాఠ్య గ్రంథాలయ్యాయి. 1848లో పరవస్తు చిన్నయసూరి ఉపయుక్త గ్రంథ కరణ దేశ భాషా సభ' కు అధ్యక్షుడయ్యే వరకూ ఈ పాఠాల్లో శిష్ట వ్యావహారికమే వుండేది. అయితే ఆయన రచించిన నీతి చంద్రిక, బాలవ్యాకరణం తర్వాత ఈ పరిస్థితి తలకిందులై పోయింది. అప్పటి వరకూ వున్న 'వర్తమాన తరంగిణి', సుజన రంజని పత్రికల్లోనూ అదే నడుస్తుండేది. కందుకూరి వీరేశలింగం తన ప్రహసనాలలో సరళ గ్రాంధికం వాడుతున్నట్టు ప్రకటించారు. స్వామినేని ముద్దు నరసింహం నాయుడు 1840లో రచించిన హితసూచిని గురజాడ పుట్టిన 1862లోనే ప్రచురితమైంది. ఆయన చెప్పిన భాషా సూత్రాలను అమలు చేసిన మొదటి రచన గురజాడ కన్యాశుల్కమే. ఆ నాటకం వెలువడిన 1892లోనే గిడుగు సవర భాషకు నిఘంటువు రాశాడు. సాహిత్యకారులలోనూ గ్రాంధిక వాదులు కొందరు, పాత్రోచిత భాషా వాదులు కొందరు బయిలుదేరారు. ముఖ్యంగా వేదం వెంకట రాయ శాస్త్రి నాగానందం నాటకంలో తక్కువ స్థాయి పాత్రలకు వ్యవహారిక భాష వాడటం వివాదాస్పదమైంది. కందుకూరి, వేదంలకు తోడు కోలాచలం శ్రీనివాసాచార్యుల వంటి మరికొందరు కూడా ఈ బాట తొక్కారు. దాంతో సనాతన భాషా వాదులు అప్రమత్తమై 'గ్రామ్యం' వల్ల భాష భ్రష్టమై పోతుందని ఎదురుదాడికి దిగారు.ఆ శిబిరంలో ముఖ్యుడు వీరేశలింగంను మొదటినుంచి వ్యతిరేకిస్తున్న కొక్కొండ వెంకటరత్నం పంతులు. పూండ్ల శివరామకృష్ణయ్య, వేదం తదితరులు ఆ వాదనను శక్తివంతంగా ఖండించారు. వేదంవారు, కందుకూరి సందర్భోచితంగా వ్యవహార భాష వాడినా మౌలికంగా ఆ భాషా వాదులు కాదు. ఈ నేపథ్యంలో గిడుగు రామమూర్తి పంతులు 1897లో ఆంధ్ర పండితుల భాషా భేషజం అన్న గ్రంథంలో వేదంతో సహా చాలామంది రచనలలో వారు చెప్పే సూత్రాలే పాటించలేకపోయారని సోదాహరణంగా నిరూపించారు.

ఇంతకు ముందు చెప్పుకున్న నేపథ్యంలో ఆ చర్చ విద్యారంగంలోకి కూడా విస్తరించడానికి దోహదం చేసింది జె.ఎ.ఏట్సు. మొదటి నుంచి గురజాడకు సన్నిహితుడు. స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ హోదాలో ఒకసారి విశాఖలో తెలుగు పాఠం విన్నాడు. గంటకు ఒక్క పద్యం కూడా కావడం లేదు. ప్రతిపదార్థము, దండాన్వయము వంటి వాటితో రెండు నెలల్లో నాలుగు పద్యాలే అయ్యాయని తెలుసుకున్నాడు. ప్రిన్సిపాల్ శ్రీనివాసయ్యర్ కూడా ఆ పరిస్థితిని సమర్థించ లేకపోతున్నాడు. తెలుగు కన్నా ఇంగ్లీషు చెప్పడమే సులువనిపిస్తున్నది. పాశ్చాత్య దేశాల భాషా బోధనరీతులు అనుసరించాలంటే పాతకాలపు పండితులకు మింగుడు పడదు. మనుషులు మాట్లాడే భాష పాఠాల్లో చెప్పే భాషకు పొంతనలేని పద్ధతి మార్చకపోతే జనానికి చదువులు వచ్చేట్టు లేవు. శ్రీనివాసయ్యరు సలహాపై ఆయన 1906లో పర్లాకిమిడి రాజావారి కాలేజీలో పనిచేస్తున్న గిడుగునూ గురజాడనూ పిలిచి ఈ వ్యవహారం అప్పగించాడు. భాషా బోధనలో నూతన పద్ధతులకోసం ఏట్సు అధ్యక్షతన ఒక సమాజం ఏర్పడింది. తర్వాతి ఏడాది నుంచి ప్రతి వేసవిలో ఉపాధ్యాయ సమావేశాలు జరిగేవి. గిడుగు వాటిలో ప్రధాన ప్రసంగాలు చేసేవాడు. లార్డ్ కర్జన్ హయాంలో ఆంగ్ల భాష స్థానే దేశభాషలను ప్రోత్సహించాలన్న ప్రభుత్వ నిర్ణయం ఇందుకు మరింత వూతమిచ్చింది.

1897లో కన్యాశుల్కం మొదటి ముద్రణనాటికే వ్యవహార భాషను అనుసరించిన గురజాడకు ఈ పరిణామం గొప్పసంతోష కారణమే. ఇప్పుడు తనకూ గిడుగుకూ మరింత మంది తోడయ్యారు. వేదం వెంకట రాయశాస్త్రి నాటక రచననూ పాత్రోచిత సంభాషణనూ ఆయన ఎంతగానో మెచ్చుకున్నారు. మిగిలినవి కూడా అలాగే రాస్తే పాఠాలుగా తీసుకోవచ్చని ఒక లేఖలో సూచించారు. వారి మధ్య ఈ విషయమై ఉత్తరప్రత్యుత్తరాలు నడిచాయి. నెల్లూరు జిల్లాలో వాడుక మాటలు ముఖ్యంగా క్రియా భేదాలు తన శిష్యుడు ముని సుబ్రహ్మణ్యం ద్వారా ఆయన తెప్పించుకున్నాడు. ఇంగ్లీషు కవితా ఖండిక, కన్యాశుల్కం మొదటి ప్రతి తప్ప రచనా వ్యాసంగం పక్కన పెట్టిన గురజాడ ఇప్పుడు కవిత్వం ద్వారా ప్రజల భాషకు పట్టం కట్టాలని 1910లో ముత్యాల సరాలు రాశాడు. దిద్దుబాటు కథను రాశాడు. గిడుగును సమర్థిస్తూ గ్రామ్య శబ్ద విచారణము, వాడుక భాష-గ్రామ్యము అనే వ్యాసాలు ప్రచురించారు. మద్రాసు విశ్వవిద్యాలయం సెనేట్‌లో తమకున్న పలుకుబడిని ఉపయోగించి గిడుగు, గురజాడ, సెట్టి లక్ష్మీ నరసింహం రాసిన 'గ్రీకు పురాణ గాథలు' అనే పుస్తకాన్ని స్కూలు ఫైనల్ విద్యార్థులకు ఉపవాచకంగా నిర్ణయించడంతో పెద్ద సంచలనం రేగింది. శ్రీనివాసయ్యర్ రాసిన 'దేశభాషలకై

**నాటిశాసన మండలి ప్రతినిధులతోనూ ఫిర్యాదులు చేయించి రాయలసీమ ప్రాతినిధ్యం పేరిట 1913 మార్చిలో కమిటీని విస్తరించారు. ఆ విధంగా గ్రాంధిక భాషా వాదుల సంఖ్య రెట్టింపునకు పెరిగి వారి వాదమే నెగ్గింది. ఆ సమావేశాన్ని వాయిదా వేయించేందుకు గురజాడ చేసిన ప్రయత్నాలు లేఖలలో కనిపిస్తాయి గాని అవేవీ ఫలించలేదు. పైగా ఆయనను అభిశంసించాలనే సూచన కూడా వచ్చింది.**

ఒక విన్నపం- జీవన్మరణ సమస్య' అన్న ఆంగ్ల గ్రంథం కూడా మరింత ఆజ్యం పోసింది. 1911లో తను రాయదలచిన కళింగ దేశ చరిత్ర రాయాలనుకున్న గురజాడ దాన్ని ప్రచురిస్తామన్న విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కొమర్రాజు లక్ష్మణరావు గ్రాంధిక భాషా వాదం నచ్చక ఆ ప్రతిపాదనే మానుకున్నారు. అప్పుడే 'నాది ప్రజల ఉద్యమం. ఎవరిని సంతోష పెట్టడానికి దాన్ని వదులుకోలేను' అన్న ప్రసిద్ధ వాక్యాలు రాశాడు. ఈ నేపథ్యంలోనే వ్యవహార భాషా వ్యతిరేక వర్గం వారు జయంతి రామయ్య పంతులు ఆధ్వర్యాన కాకినాడలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపించారు. వేదంవారూ, కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి, వావికోలను సుబ్బారావు వంటి మహామహులంతా అందులో సభ్యులు. నవంబరు 24న వారు కందుకూరి అధ్యక్షతన గ్రామ్యాదేశ నిరసన సభ జరిపారు. వీరందరి వాదోపవాదాలకు హిందూ పత్రిక వేదికగా నిలిచింది. మొత్తంపైన గ్రాంధిక భాషకూ వ్యవహార భాషా వాదానికి మధ్యన ఏదో ఒక ప్రామాణిక శైలిని నిర్ణయించక తప్పని పరిస్థితి ఏర్పడింది. 1910 జులైలో ఇంటరు విద్యార్థుల కాంపోజిషనుకు ఏ శైలి అనుసరించాలో తేల్చేందుకై దక్షిణాది భాషలన్నిటికీ కమిటీలు వేశారు. తెలుగు భాషకు సంబంధించిన కమిటీలో యం.రంగయాచార్, కందుకూరి, కొమర్రాజు లక్ష్మణరావు, పి.టి.శ్రీనివాసయ్యరు తదితరులు సభ్యులు. మధ్యలో గురజాడకు ఈ కమిటీలో సభ్యత్వం లభించింది. యూనివర్సిటీ పరీక్షాధికారిగా మాత్రమే వున్న ఆయన 1912 జనవరిలో ఫెల్లో అయ్యాడు. ఉభయ శిబిరాల మధ్య హోరాహోరీ పోరాటం కొనసాగుతుండగానే గిడుగుకు స్థానం కల్పించాలని విఫలయత్నం చేశాడు. అయినా గిడుగు 1913లో ' ఆధునిక తెలుగుపై ఒక మెమోరాండం' అంటూ ఒకటి తయారు చేసి యూనివర్సిటీకి సమర్పించాడు. ఈ రచనను ఇక్కడ వివరంగా పరిశీలించడానికి లేదు గాని అత్యంత ప్రామాణికమని చెప్పకతప్పదు. ఆ వెంటనే జయంతి రామయ్య పంతులు' సారస్వత తెలుగుకు సమర్థన' అంటూ ఒక పుస్తకం ఎడిట్ చేసి ప్రచురించారు. అందులో పాత వాదనలతో పాటు గిడుగూ గురజాడల వాదనల మధ్యన కూడా కృత్రిమమైన తేడా చూపెట్టేందుకు ప్రయత్నించడం విశేషం. ఇక విజయనగరం రాజ కుటుంబం కూడా తమకు మద్దతుగా వున్నట్టు ప్రచారం చేసుకుంటూ గురజాడను మానసికంగా దెబ్బతీసేందుకు మరో ప్రయత్నం జరిగింది. ఆయన వ్యక్తిత్వంపైనా తీవ్ర దుష్ప్రచారం సాగించారు. నాటిశాసన మండలి ప్రతినిధులతోనూ ఫిర్యాదులు చేయించి రాయలసీమ ప్రాతినిధ్యం పేరిట 1913 మార్చిలో కమిటీని విస్తరించారు. ఆ విధంగా గ్రాంధిక భాషా వాదుల సంఖ్య రెట్టింపునకు పెరిగి వారి వాదమే నెగ్గింది. ఆ సమావేశాన్ని వాయిదా వేయించేందుకు గురజాడ చేసిన ప్రయత్నాలు లేఖలలో కనిపిస్తాయి గాని అవేవీ ఫలించలేదు. పైగా ఆయనను అభిశంసించాలనే సూచన కూడా వచ్చింది. అప్పటికి మూడుసార్లు సవరణలతో గురజాడ సమర్పించిన అసమ్మతిపత్రం కూడా తోసివేతకు గురైంది. అయితే ఆయన బహుముఖ పరిజ్ఞానానికి ప్రజాస్వామిక సామాజిక స్వభావానికి తిరుగులేని నిదర్శనంగా నిలిచిపోయింది.

భాషా సమస్యను వివిధ కోణాల నుంచి ఈ పత్రంలో పరామర్శించారు గురజాడ. అప్పటికే కన్యాశుల్కం పీఠికల్లో వ్యవహార భాష ఆవశ్యకతను నొక్కి చెప్పిన గురజాడ తన అసమ్మతి పత్రంలో ప్రజలకు భాష నేర్పడానికి వ్యవహారిక భాష కన్నా ఉత్తమ మార్గంలేదని ఘంటాపథంగా నిరూపించారు.

"తెలుగు సాహిత్యానికి సంకెళ్ళు వేసి కడుపు మాడ్చడమా లేక దానికి జవసత్వాలిచ్చి ఒక గొప్ప నాగరిక శక్తిగా రూపొందించుకోవడమా అనేది మనపైనే ఆధారపడి వుంది" అని ఆయన హెచ్చరించారు. గ్రాంధిక భాషా వాదుల తిరోగామి వాదనలను తిప్పి కొట్టడం కోసం గురజాడ వివిధ దేశాల, వివిధ భాషల అనుభవాలను, పరిణామక్రమాన్ని ఉటంకించి నచ్చజెప్ప ప్రయత్నించారు.

గురజాడకు భాషాపరంగానేకాక, సామాజికంగా కూడా దూరదృష్టి వుందనడానికి ఆయన ఉటంకించిన క్రింది వాక్యాలే ప్రబల నిదర్శనం (ఇవి ప్రొఫెసర్ విట్నీ చెప్పినవి).

"ఇప్పటి వరకు చరిత్రలో ఈ విధమైన ఛాందసత్వ ప్రభావం ఒక వర్గానికే పరిమితమై వుంటూ వచ్చింది. పండితులూ లేదా పూజారి కులం వారు జాతీయ సాహిత్య సంరక్షకులూ, ఆ సాహిత్య భాషా రక్షకులు కాగా విశాల ప్రజా బాహుళ్యానికి ఆ భాషా, ఆ సాహిత్యమూ అపరిచితము, దూరమూ అయ్యాయి. ఎందువల్లనంటే మొత్తం సమాజం నానా అవసరాలను తీరుస్తూ వాటి మార్పులకు అనుగుణంగా తన అంగాలను మార్చుకోని భాష ఏదైనా సజీవంగా వుండజాలదు. అది మామూలు వాడుక నుంచి వేరుపడి ఒక వర్గం వారి గుత్తసొమ్ముగా మారిపోయినప్పుడు అవశ్యమైన దాని సహజ పెరుగుదల ఆగిపోతుంది..."

రాజకీయ రంగాల్లో లాగే భాషారంగాల్లో కూడా ప్రభు వర్గతత్వమూ, వేర్పాటు తత్వమూ పతనంగాక తప్పదు. అనేకుల అవసరాలు, ప్రయోజనాలు అల్ప సంఖ్యాకుల ప్రయోజనాల కన్నా ముఖ్యమైనవి. చివరకు వాటిదే పై చేయి అవుతుంది."

నిజంగానే వ్యవహారిక భాషావాదం జయించి, ప్రజలభాష పైచేయి సాధించింది. తెలుగుదేశంలో అన్ని ప్రాంతాలకూ ఉపయుక్తమైన ఏక రూప వ్యవహార భాష ఏర్పడడానికి గల అవకాశాలను గురజాడ శాస్త్రీయంగా విశ్లేషించారు. ఆ రకమైన ఏకరూప భాష నేడు చాలా సహజంగా అల్లుకుపోయింది. అందుకే అలాంటి వారిని ద్రష్టలనడం.

సంస్కరణోద్యమ వేగుచుక్క వీరేశలింగం గురించి గురజాడ పుస్తకంలో చాలా వ్యాఖ్యానాలు చేశారు. వీరేశలింగం తనకు తెలియకుండానే వ్యవహార భాషా వికాసానికి చేసిన కృషిని కొనియాడారు. అదే వీరేశలింగం కృతక భాషలో రాసిన "సంధి నిగ్రహం" శైలిని తీవ్రంగా ఖండించారు. అయితే ఖండించేప్పుడు కూడా గురజాడ ఎంతో సంస్కారాన్ని ప్రదర్శించారు. గ్రాంథిక భాషావాదులైన ఛాందసులు మాత్రం ఆ మర్యాద పాటించలేదు.

తెలుగులో వ్యర్థ పదాల బాహుళ్యాన్ని అనుబంధంలో వివరించిన తీరుచూస్తే మామూలు పాఠకుడు ఈ రోజుకైనా ఆశ్చర్యపోతాడు. ఉదాహరణకు స్త్రీ అనే భావానికి 130 పర్యాయ పదాలుండగా ఏడు మాత్రమే వాడుకలో వున్నాయి. అందం అనే భావాన్ని చెప్పడానికి 91, మన్మథుడు అనే భావానికి 88 పదాలు, ప్రేమకు 71 పదాలు వున్నాయని వివరించారు గురజాడ. మృతభాష అయిన సంస్కృతాన్ని మొత్తంగా సొంతం చేసుకున్నందునే తెలుగులో ఈ విధమైన పరిణామం వచ్చిందని, ఛందస్సు తెచ్చి పెట్టిన చిక్కుల మూలంగా ఈ తలబరువు పదజాలాన్ని భాషలో నిలుపుకున్నామని వివరణ ఇచ్చి, దీన్నంతటినీ వదిలించుకోవలసిన ఆవశ్యకత ఎరుకపరచారు. అయితే వాడుక భాషలో రచనలు ప్రారంభించిన వారు నిర్జీవంగా, శిల్పరహితంగా వ్యవహరించడాన్ని కూడా ఖండించారు.

పాఠ్యపుస్తకాలలో ఈ విధమైన కృతక భాషా సాహిత్యం బోధించడంవల్ల విద్యార్థులు ఎన్ని నరకయాతనలకు గురవుతున్నారో గురజాడ సానుభూతితో వివరించారు. ఏదయినా ఒక నూతన భావాన్ని, వాదనను ప్రచారం చేసి, ప్రవేశపెట్టదలచిన వారు ఎంత ఓర్పుతో, నేర్పుతో ప్రజలను మెప్పించాలో తెలుసుకునేందుకు గురజాడ రాసిన ఈ అసమ్మతి పత్రం ఒక దృష్టాంతం.

కమిటీ మెజారిటీ నిర్ణయం తర్వాత 1914 ఆగష్టు11న ప్రభుత్వం ఉత్తర్వు జారీ చేయడంతో గ్రాంథిక భాషా వాదులకు పట్టపగ్గాల్లేకుండా పోయాయి. 'మూడు సంవత్సరములాంధ్ర లోకమంతటినీ గలవరపెట్టిన గ్రామ్యవాదమంతటితో నంతరించెను' అని జయంతి రామయ్య పంతులు ఆనందించారు. *(ఆంధ్ర పరిషద్వృత్తాంతము సాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక.)*

ఆంధ్ర పత్రికతో సహా కొన్ని పత్రికలు కూడా అలాగే వ్యాఖ్యానించినా త్రిలిఙ్గ పత్రిక మాత్రం భిన్నంగా రాసింది. ' దూరదృష్టితో ఆలోచించిన వారెవ్వరూ ఈ వాదము జీవ మరణములకు విశ్వవిద్యాలయము కర్తయని యెప్పుడును తలవరు. దానిని గాని దీనిని గాని విద్యాధికులైన గ్రంథ కర్తలు పరిత్యజించినప్పుడే అదిగాని ఇది గాని ఓడిన దని చెప్పవలసి యున్నది...గ్రంథ కర్తలకు తీర్పు చెప్పెడు అధికారము విశ్వవిద్యాలయమునకు లేదు... గ్రాంథిక భాషకు కట్టుబాటులు కొన్ని పోయినవి.. వ్యావహారిక భాషకు లేని అంగీకారము కొంత వచ్చినది. ఇది గ్రాంథిక భాషకు

**తర్వాత కాలంలో వ్యవహార భాషా వాదం మరింత విజయం సాధించింది. వీరేశలింగంతో సహా గ్రాంధిక వాదాన్ని వదలిపెట్టి దాన్ని బలపర్చారు. ఆ శిబిరంలో వుండి పాతపాళీ రాసిన తాపీ ధర్మారావు వంటివారే తర్వాత కొత్తపాళీ అందించారు. అసలు ఆ ఓటమి వల్ల గురజాడ గిడుగు ల ప్రతిష్ట ఏ మాత్రం తగ్గలేదు సరికదా మరింత ఆకర్షణ సంతరించుకుంది.**

విజయమా? వ్యవహారికి భాషకు విజయమా? అని ప్రశ్నించింది. (త్రిలిఙ్గ సంచిక, 1914 అక్టోబరు.)

నిజంగానే ఆ పత్రిక చెప్పినట్టు తర్వాత కాలంలో వ్యవహార భాషా వాదం మరింత విజయం సాధించింది. వీరేశలింగంతో సహా గ్రాంధిక వాదాన్ని వదలిపెట్టి దాన్ని బలపర్చారు. ఆ శిబిరంలో వుండి పాతపాళీ రాసిన తాపీ ధర్మారావు వంటివారే తర్వాత కొత్తపాళీ అందించారు. అసలు ఆ ఓటమి వల్ల గురజాడ గిడుగు ల ప్రతిష్ట ఏ మాత్రం తగ్గలేదు సరికదా మరింత ఆకర్షణ సంతరించుకుంది. శ్రీపాద వారి మాటల్లో -

'అప్పారావుగారికి మాత్రం తమ సత్తా బాగా తలుసు-ఒకచోట-

"తూర్పు బలబల తెల్లవారెను
తోకచుక్కయు వేగుచుక్కయు
ఒడయు డౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరిసిరి మిన్ను వీధిని" అన్నాడు.

తోకచుక్క విచ్ఛిత్తికి సూచకం. వేగుచుక్క మహోదయానికి సూచకం. నిజమే కాని, ఈ తోకచుక్క యేమిటి? ఇది చేసిన వినాశం ఏమిటి? ఈ వేగుచుక్క యేమిటి; దీని తరువాత జరిగిన మహోదయం యేమిటి? అంటే- వశ్యవాక్కులు శ్రీ భమిడిపాటి కామేశ్వరావుగారు, గిగుడు రామమూర్తి పంతులుగారే తోకచుక్క అనీ, గురజాడ అప్పారావు గారే వేగుచుక్క అనీ వ్యాఖ్యానం చేశారు.

మరునాటి పొద్దుటిపూట కొన్ని తీర్మానాలు జరిగాయి. ఆ సందర్భంలో గిడుగు

రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషా వాదం ప్రతిపాదించగా, గురజాడ అప్పారావుగారు బలపరిచారు.

అప్పటి కా యిద్దరే వ్యావహారిక భాషావాదులు.

మహాపండితులు తాతా సుబ్బారాయ శాస్త్రులవారూ, పేరి కాశీనాథ శాస్త్రులవారూ కూడా అప్పుడా సభలో వుండినారు.

అయితే, అప్పటికి వారు పూర్తిగా మారినట్లు జ్ఞాపకం లేదు; కాని వారు, వ్యావహారికం యెదిరించిన పురాణపండా మల్లయ్య శాస్త్రిగారి (లిఖిత) గ్రాంథికోపన్యాసంలో అడుగడుగునా తప్పులు పట్టడం మాత్రం నాకు బాగా జ్ఞాపకం వుంది.

ఉద్యోగధర్మం పురస్కరించుకునేకాక, పాండిత్యం పురస్కరించుకునిన్నీ వారు, అప్పారావుగారిని చాలా ఆదరంగా చూసేవారు. తెల్లటి పంచె, నల్లటి పొడుగు కోటు, ఆ కోటు మీద ఆకుపచ్చని జలతారు శాలువ, శిరస్సున తేజోమండలంలాగ నిండైనా పాగా, పరిణత వయస్కతకు సూచకంగా తిలతండుల న్యాయంగా వుండిన గుప్పెడేసి మీసాలు, పట్టి పల్లారుస్తున్న దీర్ఘ వ్యాధికి గుర్తుగా చప్పిదవడలు, కాని, దూసుకుపోయే చురుకైన చూపులు.

ఇదీ, ఆ ఒక్కమాటే నేను చూసిన ఆ మహాకవి మూర్తిమంతం.

అప్పటి ఆ సమావేశం అంతటిలోనూ ఒక్క అప్పారావుగారి ఆకృతే విలక్షణంగా వుండింది. అందుకు తగ్గట్టు, ఇప్పటి ఆంధ్ర సాహిత్యం అంతటిలోనూ ఒక్క అప్పారావుగారి రచనలే విలక్షణంగా వున్నాయి.

ఏవంచ-

ఉబ్బసంతో పొగర్చుకుంటూ, కుళ్ళా దగ్గుకుంటూ అప్పారావుగారు తీర్మానం బలపరిచి "నేను బలపరిచాను" అని రామమూర్తి పంతులుగారి చెవిలో నోరు పెట్టి ఇంగ్లీషులో గట్టిగా కూడా చెప్పారు.

ఆ భంగిమ చూసీ, ఆ మాట వినీ, వ్యావహారిక వాదులు వారిద్దరే కావడం గుర్తించీ, ఆ వాదమున్నూ విని వుండిన్నీ, అప్పుడక్కడ వుండిన గ్రాంధికవాది ప్రముఖులు ఎగతాళి చేశారు.

వారి ననుసరించి యువక రచయితలున్నూ చాలామంది నవ్వారు.

ఒక్కక్షణం దాటితో నేనూ వారిలో చేరిపోయేవాణ్ణి కానీ, నలుగురితోబాటు నవ్వలసి వుండిన్నీ, నవ్వబోయిన్నీ, చివరకు నవ్వలేకపోయాను. కారణం, నా గురువర్యులు వేదుల రామకృష్ణశాస్త్రుల వారి మందలింపు.

"వారిద్దరూ మహా పండితులు, వారిని న్యూనతపరచడం మనకి క్షేమంకాదు. వారి వాదం వినడం-చేతనయితే యెదిరించడం - యిది మనం చెయ్యవలసింది అన్నారు శాస్త్రులవారు, ఆకతాయినయిపోకుండా నన్ను వారిస్తూ.

మన కళ్ళ యెదుట, భాష విషయమై యింతటి మార్పు రావడానిక్కారణం వ్యావహారిక భాషా విశిష్టత వొక్కటి మాత్రమే కాదు, అప్పారావుగారి రచనల ప్రభావమున్నూ.

రామమూర్తి పంతులుగారి వాదం జాతికి ధైర్య సాహసాలు కలిగించగా

అప్పారావుగారి రచనలు దారి చూపించాయి.

అంచేతనే అప్పారావుగారు 'మార్గదర్శి' అనడం.' (శ్రీపాద అనుభవాలూ, జ్ఞాపకాలూనూ)

మొత్తంపైన కాంపోజిషన్‌పై మెజార్టి నిర్ణయం తర్వాత కూడా వాదోపవాదాలు తర్జనభర్జనలు ఆగలేదు. 1914 జులై ఆగష్టు నెలల్లో ఆంధ్ర పత్రిక హిందూ లలో చాలా మంది ప్రముఖులు అసలు పేర్లతోనూ మరికొందరు మారుపేర్లతోనూ వ్యాసపరంపర వెలువరించారు. కందుకూరి వీరేశలింగం, దివాకర్ల తిరుపతి శాస్త్రి, చిలుకూరి వీరభద్రరావు వంటి మహాపండితులు పాల్గొన్న కొవ్వూరు సారస్వత మహాసభ 1916 నవంబరు 19న వందేళ్లుగా పెద్దల వాడుకలో వున్న పదాలన్నీ పూర్వ ప్రయోగం లేకపోయినా ఆమోదయోగ్యాలని తీర్మానించింది. ఇక గిడుగు 1919 లో ఇంగ్లీషులో 'తెలుగు' అనే పత్రిక స్థాపించి ఉద్యమాన్ని కొనసాగించారు. అదే ఏడాది ఫిబ్రవరి 28న కందుకూరి కూడా వ్యవహారిక భాషా వాదాన్ని ఆమోదించి ఒక సమాజాన్ని స్థాపించారు. దానిపేరే వర్తమాన వ్యావహారికాంధ్ర భాషా ప్రవర్తక సమాజము. ఇది భరించలేని గ్రాంధిక వాదులు వ్యక్తిగత దూషణలకు పాల్పడ్డారు గాని ఫలితం లేకపోయింది. చివరకు 1924లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు దిగివచ్చి వ్యావహారిక భాషా బహిష్కారాన్ని విరమిస్తున్నట్టు ప్రకటించాల్సి వచ్చింది. చివరకు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి ఆధ్వర్యంలో 1933 మార్చిలో జరిగిన అభినవాంధ్ర కవిపండిత సభ బోధనా భాషగా వ్యవహారిక భాషను స్వీకరించాలని తీర్మానించింది. పరిషత్తు వారి ప్రతిభ పత్రికలో ఈ తరహా వ్యాసాలు అనేకం వచ్చాయి. గ్రాంధిక భాషా సమర్థకుడిగా పాతపాళీ అందించిన తాపీ ధర్మారావు కొత్తపాళీ పుచ్చుకుని 1937లో జనవాణి లో మొదటి సారి వ్యావహారిక భాషా ప్రయోగం చేశారు. ఆ విధంగా గురజాడ గిడుగు స్వప్నం నెరవేరింది.

తెలుగులో సాహిత్య యుద్ధం మొదట భాషా విషయమై జరగడం చారిత్రిక ప్రాధాన్యత గల అంశం. తెలుగులో రాస్తే తమ వాళ్లు అవమానంగా భావిస్తారని వారికి తెలుగు ఒక భాష కాదని సాక్షాత్తూ శ్రీపాద వారే ఆత్మకథలో రాసుకున్నారు. చాలా మంది పండితులకు సంస్కృతం తప్ప తెలుగు నుడికారం తెలియదు. వారిలో అనేకులు వేదం వల్లె వేయడంతప్ప చదువుకున్న వారు కూడా కాదు. తెలుగు ఇంగ్లీషు రెండూ రాని అవస్థ వారిది. ఇక రెండవ విషయం గురజాడ చెప్పిందే- రాజకీయాలలో మనం ఆశించే ప్రజాస్వామ్యం పరిపూర్ణం కావాలంటే భాషా సాహిత్యాల్లోనూ ప్రజాస్వామీకరణ జరగాలి. మొదట్లో సంస్కృతం వల్ల తర్వాత ఇంగ్లీషు వల్ల ఆ పని జరగలేదు. తెలంగాణలో లేదా నాటి నిజాం రాజ్యంలో ఈ రెంటికీ తోడు ఉర్దూ భాషాధిపత్యం మెజార్టీ ప్రజల భాష కాదు. కనుకనే ప్రజల భాషగా తెలుగును పెంపొందించుకోవలసిన అగత్యమేర్పడింది. గురజాడ గిడుగు పోరాడిన వ్యావహారిక భాషోద్యమం తమకు సంబంధం లేదని కొందరు తెలంగాణా సాహిత్యకారులు చేసే వాదన కూడా ఈ కోణంలో శాస్త్రీయమైంది కాదు. నిజాం మొదటగా ధారాదత్తం చేసిన ఉత్తరాంధ్రలో ఈ పోరాటం జరిగినా గురజాడ గిడుగు తమ ప్రాంతం భాషనే రుద్దాలని కోరుకోలేదు. ఆనాటికి వారికి వున్న అవగాహన ప్రకారం కృష్ణా గోదావరి జిల్లాల భాషను తీసుకున్నారు. నిజాం ప్రాంతం ఎలాగూ వారిక అందుబాటులోలేదు గనక ఇది అనివార్యమైంది. ఏమైనా తర్వాత కాలంలో భాషా సాహిత్య వికాసాలను చూసినప్పుడు వారి వాదనలో వాస్తవికత వున్నట్టే కనిపిస్తుంది. భౌగోళిక చారిత్రిక స్పృహ అపారంగా వున్న గురజాడ దీనిపై చక్కటి వ్యాఖ్యలుచేశాడు:

'మద్రాసు నగరం ప్రస్తుతం వున్న చోటుకు ముప్పై



విజయనగరం కోట



విజయనగరంలో గురజాడ నివసించిన ఇల్లు

మైళ్ల ఉత్తరాన వుండి వుంటే తెలుగుభాష పరిస్థితి బావుండేది. ముప్పై మైళ్ల దక్షిణాన వుండివుంటే తమిళం పరిస్థితి మరింత బావుండేది. ప్రస్తుతం వున్న స్తితిలో మద్రాసు తెలుగుకు సవతి తల్లి.

'ప్రత్యేకంగా ఒక మహానగరానికి చెందిన భాష కాకపోవడం తెలుగుకు వున్న అసౌకర్యం. ప్రత్యేక నగర భాషలు కావడం వల్ల బెంగాలీ మరాఠీ భాషలు వికాసం చెందాయి. తమ కంటూ ఒక మహానగరం వుండటం వల్ల బెంగాలీలు మహారాష్ట్రులు లాభపడ్డారు. కొంత వరకూ తమిళులు కూడా..*(గురజాడ డైరీ బుక్, బుర్రా శేషగిరి రావు ఉటంకింపు. గురుజాడలు నుంచి)*

గురజాడ భావాలను ఈ విధంగా ప్రస్తావించిన కె.కె.రంగనాథాచార్యులు నగరాలకు భాషా వికాసానికి ప్రపంచ వ్యాప్తంగా వున్న సంబంధాన్ని మరింత విశద పరిచారు ఇంగ్లీషుకు లండన్, ఫ్రెంచికి పారిస్,ఫ్లారెన్స్ ఇటాలియన్‌కు ప్రమాణమైన తీరును తెలిపారు. ఆ విధంగా చూస్తే ఆధునిక కాలం ప్రారంభం అయ్యేనాటికి తెలుగువారికి తమదే అంటూ చెప్పుకోదగిన శతాబ్దాల చరిత్ర గల నగరం లేదు. కాకతీయుల రాజధాని ఓరుగల్లు తెలుగువారిదే అయినా దాని విచ్చిన్నం వల్ల ఆ ప్రభావం కొనసాగలేదు విజయనగర సామ్రాజ్యంలో తెలుగేతర ప్రాంతాలే ఎక్కువ. హంపి కూడా తెలుగు నగరం కాదు. ఆ తర్వాత పాలించిన నాయకరాజులు తమిళనాడులోని మదురై తంజావూరు నుంచి పాలించారు. 16,17 శతాబ్దుల కాలంలో కుతుబ్‌షాహిల కాలంలో గాని తెలుగువారు మళ్లీఒకే పాలనలోకి రాలేదు. ఆ కాలంలో తెలుగు సాహిత్య సంచలనం బాగున్నా అసఫ్ జాహి నిజాంల కాలం వచ్చే సరికి అనేక కోస్తా రాయలసీమ ప్రాంతాలు బ్రిటిష్ వారి పరమైనాయి. అది తమిళనాడులో కలసి మనుగడ సాగించింది హైదరాబాదు తెలుగు వ్యవహర్తల భౌగోళిక ప్రాంతమైనా మరాఠీ కన్నడిగులుకూడా గణనీయంగా వున్నారు. తెలుగు ఉర్దూ కలిసిన దక్కనీ భాషీయులున్నారు. మొదట పర్షియన్ తర్వాత ఉర్దూ అధికార బాషలుగా వున్నాయి అక్కడ పరోక్షంగా బ్రిటిష్ ఆధిపత్యం వుంది నిజాంలతో సైనిక రాజకీయ అవగాహనల ఫలితంగా వారు జోక్యం చేసుకోలేదు ఇక కాంగ్రెస్ జాతీయోద్యమం కూడా అది దేశీయ సంస్తానం గనక ఉద్యమాలు తలపెట్టలేదు.

ఈ పరిస్థితులలోనూ బ్రిటిష్ పాలకులు విరివిగా స్థాపించిన వినూత్న విద్యాసంస్థలు, చైతన్యవంతులైన తెలుగు నేతల సాహిత్య కారుల ఉద్యమాలు అక్కడ తెలుగును నిలబెట్టాయి. ఇలాటి ప్రత్యేక చారిత్రిక భౌగోళిక కారణాల వల్ల గోదావరి కృష్ణా ప్రాంతంలో నూతన భాషా సాహిత్యాలకు అవకాశాలు అధికంగా వచ్చాయి. అందులోనూ పెద్ద సంస్థానంగా వున్న విజయనగరం లేదా ఉత్తరాంధ్రలో తాత్వికంగా కళాపరంగా ఆధునిక ధోరణులు ప్రవేశించాయి. వ్యావహారిక భాషా ఉద్యమం దాని ఫలితమైతే అందుకు అగ్రగాములు గురజాడ గిడుగు. (నూరు సంవత్సరాల తెలుగు: *దశ దిశ, బహుముఖం పుస్తకం నుంచి)* ◈

***(గురజాడ యుగస్వరం - తెలకపల్లి రవి)***



# ఆధునికతకు ఆద్యుడు!


గురజాడ అప్పారావును ఆధునిక తెలుగు సాహిత్య పితామహుడుగా వైతాళికుడుగా ప్రతి వారూ అంగీకరించారు. కందుకూరి వీరేశలింగం కార్యశూరుడుగా ముందున్నా రచనా రంగంపై శ్రద్ధపెట్టి రచనలు తీర్చిదిద్దడానికి ఆయనకు దృష్టి సమయం కూడా సరిపోలేదని విమర్శకులూ అభిమానులూ గుర్తించారు. సమాజం ఆయన కార్యక్షేత్రం. సాహిత్యం సహాయకం. గురజాడ విషయంలో అలాటి సమస్య లేదు. దాదాపు ప్రముఖ విమర్శకులందరూ ఆయననే ఆధునిక తెలుగు మహాకవిగా ఆమోదించారు. కారణం ఆయన కార్యక్షేత్రం సాహిత్యం.


కందుకూరి గురజాడ గిడుగు ఆధునిక తెలుగు జాతి వికాసానికి మూల పురుషులుగా గౌరవం పొందినా ఇందులో మళ్లీ ఎవరి ప్రత్యేకతలు వారికి వున్నాయి. గురజాడ అప్పారావును ఆధునిక తెలుగు సాహిత్య పితామహుడుగా వైతాళికుడుగా ప్రతి వారూ అంగీకరించారు. కందుకూరి వీరేశలింగం కార్యశూరుడుగా ముందున్నా రచనా రంగంపై శ్రద్ధపెట్టి రచనలు తీర్చిదిద్దడానికి ఆయనకు దృష్టి సమయం కూడా సరిపోలేదని విమర్శకులూ అభిమానులూ గుర్తించారు. సమాజం ఆయన కార్యక్షేత్రం. సాహిత్యం సహాయకం. గురజాడ విషయంలో అలాటి సమస్య లేదు. దాదాపు ప్రముఖ విమర్శకులందరూ ఆయననే ఆధునిక తెలుగు మహాకవిగా ఆమోదించారు. కారణం ఆయన కార్యక్షేత్రం సాహిత్యం. సమాజ వికాసానికి పరోక్ష దోహదం అందించేందుకు భావజాల రంగంలో ప్రగతినిరోధకత్వాన్ని సవాలు చేసేందుకు ఆయన తన శక్తియుక్తులు అంకితం చేశాడు. అందుకే కందుకూరి జాతి వైతాళికుడైతే గురజాడ సాహిత్య యుగకర్త అయ్యాడు.

'తెలుగులో మొట్టమొటి ఆధునిక కవి గురజాడ. ఆయన ప్రారంభించిన నవ్య కవితా రీతి ఆధునికతకి ఆరంభం' (వేల్చేరు నారాయణరావు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం).

ఆధునికత అనే భావనను ఎలా అర్థం చేసుకోవాలో కూడా ఆయనే చెప్పారు: 'ఆధునిక అనే మాటను ఒక తాత్త్విక దృక్పథాన్ని (వరల్డ్ వ్యూ) చెప్పే అర్థంలో చాలా మంది వాడుతున్నారు. ఆధునిక సాహిత్యం, ఆధునిక కళ ఇత్యాది ప్రయోగాల్లో ఈ కాలపుది అనే అర్థంతోపాటు, సంప్రదాయ భిన్నమైనదని అనే అర్థం కూడా వుంది. గురజాడ అప్పారావుని ఆధునిక కవి అని, అదే అర్థంలో చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిని ఆధునిక కవి అనలేం. అంటే ఆధునికత, అర్వాచీనత ఒకటికావు. అలాగే శ్రీశ్రీది ఆధునిక కవిత్వం అనే అర్థంలో తుమ్మల సీతారామమూర్తి గారిది ఆధునిక కవిత్వం అనలేము. అంటే, ఆధునికత, వర్తమానకాలికత, ఒకటికావు.'

రాచమల్లు రామచంద్రారెడ్డి ఇంకా విశదంగా చెప్పారు: గురజాడ వ్యక్తిత్వంలో అపారమైన మేధా, కరుణా మహితమైన మానవతా దృష్టి, సంస్కార సంపన్నమైన హాస్యదృష్టి, మొదలైన అనేక గుణాలున్నాయి. బహుశా ఈ అన్నిటికంటే ప్రముఖంగా కనబడేది, ఈ అన్నిటినీ ఆవరించుకొని ఉండేది, ఆయనలోని ఆధునికత (మోడర్నిటీ). ఆధునికత అంటే ప్రధానంగా సంప్రదాయాలనూ, సాంప్రదాయికమైన విశ్వాసాలనూ, ఆచారాలనూ, నిర్మమకారంగా విసర్జించి, ప్రతి సమస్యనూ ఆధునిక విజ్ఞాన శాస్త్రాల సహాయంతో, హేతువాద దృష్టితో పరిశీలించడం. అంటే సూర్యునికంటే చంద్రుడు మనకు

యెక్కువ దూరంలో వున్నాడని చెప్పే పురాణాలను నమ్మకపోవడం; దేవతల అధికారాన్ని, భూదేవతల అధికారాన్ని నిరాకరించడం; వేదాల కంటే, బైబిళ్ళకంటే, భగవద్గీతలకంటే ఆధునిక శాస్త్రవిజ్ఞానం విశ్వసనీయమైందనే నమ్మడం; మన పూర్వుల విజ్ఞానం కంటే ఈనాడు మన విజ్ఞానం యెన్నో వందలరెట్లు యెక్కువ వుందని బేషరతుగా అంగీకరించడం. తోకచుక్క అరిష్టదాయకమనే సాంప్రదాయిక మూర్ఖత్వాన్ని యెదిరించడంలోనే కాదు. మద్య మాంసాలమీద మతం విధించిన నిషేధాన్ని ఉల్లంఘించడంలోనే కాదు, సామాజిక ధర్మాలలోనూ భాషా సాహిత్య విషయాలలోనూ, జీవితంలోని సకల రంగాలలోనూ ఈ ఆధునికత గురజాడ రక్తంలో రక్తంగా కనబడుతుంది. ఆయన సమకాలికుడైన వీరేశలింగం పంతులు లాంటి వాళ్ళు సంఘ సంస్కరణోద్యమంలో యెంత మహనీయులైనప్పటికీ, ఈ ఆధునికతత్వం మాత్రం వాళ్ళకు పూర్తిగా వొంటబట్టలేదు. వీరేశలింగం పంతులు మనుస్మృతీ, పరాశరస్మృతీ, యాజ్ఞవల్క్య స్మృతీ పఠించిన తర్వాతగానీ బాల్యవివాహాల గురించీ, కన్యాశుల్కం గురించీ, ఒక స్థిరమైన అభిప్రాయానికి రాలేకపోయినాడు. ఆధునిక సమాజానికి సనాతన పతిస్మృతి పురాణాలను ప్రమాణాలుగా అంగీకరించడం గురజాడలో ఊహించరాని విషయం. "మంచి గతమున కొంచెమేనోయ్" అనీ, ప్రాచీనులను గురించీ "ఆ పీనుగులు మనలాగే యేడుస్తూ వుండేవారు" అనీ అనగలిగిన గురజాడ ఆధునికత ముందు నోబెల్ బహుమతులందుకునే శాస్త్రజ్ఞులలో చాలామంది తలలు వంచుకోవాలి.' ( రాచమల్లు రామచంద్రారెడ్డి సారస్వత వివేచనము)

గురజాడను ఎంతగానో గౌరవించిన వారు కూడా ఈ విషయంలో పొరబాటు పడటానికి దారి తీసిన పరిస్థితులను కూడా రారా విశ్లేషించారు:

గురజాడ వ్యక్తిత్వాన్ని అంచనా కట్టేవాళ్ళు యెవరైనా ఆయనలోని యీ ఆధునికతా లక్షణానికి ప్రముఖస్థానం యివ్వాలి. రమణారెడ్డిగారు ఆ పని చేయకపోవడం ఈ 'మహోదయం'లో ఒక ముఖ్య లోపంగా కనబడుతున్నది. రమణారెడ్డిగారు గురజాడలోని ఆధునికతను బొత్తిగా గుర్తించలేదనికాదు, స్పష్టంగానే గుర్తించినారు. కొన్ని చోట్ల దాని ప్రస్తావన కూడా చేసినారు. కానీ గురజాడ వ్యక్తిత్వాన్ని అంచనా వేయడంలో దానికి లభించవలసిన ప్రాముఖ్యం లభించలేదు.' (రాచమల్లు రామచంద్రారెడ్డి సారస్వత వివేచనము)

బ్రహ్మాండమైన గురజాడ కృషికంతటికీ ఈ ఆధునికత ఎలా మూలసూత్రమైందో కూడా తెలుసుకోవాలి. ఇతరులకు కూడా ఆ కొలబద్దలు వర్తిస్తాయని గుర్తించాలి.

'సాహిత్యం గురించి గురజాడకు గల అభిప్రాయాలు కూడా ఈ ఆధునికతలో ఒక అంతర్భాగమే. అనగా, కవిత్వం గురించీ, నాటకం గురించీ ప్రాచీన అలంకారికుల సిద్ధాంతాలను అనుల్లంఘనీయమైన ప్రమాణం (అథారిటీ)గా ఆయన స్వీకరించలేదు. స్వీకరించే వుంటే, ఆయన కవిత్వం అలా వుండేది కాదు. 'కన్యాశుల్కం' లాంటి నాటకం రాయడం సాధ్యమయ్యేదే కాదు. ఇప్పుడు రాసిన కథానికల లాంటివి రాయాలన్న ఊహే ఆయనకు వచ్చి వుండేది కాదు. ప్రాచీన అలంకారికులను ఆయన అణుమాత్రమైనా ఖాతరు చేసినట్లు యెక్కడా దాఖలాలు లేవు. నిజానికి ఆయన సంస్కారానికే అది బద్ధశత్రువు. కవిత్వం మీద చర్చ వచ్చినపుడు బర్న్స్, వర్డ్ వర్త్ మొదలైన వాళ్ళనూ, నాటక చర్చ వచ్చినప్పుడు షేక్స్పియర్, మోలియర్ మొదలైన వాళ్ళనూ ఆయన ప్రస్తావించినాడే గాని, భామహుడూ, రుద్రటుడూ, మమ్మటుడూ మొదలైన అలంకారికులను యెక్కడా ప్రస్తావించినట్లు లేదు. గురజాడ సాహిత్యాన్ని విమర్శించే వాళ్ళకు కూడా ఆయనకున్నట్లే పరమ ఆధునికమైన దృష్టి వుంటే తప్ప ఆయన సాహిత్యంగానీ, ఆయన వ్యక్తిత్వం గానీ సరిగా అర్థంకావు. నిజానికి ఒక్క గురజాడ రచనలకే కాదు, ఆధునిక సాహిత్యానికంతటికీ యిది వర్తిస్తుంది. రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి లాంటి కవులకు ప్రాచీన అలంకార శాస్త్రాల మీద అపారమైన భక్తి విశ్వాసాలు వుంటే వుండవచ్చుగానీ, ప్రాచీన అలంకారికుల త్రాసులో తూస్తే వాళ్ళ కవిత్వానికి ఘోరమైన అన్యాయం జరుగుతుంది. ప్రాచీన అలంకారికుల నుండి ఈనాడు మనం నేర్చుకోదగింది ఉంటే ఉండవచ్చు. యెంతైనా ఉండవచ్చు. కానీ ఆధునిక సాహిత్యానికి వాళ్ళను ప్రమాణంగా అంగీకరించడం "అన్నీ మన వేదాల్లో వున్నాయష" లాంటి అవివేకమే అవుతుంది'

ప్రొఫెసర్ కె.కె.రంగనాథాచార్యులు దీన్ని మరింత సూటిగా ఇలా చెప్పారు: 'మధ్య యుగాన సాహిత్యానికి ఆధునిక సాహిత్యానికి ఉండే ప్రధానమైన భేదం వస్తువిషయకమైంది మాత్రమే కాదు. తాత్వికతకు సంబంధించింది కూడా. మనిషి ఆకాంక్షలలో ఆశయాలలో సమాజ సంబంధాలలో అనుభవాలలో భావావేశంలో దర్శనంలో స్పందనలో సంవేదన శీలంలో వచ్చిన మార్పులు

*సాంఘిక వాస్తవికత దర్పణంలో వలె యథాతథంగా ప్రతిబింబించిన కళాఖండం మన భాషలోనే కాదు, ఇతర భారతీయ భాషలోనైనా మొదటిదీ ఆఖరిదీ 'కన్యాశుల్కమే' అనుకుంటాను. కన్యాశుల్కం నాటకాన్ని ఆ తెగలో మించడం మాట అటుంచి, ఆ దరిదాపులకైనా రాగల నాటకం మన దేశంలో ఏదైనా ఉంటే దాని సంగతి ఇంతవరకూ ఎవరికీ తెలియకపోవడం ఆశ్చర్యకరమే అని నేననుకుంటాను.' -శ్రీశ్రీ*

సాహిత్యంలో గుణాత్మక పరిణామానికి కారణమయ్యాయి.. మధ్య యుగంలో సంఘ వ్యవస్థితమైన మానవ సంబంధాల నుంచి వచ్చిన అనుభవాలకు అనంతరదశలో వివిధ సామాజిక వర్గాల అస్తిత్వ కాంక్షలకు కారణమైన అనుభవాలకు చాలా తేడావుంది. సంస్కరణ, వ్యక్తిస్వేచ్ఛ,సమానత, జాతీయత,ప్రబోధం,ఉదార మానవతా వాదం, సమ సమాజం,వివిధ ఉద్యమాలు ఆధునిక కాలంలోని సాహిత్య స్వరూప స్వభావాలను నిర్ణయించాయి.'(కె.కె. రంగనాథాచార్యులు, నూరు సంవత్సరాల తెలుగు భాష దశ,దిశ). ఈ విధమైన ఆధునిక సాహిత్యం ఉత్తరాంధ్రలోనే ఎందుకు మొదలైందో కూడా వివరించారాయన 'తెలుగు సాహిత్యం అన్ని రకాలుగా ఆధునికత సంతరించుకున్నది ఉత్తరాంధ్రలో. ప్రక్రియా పరంగానే గాకుండా తాత్వికంగా కళాపరంగా తెలుగు సాహిత్యంలో ఆధునిక ధోరణులు ప్రవేశించాయి. బహుశా విజయనగరం సంస్థానం ఇతర సంస్థానాలు ఇందుకు దోహదం చేసి వుండాలి. ఆదివాసీ ప్రాంతాలు ఎక్కువగా వున్న ఉత్తరాంధ్రలో సాహిత్యం పూర్తి ఆధునిక రూపం తీసుకోవడం విశేషం.(కె. రంగనాథాచార్యులు, నూరు సంవత్సరాల తెలుగు భాష దశ,దిశ)

గురజాడ గురించి ఎవరికన్నా ఎక్కువగా రాసిన వ్యక్తి శ్రీశ్రీ. తను ఇంకా శ్రీరంగం శ్రీనివాసరావుగా వున్నప్పుడే- అంటే మహాప్రస్థానం ప్రారంభానికి పూర్వమే గురజాడ గొప్పతనం గుర్తించాడు. జయభేరి 1934లో రాస్తే- కన్యాశుల్కంలో స్త్రీ పాత్రల గురించి అంతకు రెండేళ్ల ముందే రాశాడు! ఆయన దృష్టిలో గురజాడ 'ఆధునిక వచన వాఙ్మయ ప్రవర్తకుడు'

'మన దేశ భాషలన్నింటిలోనూ, పూర్తిగా వచనంలో, అందులోకీ వ్యవహారిక శైలిలో, మొట్టమొదటిసారిగా నాటకం రాసింది గురజాడ అప్పారావుగారనే అనుకుంటాను. సాంఘిక వాస్తవికత దర్పణంలో వలె యథాతథంగా ప్రతిబింబించిన కళాఖండం మన భాషలోనే కాదు, ఇతర భారతీయ భాషలోనైనా మొదటిదీ ఆఖరిదీ 'కన్యాశుల్కమే' అనుకుంటాను. కన్యాశుల్కం నాటకాన్ని ఆ తెగలో మించడం మాట అటుంచి, ఆ దరిదాపులకైనా రాగల నాటకం మన దేశంలో ఏదైనా ఉంటే దాని సంగతి ఇంతవరకూ ఎవరికీ తెలియకపోవడం ఆశ్చర్యకరమే అని నేననుకుంటాను.' -శ్రీశ్రీ

'కానీ పై వాక్యాలను ఎంత జాగ్రత్తగా - అతి జాగ్రత్తగా - రాసాడో గమనిస్తే 1980 దశకంలో మాత్రమే కన్యాశుల్కం ప్రాముఖ్యత గురించి వేరే కోణం ఆవిష్కారం కావడం మాత్రం ఆశ్చర్యకరం కాదు. 1980కి ముందు కన్యాశుల్కం నాటకంలోని వాస్తవికతనూ కళా సౌష్టవాన్నీ, పాత్రల స్వభావాలనూ రకరకాలుగా వివరించి వ్యాఖ్యానించిన పెద్దలనేకులున్నారు. 'కన్యాశుల్కం' నాటకమే కాదనేవారి సంగతి రామప్పంతులు చెప్పినట్టు వేరే కథ. 1980 తర్వాత వాస్తవ జీవితంలోని నాటకీయత 'కన్యాశుల్కం'లో గమనించడం ప్రారంభమైంది. 'కన్యాశుల్కం' ఒక కల్పన కాదనీ, వాస్తవ జీవిత శకలాల పేర్పు అనీ, ఆ జీవిత శకలాల నేపథ్యం కథకో నాటక రూపానికో పరిమితమైన వ్యవహారం కాదనీ... ఒక నూతన దృష్టి 1980 దశకంలో మాత్రమే వ్యక్తమైంది. నాటకంలో జీవితాన్ని అన్వేషించడం కంటే, జీవితంలోని నాటకీయతను గుర్తించడం మరింత ప్రయోజనకరమని నిర్ణయానికి రావడం ఇక్కడి ప్రధానాంశం. జీవితం-కళారూపం-జీవితం... ఇదొక పెద్ద గొలుసు.'(హరి పురుషోత్తమ రావు, కన్యాశుల్కం జీవిత నాటకం)

ఇక్కడ హరి గుర్తించిన అంశం గురజాడ ఆధునిక దృక్పథానికి తిరుగులేని నిదర్శనం. ఈ పుస్తకంతో సహా గత పాతికేళ్లలో గురజాడపై వచ్చినన్ని రచనలు విమర్శలు మరే కవి రచయితపైనా వచ్చి వుండవు. అంటే రోజులు గడుస్తున్న కొద్ది గురజాడ రచనల ప్రాధాన్యత పెరుగుతున్నదన్న మాట. 1980 ల నుంచి కన్యాశుల్కం ను కొత్తచూపుతో పరిశీలించడం పెరిగింది. 1997లో నూరేళ్ల కన్యాశుల్కం ఉత్సవాలు దానికి మరో వందేళ్ల పరిశీలనకు అవసరమైన ఉత్సాహమిచ్చాయి.

కన్యాశుల్కం గురించి గొప్పగా చెప్పే వారితో సహా చాలా మంది గురజాడ కవిత్వం విషయం వచ్చే సరికి పెదవి విరుస్తారు. అకవి అన్న వారు కూడా వున్నారు. మరణించిన

వందేళ్ల తర్వాత కూడా మన నాలుకలపై నాట్యం చేస్తున్న ఆయన కవితా చరణాలే అందుకు సరైన సమాధానాలు. అయితే కవిగా గుర్తించిన వారు కూడా వాటి పరిణామక్రమాన్ని సవ్యంగా అంచనా వేయలేకపోవడం విశేషం. వేల్చేరు నారాయణరావే ఇందుకు మంచి ఉదాహరణ.

నారాయణరావు ఆయనది 'అసంపూర్ణ విప్లవం' అని నూతన నామకరణం చేశాడు. విప్లవం అంటేనే సమూలమైన మార్పు అయినప్పుడు అసంపూర్ణ విప్లవం అంటూ వుంటుందా అనే సందేహం ఆయనకు రాలేదు. ఇక సి.నారాయణరెడ్డి గురజాడను ,రాయప్రోలు(సుబ్బారావు)ను ఇద్దరు 'యుగకర్తలు' అంటూ సరికొత్త సిద్ధాంతమే తెచ్చారు. ఇది కూడా అసంపూర్ణ విప్లవ సిద్ధాంతం లాటిదే. దీనిపై చక్కటి సమాధానమిచ్చారు త్రిపురనేని మధుసూదన రావు." గురజాడ అప్పారావు మహాకవి అనికొందరంటే అకవి అని కొందరన్నారు. యుగకర్త అని కొందరంటే సగం యుగకర్త అని కొందరన్నారు. ఇవన్నీ పరిశీలించి నారాయణరావు గురజాడను "అసంపూర్ణ విప్లవ కవి" అని తేల్చాడు. సందర్భవశంగా కందుకూరిని ప్రస్తావించి ఆయన గొప్ప కవికాదనీ, ఆయనకు సాహిత్య చైతన్యం లేదనీ సిద్ధాంతం చేశాడు. అంటే కందుకూరి అసంపూర్ణ విప్లవ కవి కాడు. మొదలుకాని విప్లవకవీ కాడు. ఒక్కమాటలో కందుకూరి 'అకవి'. మాటల మార్పే కాని కందుకూరి గురజాడల మీద నారాయణరావు అభిప్రాయాలనే చాలా మంది విమర్శకులు చెప్పారు. సి. నారాయణరెడ్డి ఆధునిక కవిత్వానికి గురజాడ, రాయప్రోలు ఇద్దరూ యుగకర్తలని సిద్ధాంతం చేశాడు. ఇది సాహిత్య అవకాశవాదం. రాయప్రోలు భవ కవిత్వం నుంచి సాంప్రదాయిక కవిత్వం వైపు తిరోగమించాడు. రాయప్రోలు మేధచాలా చిన్నది. రాయప్రోలు 'జన్మభూమి'నీ గురజాడ 'దేశభక్తి'ని పోల్చి చూస్తే ఈ విషయం తెలుస్తుంది. భావకవిత్వంలో కూడా కృష్ణశాస్త్రికి వున్న స్థానం రాయప్రోలుకు లేదు. రా.రా., కె.వి. రమణారెడ్డి లాంటి వాళ్ళు కూడా గురజాడ కవిత్వంలో "రసాంశాలు" తక్కువనటానికి వాళ్ళల్లో చావక మిగిలి వున్న సంప్రదాయిక అంశం కారణం. నారాయణరావు గురజాడను 'అసంపూర్ణ విప్లవకవి అనటానికి ఆశుకవిత్వ ప్రమాణం కారణం. "గురజాడలో ముఖ్యాంశాలైన ఆశుకవితా రీతి, వాస్తవికతా ఆయన తరువాతి వారు ఎవరూ అందుకోలేదు." (పే.97)

"కందుకూరి, గురజాడలు సంస్కరణ వాస్తవికతా వాదులు. భూస్వామ్య వ్యవస్థకూ, ప్రజలకూ, సామ్రాజ్యవాదులకూ, జాతీయవాదులకూ వైరుధ్యం పదును యెక్కుతున్న దశలో వచ్చేది సంస్కరణ వాస్తవికత. ప్రాచ్య దేశాల్లో పందొమ్మిదవ శతాబ్దంలో సంస్కరణ వాస్తవికత బూర్జువా ప్రగతిశీల వాదంగా ప్రబలంగా వ్యాప్తిలోకి వచ్చింది. పాశ్చాత్య మానస పుత్రుల బృందం కూడా ఈ దశలోనే వచ్చింది. ప్రాచ్య సమాజాలు ఆ రోజుల్లో ఆధునికం కావటం కోసం పాశ్చాత్య సమాజాల నుంచి అనేక బూర్జువా ప్రగతిశీల భావాలకు స్వాగతం చెప్పాయి. సంస్కరణవాదం పాత పాలక వర్గాల పునాదుల్ని కదిలించకుండా మార్పుల కోసం పరిమితం అవుతుంది. గురజాడలో వాస్తవికత అదే. గురజాడ కాలానికి నిస్సందేహంగా సంస్కరణ వాదం ప్రగతిశీలం. (త్రిపురనేని మధుసూదనరావు, సాహిత్యంలో వస్తు శిల్పాలు)

నిజానికి వేల్చేరు నారాయణరావు గురజాడ ఆధునికతను కూడా ప్రశ్నించకపోలేదు. అది అందరూ అనుకుంటున్నట్టు పాశ్చాత్య భావాల ప్రభావంతో వచ్చింది కాదని, దాని మూలాలు తరతరాల భారతీయ ఆలోచనా ధారలోనే వున్నాయని ఆయన ఏవో సూత్రీకరణలు చేశాడు. స్వతహాగా నవ్య సంప్రదాయ తరహాలో ఆలోచించే డా. యు.ఎ.నరసింహమూర్తి కూడా దీన్ని సహించలేక శక్తివంతమైన సమాధానమిచ్చారు. ఇక వాడ్రేవు చిన వీరభద్రుడు ఈ ఆధునికతను అనుభవంగా తీసుకోవాలని చెప్పడాన్ని కూడా ఆయన తోసిపుచ్చాడు.' అయితే ఆనంద మఠమైనా కావాలి. లేదా కన్యాశుల్కమైనా కావాలి. నిబద్ధత గల సాహిత్య కారుడెవరూ ఈ రెండింటికీ మధ్యస్థంగా వుండే పాఠాన్ని పఠించడు. ఆనంద మఠాలన్నీ బైరాగి మఠాలుగా మారుతున్న ఒక శిథిల సంస్కృతిని నిరాకరిస్తూ సమకాలీన సమాజంలో ఏకదేశంగా తనకు అత్యంత సన్నిహితమైన ఒకానొక లోపభూయిష్టమైన స్థితిని భవిష్యత్సమాజ క్షేమంకరమైన ఆశయంతో ఒక దార్శనిక వైభవంతో చిత్రించడానికి పూనుకుని గురజాడ కన్యాశుల్కం రచన చేశాడు. దేశీయమైన ఆధునికతా సంరక్షణకు నడుం కట్టిన అగ్రహారంగా వేల్చేరు భావించిన రామచంద్రాపురాగ్రహారాన్ని గురజాడ ఇంకో రీతిగా దర్శించాడు...... సమకాలీనంగా భారత దేశంలో కొనసాగుతున్న సాంస్కృతిక పునరుద్ధరణ ఉద్యమాల పట్ల గురజాడ దృష్టి సారించలేదు. వివేకానందుడు, దయానంద సరస్వతి, అనిబిసెంటు వంటి వారిని తన పరిధిలోకి తీసుకోలేదు. రాజకీయోద్యమాలను పరిగణించలేదు. రెండు మహా సంస్కృతుల మధ్య జరుగుతున్న సంఘర్షణలో ఒక సంస్కృతీ

వెనక జూసిన కార్యమేమోయి అనడంలోనే గురజాడ నూతనత్వం తెలుస్తుంది. గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్ అన్న మహాభారత భావనకు పూర్తి విరుద్ధమైన యుగ సందేశం ఇది. జాతీయోద్యమంలోనూ ఒక పెద్ద భాగం పునరుద్ధరణ వాదం వైపు చూస్తున్న తరుణంలో దాన్నుంచి విడగొట్టుకున్న ఆధునికత ఇది. అప్పటికి ఇప్పటికీ కూడా ఇతరత్రా ప్రగతిశీలంగా మాట్లాడే చాలా మంది ఆచార వ్యవహారాలు కులాలు కుటుంబాల దగ్గరకు వచ్చేసరికి తిరోగమన శైలి ప్రదర్శించడం చూస్తుంటాం. కాని గురజాడకు ఆ జాడ్యాలు లేవు గనకే సూటిగా ఎలాటి శషభిషలు లేకుండా బ్రాహ్మణ చాందసాన్ని తిరస్కరించాడు. అపహాస్యం చేశాడు. ఆక్షేపించాడు.

ప్రవాహం మందగించి ఇంకొక సంస్కృతీ ప్రవాహం పరుగులు తీస్తున్న సంధికాలంలో ఆ ఆ సంస్కృతుల గుణదోషాలకు లోనవుతున్న ఒక సంక్షుభిత సమాజాన్ని ఆయన సందర్శించాడు. దాన్ని యథాతథంగా చిత్రిస్తూనే ఒక ఆదర్శసమాజానికి అవసరమైన ధ్వనిపూర్ణకమైన నాటకాన్ని రాయడానికి సంకల్పించాడు. ఆయన ఆధునికుడు.

వెనక జూసిన కార్యమేమోయి అనడంలోనే గురజాడ నూతనత్వం తెలుస్తుంది. గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్ అన్న మహాభారత భావనకు పూర్తి విరుద్ధమైన యుగ సందేశం ఇది. జాతీయోద్యమంలోనూ ఒక పెద్ద భాగం పునరుద్ధరణ వాదం వైపు చూస్తున్న తరుణంలో దాన్నుంచి విడగొట్టుకున్న ఆధునికత ఇది. అప్పటికి ఇప్పటికీ కూడా ఇతరత్రా ప్రగతిశీలంగా మాట్లాడే చాలా మంది ఆచార వ్యవహారాలు కులాలు కుటుంబాల దగ్గరకు వచ్చేసరికి తిరోగమన శైలి ప్రదర్శించడం చూస్తుంటాం. కాని గురజాడకు ఆ జాడ్యాలు లేవు గనకే సూటిగా ఎలాటి శషభిషలు లేకుండా బ్రాహ్మణ చాందసాన్ని తిరస్కరించాడు. అపహాస్యం చేశాడు. ఆక్షేపించాడు. ఆయనను కూడా పుట్టుకను బట్టి ఆ వర్గానికే పరిమితం చేసేవారు గుర్తించవలసిన అంశమిది. వ్యావహారిక భాషా వాదంలో ఆయన సూటిగానే బ్రాహ్మణాధిక్యతను ఛేదించవలసిన అవసరం చెప్పాడు. ఆ వాదానికి అంతటి వ్యతిరేకత తెలిపిన వారంతా మౌలికంగా సనాతన భావజాలం నుంచి బయటపడని వారే. కందుకూరి, తాపీ ధర్మారావు వంటివారు ఉత్తరోత్తరా వ్యావహారిక భాషా వాదులైనారు. కాని కొందరు ఇప్పటికీ దాన్ని వదలిపెట్టిన దాఖలాలులేవు. అంతెందుకు? సర్వ జనరంజక మైన సినిమా రంగంలోనూ దర్శకుడు విశ్వనాథ్ ప్రవేశం తర్వాత వేటూరి సుందర రామ్మూర్తి, సిరివెన్నెల సీతారామశాస్త్రి వంటివారు ఆత్రేయ వంటివారు ప్రవేశపెట్టిన సులభశైలిని వదలిపెట్టి సంస్కృత పదభూయిష్టమైన పాటలూ, యమకాలు పునం ప్రవేశపెట్టడం అందరికీ అనుభవమే.

కందుకూరి, గురజాడ ఉభయులూ స్వాతంత్ర్య పోరాటంలో పాలు పంచుకోలేదన్న విమర్శ తరచూ వినిపిస్తుంటుంది. వారి క్రియాశీల కాలానికి ఆ పోరాటం చాలా ప్రాథమిక దశలో వుందనేది ఒక వాస్తవం. కాగా వారు ప్రధానంగా సంఘ సంస్కరణకు ప్రాధాన్యత నిచ్చారనేది మరో అంశం. అయితే ఆ ఉభయులూ కూడా కాంగ్రెస్ రాకను గుర్తించారు. ఆ సభలకు హాజరైనారు. తమ తమ వ్యాఖ్యానాలు చేశారు. కాంగ్రెస్ సంస్థపై కందుకూరి వ్యాసాలు ఉపన్యాసాలు ఇవ్వగా గురజాడ కూడా రాశారు. కన్యాశుల్కంలోనూ అనేక ప్రస్తావనలు చేశారు. కాంగ్రెస్ నాయకులను వీలైనప్పుడల్లా కలిసి చర్చలు జరిపేవారు. వారు దేశీయాభివృద్ధి అవసరాన్ని గుర్తించారు. ఎటొచ్చీ తన జాతి విముక్తి కీలకమన్న అంబేద్కర్ లాగానే వీరు కూడా ముందు మూఢనమ్మకాలూ చాందసత్వాల నుంచి బయటపడే విశాల మానవత్వం అవసరాన్ని ఎక్కువగా నొక్కి చెప్పారు. అందుకోసమే జీవితం అంకితం చేశారు. మన సంఘాన్ని బాగు చేసుకోకపోతే స్వాతంత్రం వచ్చినా ప్రయోజనం వుండదని ప్రజా వికాసం కలగదనీ వారి నిశ్చితాభిప్రాయం. గురజాడ బ్రిటిష్ వారిపై ఆధారపడిన విజయనగరం రాజాస్థానంలో వున్నా రాజభక్తిని గాక దేశభక్తి పిలుపునివ్వడంలో ఆయన చూపు ఎలా వున్నదీ అర్థమవుతుంది. అయితే పూర్తిగా అక్కడి నుంచి తెగతెంపులు చేసుకుని రాగల పరిస్థితి లేదు. అంతటి అవకాశమూ కలగలేదు.

కొడవటిగంటి కుటుంబరావు ఈ విషయమై చక్కటి వ్యాఖ్యానం చేశారు: '1915లోనే పోయిన గురజాడ బ్రిటిషువారికి విరుద్ధంగా పోరాటం సాగించనందుకు తప్పుపట్టడం హాస్యాస్పదం. ఆనాటి కొమ్ములు తిరిగిన రాజకీయవేత్తలే మొదటి ప్రపంచ యుద్ధం కాగానే బ్రిటను ఇండియాకు ఏదో ఒరగబెట్టుతుందని నమ్మారు. 'జాతీయ' కాంగ్రెసు సైతం బ్రిటిషు వారిపై ధ్వజమెత్తలేదు. రాజకీయ సంస్థలు చెయ్యని పని గురజాడ చేసి వుండలేదనా ఆక్షేపణ? ........ కత్తివైరం కాల్చుమని జాతీయోద్యమ నాయకుడు

గాంధీ 30 ఏళ్ళపాటు ఎలుగెత్తి చెప్పాడు. ప్రజలు గాంధీ చెప్పినది కాదని అప్పారావు మాట తలదాల్చారనుకోవాలా? కత్తి వైరంలో విశ్వాసం వున్న ఆ కాలపు నాయకులకు ప్రజల పైన అంతగా ప్రభావం ఉన్నట్టు కనబడదు.

వీరేశలింగమూ, గురజాడ కూడా రాజుల అండన పని చేసిన వారే. వారు వలస వ్యతిరేకోద్యమాలు గాని, ఇతర రాజకీయోద్యమాలు గాని సాగించిన వారు కారు. ఇద్దరూ ఫ్యూడల్ సంస్కృతికి విరుద్ధంగా కత్తి పట్టిన వారే. వారి రచనలలో విప్లవ లక్షణాలు లేవన్నది కష్టపడి డిస్కవర్ చెయ్యవలసిన అవసరం లేదు. వారి కాలానికి ప్రజాస్వామిక విప్లవోద్యమం కూడా అంతగా లేదు. వారి సాహిత్యకృషీ, త్రిపురనేని రామస్వామిచౌదరి గారి కృషి ప్రగతికి రంగాన్ని సిద్ధపరచిందనడానికి ఏ విధమైన సందేహమూ అవసరం లేదు..

ఆనాడు అప్పారావు లేకపోతే ఈనాడు శ్రీశ్రీ ఉండరు. ఆనాడు గిడుగు వారు లేకపోతే ఈనాటి తెలుగు సాహిత్యం చిన్నయసూరి అండన పిలకజుట్టు సాహిత్యంగానే ఉండిపోయేది.' *(కొడవటిగంటి కుటుంబరావు సాహిత్యవ్యాసాలు)*

రాజకీయాలకూ సమాజానికి సహజానికి సాహిత్యానికి వుండే గతి తార్కిక సంబంధం సరిగ్గా అర్థం చేసుకోకపోవడం వల్లనే కొందరు దేనికదిగా చూసి మహనీయుల కృషిని అరకొరగా వ్యాఖ్యానిస్తుంటారు. ఒక వ్యక్తిలో లేదా ఆలోచనా పరునిలో రాజకీయ సామాజిక చైతన్యాలు ఒకే స్థాయిలో వుండాలని లేదు. అలాగే సామాజిక అవగాహనా సాహిత్య శక్తి సమానంగా వుండకపోవచ్చు. లాలాలజపతి రాయ్ సాంఘికంగా అతివాది, రాజకీయంగా మితవాది అనీ, బాలగంగాధర తిలక్ సాంఘికంగా మితవాది రాజకీయంగా అతివాది అని తరచూ చెప్పుకునేదే. తొలితరం జాతీయ విప్లవ కారులు కాళికాదేవి మీద ప్రమాణం చేసేవారనీ, వందేమాతరం పాటలోనూ ఆ నేపథ్యం వుందనీ మనకు తెలుసు. సాహిత్యంలో చలం కూడా ఇందుకో ఉదాహరణ. సామాజికంగా సంచలనం సృష్టించిన చలం ఉద్యమాలను పెద్దగా గౌరవించింది లేదు.

ఆనాడు అప్పారావు లేకపోతే ఈనాడు శ్రీశ్రీ వుండడు అని కొడవటిగంటి అన్న మాటలో చాలా అర్థం వుంది. యాంత్రిక పరిశీలన ఫలితంగా చాలా మంది గురజాడ సాహిత్య వారసత్వం అప్పుడే ఆగిపోయిందని తీర్పు చెప్పారు. ఒకటి తర్వాత భావకవిత్వం విజృంభించడం ఒక కారణమైతే అభ్యుదయ యుగ ప్రవక్తగా పేరొందిన శ్రీశ్రీ కొన్నిసార్లు కఠినపదాలు వాడటం మరో కారణమైంది. శ్రీశ్రీని కేవలం కార్మిక వర్గ కవిగా చూడటం వల్ల కూడా ఆయనలో గురజాడ అంశ లేదని తేల్చిపారేశారు. ఎవరో ఎందుకు? వేల్చేరు నారాయణరావు గురజాడది అసంపూర్ణ విప్లవం అని నిర్ణయించడానికి కారణాలలో ఇదొకటి.

'తెలుగులో మొట్టమొటి ఆధునిక కవి గురజాడ. ఆయన ప్రారంభించిన నవ్య కవితా రీతి ఆధునికతకి ఆరంభం. కాని ఆయన తరువాత ఆధునిక కవులు ఎందరున్నా, ఆ కవులు గురజాడ కవితా రీతిని అనుసరించారా అంటే లేదని సమాధానం చెప్పాలి. ఆయన తరువాత వచ్చినది భావకవిత్వం, అదీ ఆధునిక కవిత్వమే. కాని గురజాడ ప్రారంభించిన నవ్యరీతికి, భావకవితారీతికీ పోలికలు లేవు. .... గురజాడని మహాకవిగా, ఒక్కొక్కప్పుడు అతిశయోక్తులతో ప్రశంసించినవారు కూడా ఆయనకు నిజంగా అనుయాయులు కాలేదు. అభ్యుదయ కవిత్వోద్యమం దానికి ప్రముఖ నాయకుడైన శ్రీశ్రీ ప్రభావాన నడిచింది. శ్రీశ్రీ గురజాడకి గొప్ప అభిమాని. కాని కవిత్వంలో ఆయన మార్గం గురజాడ మార్గం కాదు *(వేల్చేరు నారాయణరావు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం)*

త్రిపురనేని మధుసూదనరావు వ్యాఖ్యలు దీనికి చక్కటి సమాధానమిచ్చాయి: 'భావ కవుల మీదా అభ్యుదయ కవులమీదా కూడా గురజాడ ప్రభావం రీతిలోనూ, వాస్తవికతలోనూ కూడా వుంది. ఆధునిక కవిత్వ ప్రారంభదశ గురజాడ రచనల్లో స్పష్టంగా కనిపిస్తుంది. నారాయణరావు వాదిస్తున్నట్లు గురజాడను తర్వాత కవులు అనుసరించలేదని అంగీకరించినా ఆయనను అసంపూర్ణ విప్లవ కవి అనటం కుదరదు. నన్నయను తక్షణం అనుసరించిన ప్రాచీన తెలుగు కవులు యెవరు? శివకవులు నన్నయను అనుసరించలేదు. పోనీ తిక్కన అనుసరించాడని వాదం కోసం అంగీకరిద్దాం అన్నా వాళ్ళద్దరకూ మధ్య మూడు శతాబ్దాలు వ్యవధి వుంది. మరి నారాయణరావు నన్నయను విప్లవకవి అని ప్రస్తుతించి గురజాడను అసంపూర్ణ విప్లవకవి అనటం యెందుకు? కారణాలు వేరైనా సి.నారాయణ రెడ్డి 'సగం యుగకర్త' అభిప్రాయానికి అది దగ్గరగానే వుంది కదా. గురజాడ కందుకూరిలను మరొక కోణం నుంచి కూడా పరిశీలించాలి. ఈ ఇద్దరూ తెలుగులో 'తొలి రచయితలు'. కేవలం కవిత్వం మాత్రమేకాక నవల, నాటకం, వ్యాసం, ఆత్మకథ, కథానిక వంటి అనేక ప్రక్రియల్లో రాసారు. ఆధునిక యుగంలోనే ఈ రచయిత అనబడే వాళ్ళు కనిపిస్తారు. నారాయణరావు ఆంతర గతి తర్క పరిధిలోకి విభిన్న ప్రక్రియల్లో రాసిన

భాషలో, భావంలో, యితివృత్తంలో, ఛందస్సులో విప్లవాత్మకమయిన మార్పులు తెచ్చినాడు గనుకా. తన తరువాత కవులకు మార్గదర్శకుడైనాడు గనుకా, ఆయన నిస్సందేహంగా తెలుగు కవిత్వ చరిత్రలో ఒక యుగకర్త. ఆయన రాసిన ఖండికల్లో విప్లవాత్మక భావసంపద వున్నంతగా కవితా సౌరభం లేదని గుర్తించడం వల్ల మహోన్నతమయిన ఆయన వ్యక్తిత్వానికి జరిగే నష్టమేమీ లేదు.' (రాచమల్లు రామచంద్రారెడ్డి)

రచయితల్ని కూడా ప్రక్రియకే పరిమితం చేసి పరిశీలించాలా? సాంకేతికార్థంలో సంస్కరణ వాదం భావకవిత్వం, ప్రయోగ కవిత్వం, దిగంబర కవిత్వం వంటివి ఆధునిక కవిత్వమే. బూర్జువా భావజాలం ఆధునిక కవిత్వ లేదా ఆధునిక సాహిత్య ప్రధాన లక్షణం. ఆధునిక విప్లవకర్త గురజాడ అప్పారావే. గురజాడ సాహిత్యంలో ఆధునిక సాహిత్య క్రమం ఆరంభం అయింది.' (త్రిపురనేని, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం)

ఇన్ని అవస్థలుఎందుకు కలుగుతాయంటే గురజాడ ఔన్నత్యాన్ని దార్శనికతను అర్థం చేసుకోలేక, ఆమోదించలేక, ఆయనను విమర్శించేవారి మెప్పు కూడా పొందాలనే తాపత్రయం వదులుకోలేక. మహోదయం రాసిన కె.వి.రమణారెడ్డి వంటి వారికే ఈ పరిస్థితి తప్పనప్పుడు మిగతా వారి సంగతి చెప్పేదేముంటుంది? శ్రీశ్రీ విషయంలోనూ ఆయన మొదట ఇలాటి వ్యాఖ్యలే చేశారు. 'గురజాడ కవిత్వం మీద తరచుగా గాలిదుమారాలు లేస్తూ ఉండటం తెలుగు జాతి దురదృష్టం. అప్పుడప్పుడూ యెవరోఒకరు బయలుదేరి గురజాడను 'ఆ కవి' అనీ 'కుకవి' అనీ అంటూ ఉండడం పరిపాటి అయింది. గురజాడను నిందించే వాళ్ళందరూ ఒకే జాతికి చెందినవాళ్ళు. అందరూ సంప్రదాయవాదులే కావడం కాకతాళీయమేమీ కాదు. వాళ్ళు సంప్రదాయవాదులైనందువల్లనే గురజాడలోని ఆధునికత వాళ్ళకు శత్రువయింది. గురజాడ అభిప్రాయాల మీద మంటతోనే వాళ్ళు గురజాడ కవిత్వం మీద దాడి చేస్తుంటారు. (ఆయన కవిత్వం మీదా, 'కన్యాశుల్కం' మీద దాడిచేసే వాళ్ళందరూ ప్రాచీన అలంకార శాస్త్రాల మానదండంతోనే దాడి చేయడం గమనార్హం. ఆయన కథానికల మీద దాడి చేయడానికి వాళ్ళకు ఏ ఆయుధమూ యెందుకు దొరకలేదో ఆలోచించే తెలివితేటలు వాళ్ళకు ఎప్పుడూ లేవు. (రాచమల్లురామచంద్రారెడ్డి) ఇంతమంచి వివరణ ఇచ్చిన రారా కూడా అంతిమంగా అలాటి మాటలే చెప్పడం ఆసక్తికరం.

'గురజాడ కవిత్వాన్ని మొహమాటం లేకుండా అంచనా కట్టవలసిన సమయం వచ్చిందనుకొంటాను. సంప్రదాయవాదులు ఆయన అభిప్రాయాల మీద ద్వేషంతో ఆయన కవితాశక్తిని కించపరచడానికి పూనుకున్నట్లే, ఆధునికులు ఆయన అభిప్రాయాల మీద అభిమానంతో ఆయన కవితాశక్తిని అతిశయంగా అంచనా కట్టినారనే మాట కూడా కొంతవరకయినా నిజమే. ఆయన హృదయం యెంత కుసుమ కోమలమైనప్పటికీ, యెంత కరుణా నిర్భరమైనప్పటికీ, ఆయన జీవితాన్ని శాసించింది, హృదయంకాదు, మేధ ఉత్తమ కవిత్వానికి అవసరమైన భావుకత్వం (ఎమోషనల్ సెన్సివిటీ) ఆయనలో పుష్కలంగా ఉన్నమాట నిజమే కానీ, అంతకంటే నూరురెట్లు ఆయన ఆలోచనాశీలి మరొకవిధంగా చెప్పాలంటే, ఆయనలో కవి అంశ యెంత ఉన్నప్పటికీ, కవి అంశ కంటే మేధావి అంశ నూరురెట్లు బలంగా ఉండింది. అగ్ని పర్వతంలాంటి ఆవేశంగానీ, జలపాతం లాంటి అనుభూతి ధారగానీ ఆయనకు సాధ్యమయ్యే విషయాలు కాదు. ఆయన గొప్పకవి కావడానికి ఆయన వ్యక్తిత్వవే మొదటి ఆటంకమయిందనవచ్చు; ఆయన జీవిత పరిస్థితులు అంతకు మించిన ఆటంకంగా తయారైనాయి. లౌకిక వ్యవహార వ్యగ్రమైన ఆయన మనస్సుకు కవితా సృష్టికి కావలసిన మన స్థితి (మూడ్) యెప్పుడయినా కలిగినా, చాలాసేపు నిలవడం కష్టం. యిటు సంస్థాన వ్యవహారాలూ, అటు భాషా సంబంధమైన వాదోపవాదాలుగా కవితా సృష్టికి అనుకూలించే పరిస్థితులు కావు. యిన్ని ఆటంకాలు వున్నప్పటికీ, ఆయన కవిత్వం రాయదానికి ప్రయత్నించడమే ఆశ్చర్యం కలిగిస్తుంది. ఈ ఆటంకాలకు తోడు, కవితా రంగంతో ఆయన సాధన చేసింది చాలా తక్కువ. ఇంకొక అయిదేండ్లో, పదేండ్లో సాధన చేసివుంటే బహుశా ఆయన యింకా గొప్పకవిత్వం రాసివుండేవాడేమో. మనకా అదృష్టం దక్కలేదు. ఆయన రాసినవాటిలో 'పూర్ణమ్మ'లో వున్నంత సుకుమారమయిన అనుభూతి సంపదగానీ, శిల్ప సౌందర్యంగానీ యితర ఖండికల్లో లేకపోవడం యెవరైనా గుర్తించవచ్చు. అంతమాత్రంచేత యితర ఖండికలన్నీ యెందుకూ పనికిరానివని కాదు. ఆంధ్ర, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లందుకుంటున్న కావ్యాలన్నీ కవిత్వమైతే,

ఆయన రాసిన ప్రతి ఖండికా మహాకవిత్వమౌతుంది. కానీ గురజాడ పరిమితులు కూడా గుర్తించడం అవసరం. భాషలో, భావంలో, యితివృత్తంలో, ఛందస్సులో విప్లవాత్మకమయిన మార్పులు తెచ్చినాడు గనుకా. తన తరువాత కవులకు మార్గదర్శకుడైనాడు గనుకా, ఆయన నిస్సందేహంగా తెలుగు కవిత్వ చరిత్రలో ఒక యుగకర్త. ఆయన రాసిన ఖండికల్లో విప్లవాత్మక భావసంపద వున్నంతగా కవితా సౌరభం లేదని గుర్తించడం వల్ల మహోన్నతమయిన ఆయన వ్యక్తిత్వానికి జరిగే నష్టమేమీ లేదు.' *(రాచమల్లు రామచంద్రారెడ్డి)*

అంటే భిన్న శిబిరాల నుంచి విభిన్న వ్యక్తుల నుంచి వచ్చిన వాదనలు విచిత్రంగా ఒకే గూటికి చేరడం ఆశ్చర్యం కలిగిస్తుంది. పైన చెప్పుకున్న త్రిపురనేని మధుసూదన రావు వాక్కరే గురజాడ కవిత్వాన్ని ఎందుకు ఆమోదించలేకపోతున్నారో కుండబద్దలు కొట్టి చెప్పాడు. కవిత్వంగురించి మనలో పేరుకుపోయిన సంప్రదాయ భావన అందుకు ఏకైక కారణం. పోనీ పూర్ణమ్మ ఒక్కటే బాగుందనుకుందాం. చాలదా? వాక్యం రసాత్మకం కావ్యం అన్న ప్రాచీనోక్తినైనా మనం పాటించలేమా?

గురజాడ అయినా శ్రీశ్రీ అయినా శ్రద్ధ పెట్టకపోవడం వల్ల మంచి కవిత్వం రాయలేకపోయారని యథాలాపంగా వ్యాఖ్యానించడం విమర్శ పరిధిని దాటడమే అవుతుంది. యుగకర్తల విషయంలో. వారిని అందుకోవడం అంచనా వేయడమే ఒక యజ్ఞం. రాసినదానిపై వ్యాఖ్యానించడం తప్ప రాయని దానికి కారణాలు అందులోనూ శక్తిసామర్థ్యాల విచికిత్స జరపడం విమర్శకుడికి మించిన అంశం.

శ్రీశ్రీ గురజాడల సంగతే చూద్దాం. గురజాడకు రావలసిన నవ్య కవిత్వ ప్రారంభ ఖ్యాతి ఆయన తన ఖాతాలో వేసుకున్నాడని ఆరుద్ర సోమసుందర్ రోణంకి అప్పల స్వామి వంటివారంతా వ్యాఖ్యానించారు. వారిద్దరి కాలాలు కలాలు కూడా వేరైనప్పుడు ఈ కృత్రిమ వివాదం ఎందుకో అర్థం కాదు. గురజాడను శ్రీశ్రీ చాలా ఆలస్యంగా గుర్తించి అనివార్యంగా గౌరవించాడని మరో ఫిర్యాదు. తెలుగువారికి ముఖ్యంగా సాహిత్యాభిమానులకు గురజాడను దగ్గర చేయడంలో శ్రీశ్రీ పాత్ర ఎనలేనిది. ఆయనే గురజాడపై తొలి ప్రామాణిక విమర్శకుడు. అయితే ఆయన కవిత్వం గురజాడకు కొనసాగింపు కాదనే భావం తరచూ వినిపిస్తుంటుంది. పైన వేల్చేరు మాటల్లోనూ అది చూశాం.

గురజాడ కవితా మార్గం శ్రీశ్రీ కవితల్లో చూడలేకపోవడం విమర్శకుల లోపం తప్ప మహాకవి లోపం కాదు. మహాప్రస్థానం పతాక గీతం 'పదండి ముందుకు' లో గురజాడ స్ఫూర్తి తొణికిసలాడుతుంటుంది.

వెనకచూసిన కార్యమేమోయి/ మంచి గతమున కొంచెమేనోయి/ అని ఆయన అంటే పదండి ముందుకు/ పదండి తోసుకు/ అని ఈయన పిలుపునిచ్చాడు. ఎముకలు కుళ్లిన వయస్సు మళ్లిన సోమరులారా చావండి అన్న మాటల్లో అగ్ని హోత్రావధాన్ల మూలుగులు వినిపించవా? పల్లెటూళ్లో తల్లికేదో పాడుకలలో పేగు కదిలింది అన్నప్పుడు దుర్గను చేరెను పూర్ణమ్మ గేయం గుర్తుకు రాదా? కన్నుగానని వస్తుతత్వము గురించి గురజాడ ఆక్షేపించడాన్ని మాయంటావా మిథ్యంటావా అని ప్రశ్నించే శ్రీశ్రీకి సామ్యం లేదా? వేశ్యావృత్తి గురించి సానుభూతితో పరిశీలించాలన్న గురజాడకు 'కడుపుదహించుకుపోయే పడుపుకత్తె రాక్షసరతి' గురించి చెప్పిన శ్రీశ్రీ ప్రతిధ్వని కాదా? పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయ్ అని గురజాడ అంటే 'కదిలేది కదిలించేది పెనునిద్దరవదిలించేది కావాలోయ్ నవకవనానికి' అన్నాడు శ్రీశ్రీ. ఇవన్నీ భావాత్మక కొనసాగింపులు.

అయితే వీరిద్దరి మధ్యనా తేడాలు లేవా అంటే సామాజికాంశాలలోనే అవి కనిపిస్తాయి. వర్గచైతన్యంతో వూగిపోయిన శ్రీశ్రీ సామాజిక కోణాన్నితగినంతగా ప్రతిబింబించలేదన్నది నిజం. గురజాడ అన్నిసార్లు మాలల గురించి కవితలు రాస్తే శ్రీశ్రీలో ఎక్కడా ఆ ప్రస్తావనలే వుండవు. గురజాడ స్త్రీని స్నేహితురాలిగా చూస్తే శ్రీశ్రీ(ఒక్క అద్వైతంకవిత మినహా) మరెక్కడా ఆ స్థానమివ్వలేదు. సనాతన కవుల వలె మాతృత్వాన్ని ఘనంగా చెప్పాడు. 'ఇన్నాళ్లకు జంఝం పోగు పనికి వచ్చింది' అని గురజాడ హాస్యం చేస్తే శ్రీశ్రీ మాత్రం భూతాన్ని యజ్ఞోపవీతాన్ని' అంటూదాన్ని పవిత్రంగా ప్రస్తావించాడు. గురజాడ వదలిపెట్టిన సంస్కృత పదజాలాన్ని చాలాచోట్ల శ్రీశ్రీ గుప్పించి వదలిపెట్టాడు. ఇవేవీ ఆయన వైతాళిక స్థానాన్ని తగ్గించేవి కాదు గాని గమనించదగ్గవి. కనుక శ్రీశ్రీ గురజాడకు వారసుడు కాదన్న వేల్చేరు అంచనా అవాస్తవికమైంది. అధ్యయన శీలం కానిది.

ఆ మాటకొస్తే భావకవులు కూడా గురజాడను మార్గదర్శిగానే భావించారు. 'గురజాడ అప్పారావుగారు ఆధునిక కవిత్వానికి శ్రీకారం చుడుతున్నప్పుడు, అదే కాలంలో రాయప్రోలు సుబ్బారావుగారు భావకత్వాన్ని ప్రారంభించారు. ప్రకృతి కవిత్వాన్నీ, ప్రణయకవిత్వాన్నీ ఆంగ్లకవుల ప్రభావంతో ప్రవేశపెట్టారు. అమలిన శృంగారం అనే కొత్త ఆదర్శాన్ని ప్రచారం చేశారు. రవీంద్రుని

భావకవులు కూడా గురజాడను మార్గదర్శిగానే భావించారు. 'గురజాడ అప్పారావుగారు ఆధునిక కవిత్వానికి శ్రీకారం చుడుతున్నప్పుడు, అదే కాలంలో రాయప్రోలు సుబ్బారావుగారు భావకత్వాన్ని ప్రారంభించారు. ప్రకృతి కవిత్వాన్నీ, ప్రణయకవిత్వాన్నీ ఆంగ్లకవుల ప్రభావంతో ప్రవేశపెట్టారు. అమలిన శృంగారం అనే కొత్త ఆదర్శాన్ని ప్రచారం చేశారు. రవీంద్రుని సాహచర్యంలో నూతన భావాలను ప్రోది చేసుకొన్నారు.

సాహచర్యంలో నూతన భావాలను ప్రోది చేసుకొన్నారు. ఎన్నో కృతులను రచించారు. అయితే ఉత్తరోత్తర దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చెప్పినట్లు "ఈయన కావ్యాలు మన మనసుల్ని ఒడిసి బిగపట్టుకొని ఉద్వేగంతో ఉరకలెత్తనీయవు. మానవ ప్రకృతిలోని గొప్ప లోతుల్ని, పెద్ద ఎత్తుల్నీ చూపెట్టవు. హాయిగా ఒయ్యారంగా ఆరామాల్లో విహారం చేస్తాయి. ఈయన కావ్యాలలో కాల్పనికోద్యమము అలవికాని లోతు నుంచి ముంగిలిదాకా జరుగుతుంది" అందుకే రాయప్రోలు వారు యుగకర్త కాలేకపోయారు. (ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం) గురజాడ అయ్యారు. ఒక యుగాన్ని సృష్టించిన వారిని అనుసరించే ముందు యుగం దూతలు వుంటూనే వుంటారు. వారి గురించి వేల్చేరు నారాయణరావు కూడా అంగీకరించారు: గురజాడ మార్గానికి నిజమైన ప్రచారం 1940 నుంచి ఒక ఉద్యమంగా కమ్యూనిస్టు పార్టీ ఆయన దేశభక్తి గీతాన్ని ప్రతిసభలోనూ పాడడం వల్ల కలిగింది. దానికి అభ్యుదయ రచయితల సంఘం సాహిత్య గౌరవాన్నయితే కలిగించింది కాని, సరియైన విమర్శని వెలువరించడం జరగలేదు.(కవితా విప్లవాల స్వరూపం)

ఈ విమర్శ పాక్షిక సత్యమే. 1934 తర్వాత కమ్యూనిస్టు ఉద్యమం వేళ్లూనుకున్నాకే గురజాడ రచనలు పెద్ద ఎత్తున ప్రచారంలోకి వచ్చాయి. అప్పటి వరకూ కొన్ని రచనలే అచ్చుకు నోచుకున్నాయి. కుమారుడు గురజాడ రామదాసు ఇలా రాశారు: 'ఆయన మృతి అనంతరం రెండు దశాబ్దాలపాటు 'కన్యాశుల్కం' రచయితగా మాత్రమే వారిని తెలుగు ప్రజలు ఎరుగుదురు. ఆయన జీవితకాలంలో ఒక సాంఘిక నాటకము, 'మినిట్ ఆఫ్ డిస్సెంట్', 'నీలగిరి పాటలు' మాత్రమే ప్రచురించారు. నీలగిరి పాటలు రీవా మహారాణికి అంకితమైనవి. 'మినిట్ ఆఫ్ డిస్సెంట్' ఆయన మద్రాసు విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యుడుగా వుండగా, తెలుగు కాంపోజిషన్ కమిటీ తీర్మానానికి వ్యతిరేకంగా వ్రాసినది. మద్రాసు గవర్నరు కార్యదర్శి గెల్లెటి సూచనానుసారం నీలగిరి పాటలను ఇంగ్లీషులోకి అనువదించారు. విజయనగర సంస్థానోద్యోగులలో ఆయన ప్రముఖుడుగా వుండేవారు. ఆయన కాలమంతా సంస్థాన వ్యవహారాలు చూడటానికే సరిపోయేది. 1912లో మహారాజకుమారిక మృతినొందేవరకు సంఘ సంస్కార విషయమై సాహిత్య వ్యాసంగం విషయమై ఆయన ఎక్కువకాలం వినియోగించలేకపోయారు. అయినా తీరిక చిక్కినప్పుడల్లా సాహిత్యకృషి చేస్తూనే వాటిని పత్రికల్లో ప్రచురించేవారు. ఆయన కృతులలో చాలాభాగం అసంపూర్ణాలే. ఆయన అనంతరం కొన్నిటిని సేకరించి, 1929లో ఒక పుస్తకరూపంలో 'ముత్యాలసరాలు' పేరుతో నేను ముద్రించాను. 1927లో కన్యాశుల్కం కన్నడప్రతి వెలువడింది. దానికి అప్పటి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు కట్టమంచి రామలింగారెడ్డిగారు పీఠిక వ్రాశారు. ముత్యాలసరాలు, ప్రచురితమైన సంవత్సరంలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయం బి.ఎ. ఆనర్సు విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా చేసింది. మరుసటి సంవత్సరం ఒరిస్సా ఉన్నత పాఠశాల విద్యార్థులకు పాఠ్య గ్రంథమైంది.

అది మొదలు ఆంధ్ర ప్రజకు నాన్నగారి కృతుల మీద ఆసక్తి పెరిగింది. 1936లో విజయనగరం మహారాజా కళాశాల వజ్రోత్సవ సందర్భంలో నాన్నగారి ఇతర కృతులు కొన్ని ప్రచురించారు. ఆయనవి చాలా కృతులు అసంపూర్ణంగా ఉన్నాయని యిదివరకే చెప్పాను గదా. ఆయన లేఖిని నుండి వెలువడే ప్రతి వాక్యమూ అర్థవంతమైనది గనుక ఆ ఖండాలను ఖండాలుగానే ప్రచురించాను. నాన్న గారి మృతి అనంతరం ఒకనాడు గిడుగు రామమూర్తి పంతులుగారు నాకు సలహాయిస్తూ, నాన్నగారి కృతులను యథాతథంగా ప్రచురించమనీ, ఏ విధమైన మార్పులు చేయవద్దనీ అన్నారు. ఆయన రచనలన్నీ దూరదృష్టితో సాగినవీ, సోషలిస్టు దృష్టితో సాగినవీని. మన దేశంలో కమ్యూనిజం ప్రవేశించినపుడు నాన్నగారి కృతులలో వారికుపయోగపడినవన్నీ వారు వినియోగించుకొని అచ్చువేశారు ' *(గురజాడ రామదాసు )* ◈



అధికారుల సమావేశంలో గురజాడ అప్పారావు. కూర్చున్నవారిలో కుడివైపు నుండి నాలుగవ వారు



(57)
GA-57
43-57

**University of Madras.**

REGISTER OF GRADUATES.

Mr. Gurajada Venkatappa Rau, B.A.

*has been enrolled as a Registered Graduate*

*for life,*

*Senate House,*

*Madras, October 21, 1912.*

*Registrar.*

మద్రాసు విశ్వవిద్యాలయం నుండి గురజాడ అప్పారావు గారు పొందిన డిగ్రీ సర్టిఫికెట్



# గురజాడ గురించి కొందరు ప్రముఖులు

## అప్పారావు గారికి తన సత్తా బాగా తెలుసు

**- శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి**

సధర్ములకు మహాపురుష లెప్పుడూ జ్ఞాపకం వస్తూనే వుంటారు. అయినా సంవత్సరాని కొక్కమాటు వారిని ప్రత్యేక శ్రద్ధాభక్తులతో స్మరించుకోవడం వారి అడుగుజాడల్లో నడిచేవారికి మిక్కలి శ్రేయస్కరం.

అది సభ్యతకు చిహ్నమున్నూ.

ఈ దృష్టితో యివాళ, నేను గురజాడ అప్పారావు గారిని విశిష్ట భక్తితో స్మరించుకొంటున్నాను.

బతికి వుండిన దినాల్లో వారిని ఆంధ్ర ప్రజానీకం గుర్తించలేకపోయింది; కానీ, తరువాత మాత్రం, సంవత్సరం మీద సంవత్సరం గడిచినకొద్దీ వారి విషయమై ఎక్కువగా తెలుసుకుంటోంది. వారి రచనల కోసం అర్రులు చాపుతోంది. అవి చదివి ఆనందముగ్ధం అవుతోంది. ఆ వెంటనే "యెలాంటి పెన్నిధిని గుర్తించలేకపోయామా?" అనిన్నీ పరితపిస్తోంది.

అనలే ఆంధ్ర జాతికి ఆత్మగౌరవమూ, ఆత్మవిశ్వాసమూ ఇంకా గుర్తుకి రాలేదు. దీనికి సాయం, అప్పారావుగారు అసందర్భ పరిస్థితుల్లో బతుకవలసి వచ్చింది.

దేశం ఎంతగా పరుల పాదాల కింద నలిగిపోవాలో అంతగానూ నలిగిపోయాకా, జాతి యెంతగా బానిస అయిపోవాలో అంతగానూ బానిస అయిపోయాకా, భాష యెంతగా శృంఖలాబద్ధం అయిపోవాలో అంతగానూ శృంఖలాబద్ధం అయిపోయాకా, సాహిత్యం ఎంతగా దిగజారిపోవాలో అంతగానూ దిగజారిపోయాకా, భవిష్యత్తు ఎంతగా అంధకార బంధురం అయిపోవాలో అంతగానూ అంధకార బంధురం అయిపోయాకా పుట్టుకువచ్చాడీ మహాకవి.

ఆశ్చర్యపడడానికేమీ లేదు. ఏమంటే, నిజానికి ఇలాంటి పరిస్థితుల్లోనే తరచు ఆదర్శపురుషులావిర్భవిస్తూ వుంటారు.

అయితే అలాటి నికృష్టస్థితిలో మహాకవి కయితే మాత్రం నరసేవ చెయ్యకుండా భుక్తి యెలా గడుస్తుంది? ఆ పురుషుడు చెయ్యి జారిపోకుండా, జాతి మాత్రం అతని మహత్తు ఎలా గుర్తించగలుగుతుంది?

అయితే అప్పారావుగారికి మాత్రం తమ సత్తా బాగా తెలుసు–ఒకచోట–

"తూర్పు బలబల తెల్లవారెను
తోకచుక్కయు వేగుచుక్కయు
ఒడయు డౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరిసిరి మిన్ను వీధిని" అన్నాడు.

తోకచుక్క విచ్ఛిత్తికి సూచకం. వేగుచుక్క మహోదయానికి సూచకం. నిజమే కాని, ఈ తోకచుక్క యేమిటి? ఇది చేసిన వినాశం ఏమిటి? ఈ వేగుచుక్క యేమిటి; దీని తరువాత జరిగిన మహోదయం యేమిటి? అంటే– వశ్యవాక్కులు శ్రీ భమిడిపాటి కామేశ్వరావుగారు, గిగుడు రామమూర్తి పంతులుగారే తోకచుక్క అనీ, గురజాడ అప్పారావు గారే వేగుచుక్క అనీ వ్యాఖ్యానం చేశారు.

మరునాటి పొద్దుటిపూట కొన్ని తీర్మానాలు జరిగాయి. ఆ సందర్భంలో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషా వాదం ప్రతిపాదించగా, గురజాడ అప్పారావుగారు బలపరిచారు.

అప్పటి కా యిద్దరే వ్యావహారిక భాషావాదులు.

మహాపండితులు తాతా సుబ్బారాయ శాస్త్రులవారూ, పేరి కాశీనాథ శాస్త్రులవారూ కూడా అప్పుడా సభలో వుండినారు.

అయితే, అప్పటికి వారు పూర్తిగా మారినట్లు జ్ఞాపకం

లేదు; కాని వారు, వ్యావహారికం యెదిరించిన పురాణపండా మల్లయ్య శాస్త్రిగారి (లిఖిత) గ్రాంథికోపన్యాసంలో అడుగడుగునా తప్పులు పట్టడం మాత్రం నాకు బాగా జ్ఞాపకం వుంది.

ఉద్యోగధర్మం పురస్కరించుకునేకాక, పాండిత్యం పురస్కరించుకునిన్నీ వారు, అప్పారావుగారిని చాలా ఆదరంగా చూసేవారు. తెల్లటి పంచె, నల్లటి పొడుగు కోటు, ఆ కోటు మీద ఆకుపచ్చని జలతారు శాలువ, శిరస్సున తేజోమండలంలాగ నిండైనా పాగా, పరిణత వయస్కతకు సూచకంగా తిలతండుల న్యాయంగా వుండిన గుప్పెడేసి మీసాలు, పట్టి పల్లారుస్తున్న దీర్ఘ వ్యాధికి గుర్తుగా చప్పిదవడలు, కాని, దూసుకుపోయే చురుకైన చూపులు.

ఇదీ, ఆ ఒక్కమాటే నేను చూసిన ఆ మహాకవి మూర్తిమంతం.

అప్పటి ఆ సమావేశం అంతటిలోనూ ఒక్క అప్పారావుగారి ఆకృతే విలక్షణంగా వుండింది. అందుకు తగ్గట్టు, ఇప్పటి ఆంధ్ర సాహిత్యం అంతటిలోనూ ఒక్క అప్పారావుగారి రచనలే విలక్షణంగా వున్నాయి.

ఏవంచ-

ఉబ్బసంతో వొగర్చుకుంటూ, కుళ్ళూ దగ్గుకుంటూ అప్పారావుగారు తీర్మానం బలపరిచి "నేను బలపరిచాను" అని రామమూర్తి పంతులుగారి చెవిలో నోరు పెట్టి ఇంగ్లీషులో గట్టిగా కూడా చెప్పారు.

ఆ భంగిమ చూసీ, ఆ మాట వినీ, వ్యావహారిక వాదులు వారిద్దరే కావడం గుర్తించీ, ఆ వాదమున్నూ విని వుండిన్నీ, అప్పుడక్కడ వుండిన గ్రాంథికవాది ప్రముఖులు ఎగతాళి చేశారు. వారి ననుసరించి యువక రచయితలున్నూ చాలామంది నవ్వారు.

ఒక్కక్షణం దాటితో నేనూ వారిలో చేరిపోయేవాణ్ణి కానీ, నలుగురితోబాటు నవ్వలసి వుండిన్నీ, నవ్వబోయిన్నీ, చివరకు నవ్వలేకపోయాను. కారణం, నా గురువర్యులు వేదుల రామకృష్ణశాస్త్రుల వారి మందలింపు.

''వారిద్దరూ మహా పండితులు, వారిని న్యూనతపరచడం మనకి క్షేమంకాదు. వారి వాదం వినడం-చేతనయితే యెదిరించడం - యిది మనం చెయ్యవలసింది అన్నారు శాస్త్రులవారు, ఆకతాయినయిపోకుండా నన్ను వారిస్తూ.

మన కళ్ళ యెదుట, భాష విషయమై యింతటి మార్పు రావడానికి్కారణం వ్యావహారిక భాషా విశిష్టత వొక్కటి మాత్రమే కాదు, అప్పారావుగారి రచనల ప్రభావమున్నూ.

రామమూర్తి పంతులుగారి వాదం జాతికి ధైర్య సాహసాలు కలిగించగా, అప్పారావుగారి రచనలు దారి చూపించాయి.

అంచేతనే అప్పారావుగారు 'మార్గదర్శి' అనడం.

అప్పారావుగారు చిన్న కథలు రాశారు. వాటిలో వొకటి "దిద్దుబాటు" అనేది యిప్పటికీ అద్వితీయమే. అది మొట్టమొదటి ముట్నూరు వారి 'ఆంధ్రభారతి' మొదటి సంచికలో పడ్డప్పుడు రసికాంధ్ర లోకం వూగిపోయింది. ◈

## మహాయోధుడు గురజాడ అప్పారావు

**- పురిపండా అప్పలస్వామి**

కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, కాశీ కృష్ణమాచార్యులు కొక్కొండ వెంకటరత్నం, వావిలకొలను సుబ్బారావు, కూచి నరసింహం, మోచర్ల రామచంద్రరావు, జయంతి రామయ్య, వేదం వెంకట్రాయ శాస్త్రి, పానుగంటి లక్ష్మీ నరసింహం, కామరాజు లక్ష్మణరావు గార్లవంటి కరడుకట్టిన గ్రాంథిక భాషావాదులు పన్నిన వ్యూహాలు ఛేదించుకొని మాతృభాష అయిన వాడుక భాషకోసం గిడుగు నీడలో పోరాడిన మహాయోధుడు గురజాడ అప్పారావు.

సరిగా ఈ యేటికి వందలేళ్ళ క్రితం 1875లో గిడుగు రామమూర్తి గారిని కలుసుకున్నారు అప్పారావుగారు. అప్పటికి మైనారిటీ అయినా దాటలేదు. పధ్నాలుగేళ్ళ యువకుడు. అతనికంటే రెండేళ్లు చిన్న రామమూర్తి గారు. గిడుగు గురజాడల ఆ కలయిక అపూర్వమైంది. చారిత్రాత్మకమైంది. వాడుక భాషోద్యమానికి శుభవేళ అది.

"వారు విరమించి చాలాకాలమైంది. కానీ ఏ ముహూర్తాన పోరు తలపెట్టారోగాని ఆ యుద్ధరంగం మట్టుకు యెన్నడూ చల్లారలేదు. కవులు లావైనారు. కొట్లాటలు లావైనాయి. చరిత్ర పునరావృతమవుతున్నది. నలుదిక్కులా జయభేరీలు మోగుతున్నాయి. ఏమని? బిరుదులు గట్టిన పండిత కవులకు తెలుగు లోణం రాదు, రాదు, రాదని."

గురజాడ అప్పారావు గారు తాను "పండితుడ్ని" అని ఎక్కడా చెప్పుకోలేదు. అందుకని నాడూ, నేడూ చిన్నచూపు చూసిన "పండితులు" లేకపోలేదు. కాని ఆయన

అసలయిన పండితుడు. లోతులు తెలిసిన పండితుడు, గుడ్డిగా అనుసరించని దూరపు చూపుగల పండితుడు. అన్నిటినీ మించి ఆయన ప్రజల పండితుడు.

**ఆనాడు అప్పారావు లేకపోతే ఈనాడు శ్రీశ్రీ లేడు**

**- కొడవటిగంటి కుటుంబరావు**

మన ఆధునిక "విశిష్ట" సాహిత్యం గురజాడవారి అనంతరం అర్థ శతాబ్దానికి బయలుదేరి ఆయనను అర్థశతాబ్దం వెనుక దిగబడుతున్నది. ఇదెందుకు జరుగుతున్నదో చెప్పటానికి ఒక సాహిత్య ఐన్‌స్టయిన్ అవసరంగా కనిపిస్తున్నది. ఆధునిక జీవితానికి సంబంధించిన గద్య పద్య రచనలు తూతూ మేళం కూడా లేకుండా వెలువడుతుంటే ఆధునిక "ప్రాచీన" రచనలు అట్టహాసంగా నాలుగైదు బాండు మేళాలతో, వందిమాగధుల స్తోత్ర పాఠాలతో ఆశీఃపురస్సరంగా ఊరేగింపులు చేసి గొప్ప రొద చేస్తున్నాయి.

'కన్యాశుల్కం' నాటకంలో గిరీశం పాత్ర నిర్వహించిన పనుల్లో అప్పారావుగారికి ప్రాతినిధ్యం వహించటం ఒకటి అన్నది నిస్సందేహం. స్త్రీ పునర్వివాహ సంస్కరణ వాదుల "అతి" అప్పారావుకు చాలా అసహ్యం. అందుచేతనే వాటిని హేళన చెయ్యటానికాయన గిరీశాన్ని ఉపయోగించుకున్నారు. అతి బాల్య వివాహాలుంటేనేగాని యంగ్ విడోస్ ఉండరనీ, యంగ్ విడోస్ ఉంటేనేగాని విడోస్ మేరేజ్ రిఫామ్ కొనసాగదనీ గిరీశం చేసే వాదం ఈ వెర్రికి పరాకాష్ఠ.

నాచ్ క్వశ్చన్ కూడా అప్పారావు తన జీవితంలో ఎదుర్కొన్నదే. గిరీశం పాత్రలో ఉండే ఆధునికత్వమూ, బహువిధజ్ఞానమూ (షెహెలెస్‌గా) అప్పరావుదే. గిరీశానికి స్వతహాగా అన్ని విషయాలను గురించి తెలిసే అవకాశం లేదు. మహారాజావారి దర్శనం కూడా అప్పారావుదే.

గిరీశం పాత్ర ఇంకొకందుకు కూడా ఉపయోగపడింది. - ఇతర పాత్రలకు గీటురాయిగా ఉండటానికి అతని బుట్టలో పడినందుకు అగ్నిహోత్రావధాన్లనుగాని, లుబ్ధావధాన్లనుగాని మనం జాలితలచం. అతను బుచ్చెమ్మను లేవదీసుకుపోయిన పద్ధతి ఎంత గర్హమైనా, ఆమెను అతను నరకం నుంచి ఉద్ధరించాడని ఒప్పుకోక తప్పదు.

అందుచేతనే ఈనాడు గిరీశం పాత్రను పునరుద్ధరించే ప్రతి ఒక్కరూ అతను బుచ్చెమ్మను పెళ్ళి చేసుకున్నట్టే వూహిస్తున్నారు.

1915లోనే పోయిన గురజాడ బ్రిటిషువారికి విరుద్ధంగా పోరాటం సాగించనందుకు తప్పుపట్టడం హాస్యాస్పదం. ఆనాటి కొమ్ములు తిరిగిన రాజకీయవేత్తలే మొదటి ప్రపంచ యుద్ధం కాగానే బ్రిటను ఇండియాకు ఏదో ఒరగబెట్టుతుందని నమ్మారు. 'జాతీయ' కాంగ్రెసు సైతం బ్రిటిషు వారిపై ధ్వజమెత్తలేదు. రాజకీయ సంస్థలు చెయ్యని పని గురజాడ చేసి వుండలేదనా ఆక్షేపణ? 1935-36 దాకా "లాయలిస్టులు"గా ఉండి కమ్యూనిస్టు పార్టీలో చేరిన వారిని గురించి కూడా ఎవరూ ఆక్షేపించలేదే!

"దేశభక్తి" గీతం వెలువడేనాటికి మన సంకెళ్ళు ఛేదించే కవిత్వం ఎవరూ రాయటం లేదు. ఆ గీతం అందుకుగాను రాయకపోవటం అప్పారావు చేసిన మహా పాపంలాగుంది. ఆ గీతం మన విముక్తి పోరాటాన్ని బలహీనపరిచిందన్నది వట్టి ఊహాగానం. జాతీయోద్యమంలో అది ఎలాటి పాత్రా వహించలేదు. కత్తివైరం కాల్చమని జాతీయోద్యమ నాయకుడు గాంధీ 30 ఏళ్ళపాటు ఎలుగెత్తి చెప్పాడు. ప్రజలు గాంధీ చెప్పినది కాదని అప్పారావు మాట తలదాల్చారనుకోవాలా? కత్తి వైరంలో విశ్వాసం వున్న ఆ కాలపు నాయకులకు ప్రజల పైన అంతగా ప్రభావం ఉన్నట్టు కనబడదు.

వీరేశలింగమూ, గురజాడ కూడా రాజుల అండన పని చేసిన వారే. వారు వలస వ్యతిరేకోద్యమాలు గాని, ఇతర రాజకీయోద్యమాలు గాని సాగించిన వారు కారు. ఇద్దరూ ఫ్యూడల్ సంస్కృతికి విరుద్ధంగా కత్తి పట్టిన వారే. వారి రచనలలో విప్లవ లక్షణాలు లేవన్నది కష్టపడి డిస్కవర్ చెయ్యవలసిన అవసరం లేదు. వారి కాలానికి ప్రజాస్వామిక విప్లవోద్యమం కూడా అంతగా లేదు. వారి సాహిత్యకృషీ, త్రిపురనేని రామస్వామిచౌదరి గారి కృషి ప్రగతికి రంగాన్ని సిద్ధపరచిందనడానికి ఏ విధమైన సందేహమూ అవసరం లేదు. ఇంతకూ, వాళ్ళు విప్లవానికి దోహదం చేసినట్టు ఎవరంటున్నారని కొల్లా వారు అనుకొంటున్నారో స్పష్టం కావడం లేదు.

ఆనాడు అప్పారావు లేకపోతే ఈనాడు శ్రీశ్రీ ఉండరు. ఆనాడు గిడుగు వారు లేకపోతే ఈనాటి తెలుగు సాహిత్యం

చిన్నయసూరి అండన పిలకజుట్టు సాహిత్యంగానే ఉండిపోయేది. అప్పారావూ, వీరేశలింగమూ కన్ఫ్యూసియస్‌తో పోల్చటానికి తత్వవేత్తలు కారు. వాళ్ళు రచయితలు. వాళ్ళు సిద్ధాంతాలేవీ ప్రజా జీవితంలోకి చొచ్చుకుపోయి ప్రజల జీవిత పరిణామానికి వేరుపురుగుల్లాగా పని చెయ్యలేదు.

## జీవిత నాటకం - కన్యాశుల్కం

**- హరి పురుషోత్తమరావు**

మన దేశ భాషలన్నింటిలోనూ, పూర్తిగా వచనంలో, అందులోకీ వ్యవహారిక శైలిలో, మొట్టమొదటిసారిగా నాటకం రాసింది గురజాడ అప్పారావుగారనే అనుకుంటాను. సాంఘిక వాస్తవికత దర్పణంలో వలె యథాతథంగా ప్రతిబింబించిన కళఖండం మన భాషలోనే కాదు, ఇతర భారతీయ భాషలోనైనా మొదటిదీ ఆఖరిదీ 'కన్యాశుల్కమే' అనుకుంటాను. కన్యాశుల్కం నాటకాన్ని ఆ తెగలో మించడం మాట అటుంచి, ఆ దరిదాపులకైనా రాగల నాటకం మన దేశంలో ఏదైనా ఉంటే దాని సంగతి ఇంతవరకూ ఎవరికీ తెలియకపోవడం ఆశ్చర్యకరమే అని నేననుకుంటాను. -శ్రీశ్రీ

కానీ పై వాక్యాలను ఎంత జాగ్రత్తగా - అతి జాగ్రత్తగా - రాసాడో గమనిస్తే 1980 దశకంలో మాత్రమే కన్యాశుల్కం ప్రాముఖ్యత గురించి వేరే కోణం ఆవిష్కారం కావడం మాత్రం ఆశ్చర్యకరం కాదు. 1980కి ముందు కన్యాశుల్కం నాటకంలోని వాస్తవికతనూ కళా సౌష్టవాన్నీ, పాత్రల స్వభావాలనూ రకరకాలుగా వివరించి వ్యాఖ్యానించిన పెద్దలనేకులున్నారు. 'కన్యాశుల్కం' నాటకమే కాదనేవారి సంగతి రామప్పంతులు చెప్పినట్టు వేరే కథ. 1980 తర్వాత వాస్తవ జీవితంలోని నాటకీయత 'కన్యాశుల్కం'లో గమనించడం ప్రారంభమైంది. 'కన్యాశుల్కం' ఒక కల్పన కాదనీ, వాస్తవ జీవిత శకలాల పేర్పు అనీ, ఆ జీవిత శకలాల నేపథ్యం కథకో నాటక రూపానికో పరిమితమైన వ్యవహారం కాదనీ... ఒక నూతన దృష్టి 1980 దశకంలో మాత్రమే వ్యక్తమైంది. నాటకంలో జీవితాన్ని అన్వేషించడం కంటే, జీవితంలోని నాటకీయతను గుర్తించడం మరింత ప్రయోజనకరమని నిర్ణయానికి రావడం ఇక్కడి ప్రధానాంశం. జీవితం-కళారూపం-జీవితం... ఇదొక పెద్ద గొలుసు.

ఫలితంగా, కన్యాశుల్కం కథా వస్తువు, ఇతివృత్తం, నిర్మాణ వ్యూహం మొదలైన వివరాలకు పోకుండానే కొన్ని నిర్ణయాలకు రావచ్చును. 'కన్యాశుల్కం'లోని సంభాషణలన్నింటినీ 'గ్రంథస్థం చేసిన సంభాషణలు'గా (రికార్డెడ్ డైలాగ్స్) పేర్కొన వచ్చును. ఎటూ వచ్చి గ్రంథస్థం చేయడంలో రచయిత తీసుకున్న జాగ్రత్త. చూసిన సంయమనం, ఆచరించిన నిజాయితీ... అన్నీ కలిసి కన్యాశుల్కాన్ని ఒక చారిత్రక పత్రంగా రూపొందించాయి. అంటే 'గ్రంథస్థం చేయడం' గొప్ప శ్రమతో కూడుకున్న వ్యవహారమన్న మాట. 1909కి ముందు రాసిన 'కొండు భట్టీయం'లోని కొన్ని సంభాషణలు, కొన్ని వివరాలు, 'కన్యాశుల్కం'లో చేరుకున్నాయని గమనిస్తే గురజాడ 'కన్యాశుల్కం' రచనను పరిపుష్టం చేయడానికి చేసిన 'వ్యాయామం' (ఎక్సర్‌సైజ్) కూడా మనకు స్ఫురిస్తుంది. కథకూ కథనానికీ అవసరమైన దృశ్యాలనూ, సంభాషణలనూ మాత్రమే పరిమితంగా తీసుకుని ఉంటే 'కన్యాశుల్కం' ఒక నాటకంగా మాత్రమే మనకు గుర్తుండేది. అందుకు భిన్నంగా, ఒక నిర్దిష్ట ప్రాంతంలో, ఒక నిర్దిష్ట కాలంలో, ఉన్న సామాజిక భావాల రాశి 'కన్యాశుల్కం'లో మనకు పుష్కలంగా లభిస్తోంది. కనుకనే దాన్ని మనం జీవితంలో భాగంగా చూడాల్సి వస్తోంది. ఆంధ్రదేశపు సాంఘిక చరిత్ర రాయడానికి - ముఖ్యంగా కళింగాంధ్ర చరిత్ర - కన్యాశుల్కం ఆధారంగా పనికి వస్తుంది. ఈ సందర్భంలో గురజాడ 'కళింగాంధ్రదేశ చరిత్ర' రాశాడని గుర్తు పెట్టుకోవడం మరింత అవసరం. నడుస్తున్న చరిత్రను 'కన్యాశుల్కం' అక్షరబద్ధం చేసింది.

నిత్య నైమిత్తికాలు, బ్రిటిషు వలస విధానం, దాని వారసత్వం, సాంఘిక దురాచారాలు - సదాచారాలు కూడా - సంస్కరణ, దేశ స్వాతంత్ర్యం, హ్రస్వదృష్టీ, దీర్ఘదృష్టీ, నిజాయితీ, ఆత్మవంచన, నైర్మల్యం, కౌటిల్యం, సారళ్యం, సంక్లిష్టత, ఆదర్శం, అవినీతి... ఇలా జీవితంలో తటస్థపడే ప్రతి అంశమూ కన్యాశుల్కంలో ప్రస్తావనకు వచ్చింది. అన్నింటికంటే ముఖ్యంగా, ఆధునికతా స్వభావం గురించీ, సంప్రదాయ బద్ధతను గురించీ, అప్పుడు వ్యాప్తిలో ఉన్న భావాల ప్రకటన 'కన్యాశుల్కం'లో అనాచ్ఛాదితంగా కనబడుతుంది.

'కన్యాశుల్కం' పాత్రలు అచ్చటి సంకీర్ణ సమాజంలోని వ్యక్తులుగానే మనకు కనబడతాయి గాని, నాటకానికి "అవసరమైన" పాత్రల్లాగా కనబడవు. ఆయా

పాత్రల ప్రవర్తన, ఆ పాత్రల అవసరాలనూ, ఆశలనూ, లక్ష్యాలనూ అంటిపెట్టుకుని ఉండడం కూడా అందువల్లనే విశిష్టంగా కాక, సహజంగా కనబడుతుంది. అలాగే, కన్యాశుల్కంలో కొన్ని పాత్రలు గురజాడ ఊహలను కూడా దాటిపోయి స్వకీయ వ్యక్తిత్వాన్ని రూపొందించుకొని గురజాడను 'ధిక్కరించాయ'ని కొందరు విమర్శకుల నింద. నిజానికి ఇది ప్రశంస. గురజాడ పరిశీలనకూ, నిజాయితీకి ఈ వ్యాఖ్య ఒక అద్భుతమైన కితాబు.

'కన్యాశుల్కం' నాటకంలో వర్ణితమైన సమాజానికి కొంచెం ఎడంగా ఉన్న పాత్ర గిరీశం పాత్ర. ఆ సమాజానికి అతను కొత్తవాడు. పరాయివాడు. ఒక పాత్రకూ అతడున్న సామాజిక వాతావరణానికీ మధ్య దూరమున్నప్పుడు విచిత్ర సంఘటనలు సన్నివేశాలు సహజమే. హనుమంతుని లంకాయాత్ర, ఊహా ప్రపంచంలో ఉండే డాన్‌క్విక్‌సెట్ చుట్టూ ఉన్న వాస్తవ ప్రపంచం, అభం శుభం తెలియని పార్వతీశం ఇంగ్లండు ప్రయాణం... ఇలా ప్రతి చోటా ఇదే పరిస్థితిని చూడవచ్చును. అయితే ఇక్కడ గిరీశం ఇంచుమించుగా మిగిలిన అన్ని పాత్రలకూ అభిముఖమైన పాత్రను పోషించాడు. గిరీశాన్ని మినహాయిస్తే... మిగతా పాత్రలను అభిముఖమైన జంటలుగా విడదీసి పరిశీలించవచ్చును. అనేక సమాన లక్షణాలుండి ఒకటి రెండు అంశాల్లో పూర్తిగా భిన్నమైన లక్షణాలను కలిగిన రెండు పాత్రలు అభిముఖమైన పాత్రలుగా నిర్వచించుకోవచ్చు. అభిముఖ స్వభావాలను (పొలారిటీస్) వర్ణించడంలో అనేకత్వాన్ని ఆవిష్కరించడమే గురజాడ లక్ష్యం.

ఆర్.ఎస్. సుదర్శనంగారు "హాస్యం ప్రసాదించే మానసిక స్వేచ్ఛ, దాని తాలూకు ఆహ్లాదమే గిరీశం పాత్ర సారాంశం" అని అలవోకగా ప్రతిపాదించడం ఆశ్చర్యకరమే. గిరీశం హాస్యప్రియుడు కానే కాదు. గిరీశం ద్వారా మనకు ప్రసారమయ్యే హాస్యం రెండు విధాలుగా లభిస్తుంది. ఒకటి – గిరీశం అప్పటి సమాజానికి ఆగంతకుడు. అతని భావాలు, భాష, ప్రవర్తన అన్నీ "వింత" అనిపించేవే. రెండు : అతని మాటలను చీల్చుకుని అతని కౌటిల్యం కూడా మనకు స్పష్టంగా కనబడుతుంది. అతని మోసం మనకు అర్థమైనప్పుడు మనం నవ్వకేం చేస్తాం. ఉదాహరణకు : బుచ్చమ్మను కొంత "న్యాయమైన" మార్గంలోనే తనదానిగా చేసుకోవడానికి అతను వేసుకున్న "లాభనష్టాల బేరీజు"లో విధవా వివాహం చేసుకోవడం వలన లభించే కీర్తిని కూడా చేర్చడం చూస్తే నవ్వురావడం సహజమే. అంతమాత్రాన అది కాలుష్యరహితం కానేకాదు. అందులో స్వేచ్ఛా లేదు. మనకు హాయీ లేదు. సారాంశంలో గిరీశం దగుల్బాజీగానే మిగుల్తాడు. అతని వాక్చాతుర్యం, సమయస్ఫూర్తి, కల్పనా ప్రావీణ్యం... అన్నీ కల్మషమయమే.

అసలు గిరీశం మొదటి దృశ్యం నుంచి ఆఖరి దృశ్యం వరకూ ఎక్కడ ప్రత్యక్షమైనా సొంత ఊసేగాని పరాయివారి ఘోష పట్టించుకోడు. ఆధునిక పెట్టుబడి దారుకున్న నిజాయితీకూడా లేదు. కనీసం ఆధునిక పెట్టుబడిదారుకున్న నిజాయితీకూడా లేదు. కనీసం ఆధునిక పెట్టుబడిదారు పోటీ వ్యవస్థలో నెగ్గుకురావాలిసిన అవసరముంది కనుక వస్తునాణ్యత – అంటే సరుకుల నాణ్యత – కోసం తాపత్రయపడక తప్పదు. వెంకటేశానికి చదువు చెప్పి పై క్లాసులో చేరుస్తానన్న మాట అబద్ధం. వెంకటేశమే అన్నట్లు 'చుట్ట నేర్పడం మాత్రమే' వెంకటేశానికి జరిగిన మేలు. మధురవాణితో హైదరాబాద్ నవాబుగారి ఉద్యోగాన్ని గురించి ముచ్చటించిన 'గోత్రాలు' (కోతలు) వదిలేద్దాం. అగ్నిహోత్రావధాన్లు ఇంటికి చేరిన తర్వాత కరటక శాస్త్రుల వారిని మంచి చేసుకుంటే తిండి ఏర్పరచే 'వెంకమ్మకు మెప్పుకదా' అని తొలి ప్రయత్నం చేశాడు. అది విఫలమయిన క్షణాన్నే, అగ్నిహోత్రావధాన్లు వైపు తన సమ్మోహనాస్త్రాన్ని సారించాడు. అగ్నిహోత్రావధాన్లుకీ గిరీశం ఒరగబెట్టిందేమీ లేదు. బుచ్చమ్మను చూసిన మరుక్షణమే "ప్రేమించేసాడు". ఆ తర్వాత అనేక సందర్భాలలో ఆమెను మచ్చిక చేయడానికి... శ్లాఘించాడు. ఆమెలాంటి సుగుణవతి లేదన్నాడు. కథల్లాగా చెప్పి ఆమెను వివాహం చేసుకుంటానని ఎన్నో మధురోహలను వర్షంగా కురిపించాడు. అయితే బుచ్చమ్మ నిరాయుధ. అందుకే జయించలేకపోయాడు. ఆఖరుగా ఓ రస్సా వేశాడు. "నీవు నాతో లేచివస్తే నీ చెల్లిలి పెళ్ళి ఆగిపోతుంద"ని అబద్ధం చెప్పాడు. అందుకనువైన తర్కం వెలగబెట్టాడు. ఆ తభాపతులేవీ ఆమెకు అర్థం కాకపోయినా, బుచ్చమ్మ 'త్యాగానికి' సిద్ధపడింది. లుబ్ధావధాన్లు ఆస్తికి పవరాఫ్ అటార్నీ సాధించడానికి అక్కడ


ఆనాటి విజయనగరంలో వీధి


విజయనగరం మహారాజా కళాశాల

తయారయ్యాడు. దొంగ సాక్ష్యం తనే చెప్పడానికి సిద్ధపడ్డాడు. అమాయకుడైన ఉత్తముడు సౌజన్యారావు పంతులును మభ్యపెట్టడం ఇంగ్లీషు ముక్కలు తెలిసిన గిరీశానికి పెద్ద విషయమేమీ కాదు. ఆఖరుకు తన గుట్టు రట్టు అయిన తర్వాత సౌజన్యారావు పంతులును 'ట్రూ రిపెంటెన్సుకి ట్వంటీఫోర్స్ అవర్సు చాలదా అండీ' 'ఐ క్రేవ్ యువర్ మెర్సీ' లాంటి వాక్యాలతోనే కాక గంభీరమైన అసహజ భాషలో మెప్పించడానికి ప్రయత్నించాడు. కాని మధురవాణిపట్ల సౌజన్యారావుకి స్వచ్ఛమైన గౌరవం ఏర్పడినందువలన 'సక్రమంగా చదువుకుని బాగుపడినప్పుడు మాత్రమే' బుచ్చమ్మతో వివాహ ప్రసక్తి - అందునా ఆమె ఇష్టపడితే - వస్తుందని హెచ్చరించి బయటికి తరిమాడు.

'కన్యాశుల్కం'లోని పాత్రలలో గిరీశం వ్యవహారం పసికట్టినవాడు ఒక్క కరటక శాస్తులు మాత్రమే. అది కూడా క్షణంలో సగంలో సాధ్యపడింది. తన సంస్కృత పాండిత్యాన్ని ప్రశంసించిన శబ్దాలు ఇంకా పూర్తిగా గాలిలో కలవకముందే అగ్నిహోత్రావధాన్లు వైపు ఒరిగిపోయిన క్షణాన గిరీశం అంతస్సు కరటక శాస్త్రులుకు అర్థమైపోయింది. వైదీకి పుటుక పుట్టినా చప్పన్నారు చోట్ల తిరిగిన ఘటం కనుక అతనికి దొరికిపోయాడు. కాని లుబ్ధావధాన్లు పెళ్ళిని పక్కదారి పట్టించే కార్యక్రమం ఉన్నందువలన గిరీశం బతికిపోయాడు. అన్ని విధాలా వ్యక్తిత్వం పెంచుకున్న మధురవాణి కూడా కరటక శాస్త్రులు వచ్చి చెప్పేవరకు గిరీశం స్వభావాన్ని, స్వరూపాన్ని గ్రహించనేలేదు.

మొదటి దృశ్యంలో గిరీశం బ్రతికి బట్టకట్టడానికైనా ఎక్కడి కన్నా పలాయనం చిత్తగించాలి. రెండో దృశ్యం మధురవాణి విజయనగరం నుంచి రామప్పంతులుతో రామచంద్రపురం చేరడానికి సిద్ధపడి బయానా పుచ్చుకోవడంతోనే ఇంచుమించుగా ప్రారంభమవుతుంది. ఈ దృశ్యంలో గిరీశం మధురవాణికి పార్టింగ్‌విజిట్ ఇవ్వడానికి వస్తాడు. తర్వాత గిరీశం కృష్ణరాయపురం చేరుకుంటాడు. అటు రామచంద్రపురం ఇటు కృష్ణరాయపురం... రెండు చోట్ల నించీ నాటకం రెండు పాయలుగా ప్రవహించి చివరగా విశాఖపట్టణంలో ఒక పాయగా ముగుస్తుంది. అయితే అక్కడ మధురవాణి... లుబ్ధావధాన్లు పెళ్ళిని మరో మార్గం పట్టించింది. మరి ఇక్కడ గిరీశం బుచ్చమ్మను మరో మార్గం పట్టించడంలో 'సఫలుడయ్యాడు.' గిరీశమూ, మధురవాణీ ఒకే ఉద్యమంలో పాలుపంచుకోవడం అసంభవం. గిరీశానికి ఎన్ని తెలివితేటలున్నా మధురవాణి మంచితనం ముందు, తల ఒగ్గవలసిందే. మధురవాణి బుచ్చమ్మ కాదు, గిరీశాన్ని కథానాయకుడుగా నిలబెట్టడం చారిత్రకంగా సమర్థనీయమే అయితే... గురజాడ అడ్డుపడే ప్రసక్తి లేదు. గిరీశాన్ని గురజాడ అప్పారావు సృష్టించలేదు, గుర్తించాడు. అందువలన గిరీశాన్ని సంస్కరించే ప్రయత్నం గురజాడ చేయలేదు. (చేయకూడదు కూడా).

**కొంపెల్ల జనార్ధనరావుగారు,**

ఒకసారి మనోహరమగు స్త్రీల పాతపాట ఒకటి అప్పారావు చెవినిబడి మనసున క్రొత్త సంగీతము తిరుగగా, తెలుగున ఒక క్రొత్త ఛందము నడిపింపవలెనని సంకల్ప ముదయించెను. 1919లో బరంపురమున జరిగిన నానావర్ణ సహపంక్తి భోజనములో అప్పారావు పాల్గొనినాడు. ఆ సంవత్సరమే తోకచుక్క పొడిచినది. ఒక విచిత్రమైన భావమథనమున అప్పారావు రసిక చిత్తమున నుండి ఒక క్రొత్త కవితావేశము రూపు కట్టినది... ఈతని కావ్యములు, పాత్రలు ఒక సహన భావోద్రేకములో ఈతనివలెనే, కావ్యౌచిత్యమును కుంటుపడనీయక మెరుగుదేరునట్లు సంస్కారాశయముల వెలిబుచ్చును.

**కిశోంబి రంగాచార్యులుగారు**

ఇంగిలీషు ప్రభుత్వం సుస్థిరంకాగానే, దిగజారుతున్న ఆర్థిక పరిస్థితులు బట్టబయలైనాయి. ప్రజలు అన్నంలేక మాడిపోతున్నారనీ, ఈ దుస్థితి ప్రజలకు కలగడం మన దుష్ట సాంఘిక పరిస్థితుల వల్లనేనని మన సంఘం మరామత్తు అయి, ప్రజాప్రభుత్వ స్థాపనమై, పరప్రభువుల స్వచ్ఛంద విహారం కట్టించబడితేనే గాని, ప్రజలకు మరి ముక్తి లేదని ప్రజల్లో కొంతయలజడి కలిగించి... అంతవరకూ నిరసించబడ్డ జాతీయ వారసత్వం తిరిగి ప్రజల దృష్టి నాకర్షించింది... ప్రజాసామాన్య సారస్వత రక్త ధ్వజం ఎత్తబడింది... ఈ రక్త ధ్వజాన్ని ఎత్తినవారిలో నగ్రగణ్యులు గురజాడ వేంకట అప్పారాయకవి.

**దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు**

గురజాడ అప్పారావు పందొమ్మిది వందల పదిహేనులో చనిపోయినా పంధొమ్మిది వందల పదిహేను తరువాతనే జీవించడం ప్రారంభించాడు. కాల్పనికోద్యమంలో ఉన్న ఉత్తమ లక్షణాలన్నీ స్వచ్ఛమూ, వివర్ణ సుందరమూ అయిన ఆయన వాణిలో కనబడతాయి. సామాన్యుల గాథలూ, సామాన్యుల మాటలూ, కావ్య ప్రాంగణాన ప్రవేశపెట్టడం ఆయన గొప్పతనం. ఆ 'ముత్యాలసరం' కూడా అలాగే అమరింది! ఆ ఛందస్సు తెలుగువాడి కష్టసుఖాలూ, కథలూ ఎంత బాగా చెపుతుంది! "పాట లాధర చెట్లచేమలకై, పాటపాడితే తాటి వనమున ఆగి చంద్రుడు తాను చెవియొగ్గడమూ".

"మంచి చెడ్డలు రెండు కులములు; మంచి అన్నది మాల అయితే మాల నే నౌదున్" అని చాటడమూ "నలుగురు కూర్చుని నవ్వే వేళల పుత్తడి బొమ్మను పూర్ణమ్మను ఒకపరి తలచి" అవన్నీ పలికించడమూ, "పెరిగి, విరిగితి, విరిగి పెరిగితినని స్వంత కష్టసుఖాలు తలపోసుకుని వాపోవడమూ, "ప్రేమ కలుగక బ్రతుకు చీకటి" అని ప్రేమికుడు కావడమూ. ఇవన్నీ ఆ క్రొత్త రోజుల్లో యువకవుల హృదయాలకు ఆనంద పక్షాలు తొడిగి, గూటి యెరుగనివాటికి కొండంత జీవితాకాశాన్ని చూపెట్టాయి. వీరి రచనలన్నిటిలోనూ వీరేశలింగం మానవోద్యమ ప్రభావమే కనబడుతుంది.

**కట్టమంచి రామలింగారెడ్డిగారు,**

గురజాడ అప్పారావు పంతులుగారు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషలలో నిష్ణాతులు.. ఆయన సృష్టించిన పాత్రలు మానవత్వంతో నిండినట్టివి. ప్రాణమున్న ప్రతివొక్కరిలోనూ అవి జీవించి జీవితాన్ని ఉత్సాహవంతం చేస్తాయి. మానవత్వంతోనూ, జీవితంతోనూ పరిపూర్ణమైన రచన కన్యాశుల్కం. దానిలోని స్త్రీలూ, పురుషులూ దయాదాక్షిణ్యాల తోను, విపరీతాలతోను, ఆయుక్తాలతోను, క్రౌర్యాలతోను, కుయుక్తులతోను, పవిత్రతతోను, వంచకత్వంతోను తిరుగులాడతారు. ప్రకృతి – ఆచారం హేతువు– సంప్రదాయం, అభిప్రాయం, ఛాందసత్వం ఒకదానితో వొకటి తీవ్ర సంఘర్షణలకు తలపడ్డ జీవిత వెల్లువలతో యిది నిండి తొణికిసలాడుతున్నది.

**మద్దుకూరి చంద్రశేఖరరావుగారు**

మహాకవి గురజాడ అప్పారావుగారి గేయాలలో తేట తెనుగు భాష తియ్యదనము చక్కగా ద్యోతకమవుతాయి. మృదుమధురమైన పదాలను ఏరి కూర్చడంలో గురజాడ వారికున్న ప్రతిభ "ముత్యాల సరాలు" చాటుతాయి. సరళమైన శబ్దాలకు పదునుపెట్టి జతచేర్చి తాము అందచేయాలనుకున్న భావాలను చదువరుల హృదయాలకు హత్తుకునేటట్లుగా చెప్పగల గొప్ప శిల్పి అప్పారావుగారు. పూర్ణమ్మ, కన్యక మొదలయిన పాటలను చదివితే మహాకవి రచనా పాటవం చక్కగా స్ఫురించుతుంది.

గురజాడవారి "దేశభక్తి" గేయము, జాతీయ గీతాలన్నిటిలోకి అత్యుత్తమమైనదిగా నేను భావించుతాను. బ్రిటీష్ వాళ్ళ జాతీయగీతమైన "గాడ్ సేవ్ ది కింగ్"లో సామ్రాజ్యవాదుల అహంకారం ద్యోతకమవుతుందేగాని, మానవత్వం గోచరించదు. భారతదేశంలో ఉత్తమ జాతీయ గీతాలుగా ఎంచబడుతున్న 'వందేమాతరం', 'జనగణమన'లలో కూడా మాతృభూమిని కీర్తించడం వుందేగాని, ప్రజానీకంపై దృష్టిని కేంద్రీకరించవు. "దేశమంటే మనుషులోయ్" అని ఎలుగెత్తి చాటిన అప్పారావుగారి గీతం వాటన్నిటికంటే మహోన్నతమైనదనడంలో సందేహం లేదు.

**శ్రీశ్రీ**

ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. ఈ సామాజిక చారిత్రక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశాలీ అయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను.. భవిష్యత్తు మీద గురజాడకున్న విశ్వాసానికి నేనిక్కడ నివాళులర్పిస్తున్నాను. తక్కినవాళ్ళంతా తెలుగుదేశంలో యోధానుయోధులైతే ఒక్క గురజాడ మాత్రమే ప్రపంచంలో ఎచ్చట ప్రామాణ్యాలకైనా నిలువగల సార్వజనీనతను సాధించినవాడు.

ఆధునిక సాహిత్య ప్రపంచంలో తెలుగు దేశపు సరిహద్దుల కవతల అంతర్జాతీయ కవి సమ్మేళనంలో తెలుగువారి తరపున ప్రతినిధిగా నిలువ గలిగినవాడు. గురజాడ అప్పారావు ఒక్కడే. కవిగా మాత్రమేకాదు, కథారచయితగా, విమర్శకుడుగా విశేషించి నాటక కర్తగా గురజాడ ధృవతార.

**నార్ల వెంకటేశ్వరరావుగారు,**

ముఖ్యంగా నాటకరచన విషయంలో ఈయన ప్రదర్శించిన ప్రతిభ సమకాలిక భారతదేశంలోనే కాదు, సమకాలీక ప్రపంచంలోనే గణుతింప దగినట్టిది. కన్యాశుల్కము' నాటకాన్ని - ఒక సమకాలిక సమస్య యితివృత్తంగా - ప్రకటించిననాటికి యూరప్ ఖండములోనైనా క్రొత్త నాటకం అంతగా ప్రచారంలోనికి రాలేదు.

**ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు**

అప్పారాయకవి ఆంధ్ర వాఙ్మయానికి ఒక సరిహద్దు. ఈయనతో నవ్యసారస్వతయుగం మొదలైనది.. స్వాతంత్ర్యపు టూర్పుపోసిన పరమేష్టి. దేశభక్తి అంటే ఏమిటో మొదట తెలియచెప్పిన మహానుభావుడితడే.

**సెట్టి ఈశ్వర్రావుగారు,**

సాంఘిక దురాచారాలను బట్టబయలు చేసి సంఘ సంస్కారాన్ని సాహిత్యం ద్వారా, అప్పారాయమహాకవికి పూర్వంగాని, తరువాతగాని ఏ తెలుగురచయితా ఆయన చేసినంత అమోఘమైన సేవ చెయ్యలేదనే నిస్సంశయంగా చెప్పవచ్చును.

దేవుళ్ళూ రాజులూ, ధనికులూ ఆక్రమించుకొన్న సాహిత్యాన్ని ప్రజలకు సంపాదించిన మహాపురుషుడు అప్పారాయ మహాకవి. సాహిత్య విప్లవకారకుడై నూతన సంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు.

అప్పారాయ మహాకవి తెలుగుజాతికి పెన్నిధి! ప్రపంచ కవుల కుటుంబానికి చెందిన విశ్వకవి!

**అభ్యుదయ సాహిత్య పత్రిక సంపాదకీయం,**

ప్రతి విషయంలోను ఇంత స్పష్టమైన దృక్పథం ప్రదర్శించిన మహాకవి వెనుక ఒక మహత్తరమైన శక్తి వుంది. మారుతున్న లోకాన్ని తన రచనల్లో స్పష్టంగా చిత్రించాడు. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాలు మేళవించి, సజాతీయంగా, సహజంగా "క్రొత్తపాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా" జాతిని మేల్కొల్పి విజ్ఞానపథాలకు నడిపే ఉత్తమాదర్శం ఆయన రచనల్లో అడుగడుగునా గోచరిస్తుంది.

ఆంధ్ర సాహిత్యంలో ఆయన అభ్యుదయ యుగానికి దారితీసిన మహాకవి. ఆయన ఉత్తమ జీవితాదర్శం ఎల్లప్పుడూ ఆంధ్రజాతి హృదయంలో వేగుచుక్కగా వెలుగొందుతుంది. ఆయన దివ్యవాణి ఆంధ్రజాతికి కర్తవ్యాన్ని ఉపదేశిస్తుంది. ముందుకు నడుపుతుంది. అదే ఆంధ్ర సాహిత్యాభ్యుదయానికీ, ఆంధ్రజాతికీ, అభ్యుదయానికీ ఆశారేఖ. ◈



# గురజాడ స్త్రీలు- సమకాలీనత

◈ మృణాళిని

కన్యాశుల్కం నాటకంలోనైతే సగానికి సగం డైలాగులు మన నిత్య జీవితంలో భాగమైపోయాయంటే అతిశయోక్తి కాదు. కానీ, గురజాడ, మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన లేఖలో యధాలాపంగా రాసిన ఒక వాక్యం "ఆధునిక మహిళ చరిత్రను తిరగరాస్తుంది" చాలా ఆసక్తి కలిగించే వాక్యం. ఈనాడు మనకు ఉపన్యాసాలు మొదలు పెట్టేందుకు ఉల్లేఖనంలా పనికి వస్తోందేమోగానీ, దాని అంతరార్థం గురించి ఇంకా ఆలోచించాల్సి ఉందని అనిపిస్తుంది.

గురజాడ అప్పారావును తలచుకోగానే ఎన్నో గొప్ప వాక్యాలు గుర్తుకు వస్తాయి. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్", "మంచి చెడ్డలు ఎంచి చూడగ మనుజులందున రెండె కులములు", "భగవంతుని సృష్టిలో కెల్లా ఉత్కృష్టమైన వస్తువు -విద్య నేర్చిన స్త్రీ రత్నమే' వంటివి. కన్యాశుల్కం నాటకంలోనైతే సగానికి సగం డైలాగులు మన నిత్య జీవితంలో భాగమైపోయాయంటే అతిశయోక్తి కాదు. కానీ, గురజాడ, మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన లేఖలో యధాలాపంగా రాసిన ఒక వాక్యం "ఆధునిక మహిళ చరిత్రను తిరగరాస్తుంది" చాలా ఆసక్తి కలిగించే వాక్యం. ఈనాడు మనకు ఉపన్యాసాలు మొదలు పెట్టేందుకు ఉల్లేఖనంలా పనికి వస్తోందేమోగానీ, దాని అంతరార్థం గురించి ఇంకా ఆలోచించాల్సి ఉందని అనిపిస్తుంది.

చరిత్రను తిరగరాయగల శక్తి సామర్థ్యాలు స్త్రీలకు ఉన్నాయని గురజాడ ఏ ఉద్దేశంలో అన్నారో గానీ, దీనివల్ల ఆయన స్త్రీల గురించి గొప్ప ఆశ, నమ్మకం కలిగి వున్నాడని ధ్వనిస్తుంది. బహుశా ఆయన సమకాలీన రచయితల్లో గానీ, కుటుంబాల్లో గానీ, సమాజంలో ఉన్న స్త్రీలలో గానీ ఎవ్వరికీ అంత విశ్వాసం స్త్రీ జాతిపై ఉండి వుండదు. ఆయన చూపిన ఆ విశ్వాసమే ఈనాటి స్త్రీకి చైతన్య స్ఫూర్తినిచ్చే ఒక కరదీపిక అవుతోంది.

అసలు, గురజాడ ఈ మాట ఏ ధైర్యంతో అన్నాడు? ఈ శతాబ్ది ఆరంభంలోనే ఇంతటి వ్యాఖ్య చేసాడంటే, ఆయనకు సమకాలీన స్త్రీలలో ఏదో శక్తి కనిపించి వుండాలి. అప్పటి వారు ఎవరూ ఊహించని ఒక కొత్త ప్రపంచాన్ని చూడగలిగిన దార్శనికత ఆయనలో ఉండి ఉండాలి.

ఇంతకూ, ఆ శక్తి ఏ స్త్రీలలో కనిపించింది? అంటే ఒకవైపు కుటుంబ వ్యవస్థలో ఉన్న స్త్రీలలోనూ (కమలిని, నాంచారమ్మ), మరో వైపు కుటుంబ వ్యవస్థ వెలుపల ఉన్న స్త్రీలలోనూ (మధురవాణి, సరళ) ఆయన ఆ శక్తిని గుర్తించారు. ఇంకా పసితనం కూడా పూర్తిగా పోని పూర్ణమ్మలోనూ, కన్యకలోనూ కూడా ఆయన అలాంటి శక్తిని గుర్తించారు. ఈ శక్తి బహుశా సామాన్యుల కంటికి కనిపించేది కాదు.

ఆయన చూసిన, ఊహించిన, ఆశించిన చైతన్యం స్త్రీలలో ఈనాటికైనా సంపూర్ణంగా వచ్చిందా అన్నది ఆలోచించాల్సిన విషయం. గురజాడ కథలు, కవితలు, నాటకాల్లో సృష్టించిన స్త్రీ పాత్రల్ని ఒక్కసారి తలచుకుంటే ఆయన ఆ పాత్రల ద్వారా ఎటువంటి స్త్రీల చైతన్యాన్ని ఆశించారో, ఈనాటి సమాజానికి దాని ప్రాసంగికత ఏమిటో అర్థమవుతుంది. గురజాడ రచనలన్నిటిలోనూ స్త్రీలే ప్రధానమన్న విషయం తెలిసిందే. పురుషులలోని వికారాలను సునిశితంగా విమర్శిస్తూ సాగిన ఆయన రచనల్లో స్త్రీల పట్ల గౌరవం, నమ్మకం ఆశాజ్యోతుల్లా ఁళుక్కుమంటూంటాయి.

**కవితల్లోని స్త్రీలు : ప్రతిఘటన చైతన్యం**

గురజాడ ఖండకావ్యాలు "కన్యక" "పూర్ణమ్మ కథ" రెండూ స్త్రీల అకాల మరణాలను చూపించేవే. అందుకే బహుశ అందరూ అవి హృదయ విదారకమైన కావ్యాలనీ, స్త్రీల కన్నీటి గాథలనీ వర్ణించారు; వర్ణిస్తున్నారు కూడా. అది పూర్తిగా నిజమే. అయినా, ఈ ఇద్దరు అమ్మాయిలు తమ జీవితాల్లో తీసుకున్న నిర్ణయాలను మరో కోణం నుంచీ చూసినపుడు గురజాడ ఈ కథల ద్వారా స్త్రీల గురించి ఏం చెప్పదలచుకున్నదీ కొంతవరకు అర్థమవుతుంది.

'కన్యక'లో

రాజు తలచిందేను ధర్మం,
రాజు చెప్పిందెల్ల శాస్త్రం,
రాజులకు పేరైన పద్ధతి కాద, గాంధర్వం"

అన్న అహంభావం, దుర్మార్గం మూర్తీభవించిన రాజుతో కన్యక ఎదురుపడి మరీ అంటుంది.

"కండకావరమెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండదావొక దైవమంటూ
వుండి వూర్కొనదా" అంటుంది.

రాజుగారి దుర్మార్గాన్ని చూస్తూ మౌనంగా ఉన్న పురజనులను కూడా ఘాటుగా ఖండిస్తుంది. ఆ రోజుల్లో ఒక స్త్రీ తనను చెరపట్టడానికి వచ్చిన పాలకుడిని నడివీధిలో నిలబెట్టి ప్రశ్నించడం, చూస్తున్న పురజనులను నిలదీయడం ఊహించలేని విషయమే. బహుశా ఆధునిక తెలుగు సాహిత్యంలో రాజ్యాన్ని, దానికి ప్రాతినిధ్యం వహించే పాలకుడినీ ధిక్కరించిన తొలి స్త్రీ కన్యకే. ఆమె మంటల్లో దూకి ఆత్మహత్య చేసుకోవటం తన జీవితంపై తనకు మాత్రమే అధికారం ఉందన్న ప్రకటన చేయడమే తప్ప, పిరికితనం, నిస్సహాయత్వం కాదు.

పూర్ణమ్మ కథా కావ్యంలో పూర్ణమ్మ తనకు ముసిలివాడితో వివాహం నిశ్చయమని తెలిసాక, అమ్మానాన్న దీవిస్తూంటే ఫక్కున నవ్వుతుంది. తన జీవితంలోని అపసవ్యత ఆమెకు అర్థమైంది. తన తండ్రి తనను ఎలా "ఉపయోగించుకుంటున్నదీ" అర్థమైంది. ఇకపై తన జీవితం ఎంత దుర్భరంగా ఉండబోయేదీ ఆమెకు తెలిసింది. అందుకే తన జీవితం తన చేతుల్లో ఉన్న ఈ ఆఖరి క్షణాలను ఎలా మార్చుకోవాలో ఆలోచించుకుంది. తన జీవితంపై తనకు ఉన్న హక్కును ఆత్మహత్య ద్వారా నిరూపించుకుంది.

ఈ రెండు ఆత్మహత్యలూ హృదయవిదారకమైనవే. ఆనాటి స్త్రీలు కుటుంబం, సమాజాల అధికారానికి, కులం ఆచారాలకీ బలైపోయిన వైనానికీ, వారి నిస్సహాయ స్థితికీ ఇవి నిదర్శనాలే. కానీ అదే సమయంలో వీళ్ళిద్దరి ఆత్మహత్యలూ ఒక నిర్ణయాత్మక ప్రకటనను చేస్తాయి. ఆ ఇద్దరు స్త్రీలు, తమ జీవితాలపై, తమ శరీరాలపై తమకే అధికారం ఉందని గుర్తించారన్న వాస్తవాన్ని చెబుతాయి. కన్యక, పూర్ణమ్మ, కేవలం ఆనాటి స్త్రీలకే ప్రతినిధులు కారు. అలాగైతే, వాళ్ళు తమ పరిస్థితికి లొంగి, ఆ పురుషులిద్దరికీ దాసోహమనేవారు. బహుశా పూర్ణమ్మ బాలవితంతువుగా మిగిలేది. పుట్టింట్లోనో, అత్తింట్లోనూ బానిసగా బతుకు వెళ్లదీసేది. కన్యక, "శీలం" కోల్పోయి (రాజుకు ఆమెను వివాహం చేసుకునే ఉద్దేశం ఎప్పుడూ లేదు కనుక) ఏ వేశ్యగానో బతికేది. లేదా రాజుకు ఉంపుడుగత్తెగా ఉండేది.

ఆ రోజుల్లో అలాంటి స్త్రీల జీవితాలకు అలాంటి ముగింపులకే అవకాశం ఎక్కువ.

కానీ వీళ్ళిద్దరూ ఆ ముగింపులను తిరస్కరించి, కొత్త చరిత్ర రాశారు. తమ జీవితానికి ఏ ముగింపు ఉండాలో తామే నిర్ణయించుకుంటామని చెప్పారు. చెప్పడం కాదు; చేసి చూపించారు. అందుకే వీరి ఆత్మహత్యలు ప్రతిఘటన చర్యలే గానీ, నిస్సహాయ చర్యలు కావు.

కన్యాశుల్కంలో వెంకమ్మలో కూడా ఇలాంటి ప్రతిఘటనే కనిపిస్తుంది. భర్త నిర్ణయించిన సంబంధాన్ని వ్యతిరేకించడం, ఆ వివాహం తప్పిపోవడానికి ఏదైనా పన్నాగం వేయమని అన్నగారిని అడగడం, తన మాట లెక్క చేయక, సుబ్బి పెళ్ళి లుబ్ధావధాన్లతో నిశ్చయించడంతో, నూతిలోకి దూకి ఆత్మహత్యాయత్నం చేయడం – ఆ రోజుల్లో సంప్రదాయ కుటుంబంలో పుట్టిన మధ్య వయస్కురాలి నుంచి మనం ఊహించలేని ప్రతిఘటనలు.

అంటే గురజాడ తమ జీవితాలకు సంబంధించిన ప్రధానమైన నిర్ణయాలు స్త్రీలు తీసుకుంటారనీ, తీసుకోవాలనీ ఆశించాడు. ఒక్కసారి గత శతాబ్దపు తొలి రోజుల్లో గురజాడ ఆశించిన ఈ మార్పును తలచుకుంటే, ఈనాటికీ స్త్రీలలో అధిక శాతం తమ నిర్ణయాలు తామే తీసుకోగల పరిస్థితులు లేవని అర్థమై, ఆందోళన కలుగుతుంది. ఈ వందేళ్లలో మన ఆడపిల్లలు ఆత్మహత్యలు చేసుకోవడం నేర్చుకున్నారు. కానీ ఆ రోజుల్లో అది ప్రతిఘటన కానీ, ఈ రోజుల్లో పిరికితనం. ఇప్పుడు ఎన్నో అవకాశాలు, సదుపాయాలు, న్యాయపరమైన, చట్టపరమైన ఆలంబనలు, ఎన్నో రకాల జీవన విధానాలు ఉన్నపుడు ఆత్మహత్య చేసుకోవడం క్షమించలేని నేరమవుతుంది. కానీ ఏ రకమైన ఆసరా, అండదండలు, ఆదుకోగల వ్యక్తులూ లేని రోజుల్లో అదే ఆత్మహత్య ప్రతిఘటన అవుతుంది. తన జీవితాన్ని తను అంతమొందించుకోవడం అలాంటి పరిస్థితుల్లో విప్లవాత్మక నిర్ణయమే అవుతుంది. ఇక్కడ కన్యక నుంచీ, పూర్ణమ్మ నుంచీ నేర్చుకోవలసినది ఆత్మహత్య చేసుకోవడం కాదు. తమ జీవితాలపై, తమ శరీరాలపై తమకు హక్కు ఉందనీ, దాన్ని తాము గౌరవ ప్రదంగా కాపాడుకోవాలనీ నేటి యువతులు గ్రహించడం, ఆచరించడం.

**కథల్లోని స్త్రీలు – సమస్యలు పరిష్కరించుకునే ధీరత**

గురజాడ చూపించే మరో రకం స్త్రీలు తమ సమస్యలను అర్థం చేసుకుని, వాటిని పరిష్కరించడంలో ఎవరి సహాయమూ, ఆసరా కోరకుండా తావే పరిష్కరించుకునే కమలినిలు, నాంచారమ్మలు. 'దిద్దుబాటు'లో కమలినికి వచ్చిన సమస్య ఆ కాలం నుంచీ ఈ కాలం వరకూ స్త్రీలందరు ఎదుర్కొనేదే. భర్త వ్యసనాలకో, పరస్త్రీ వ్యామోహానికో ఎర కావడం, తద్వారా భార్య జీవితంలో విషాదం – నిత్యమే కానీ, వైకల్పికం కాదు. ఇది సాధారణంగా స్త్రీలు తమలో తాము కుమిలిపోవడానికీ, లేదా భర్తను వేధించడానికీ, సాధించడానికీ, చివరికి రాజీ పడిపోవడానికీ దారి తీసే సందర్భం. కానీ కమలిని పై మూడు పనులు చేయదు. అసలు భర్త రోజూ ఆలస్యంగా ఇంటికి రావడానికి కారణమైన విషయం ఒక గంభీరమైన సమస్య అని గుర్తించడం; గుర్తించిన తర్వాత మరెవరికీ చెప్పుకుని ఏడవక, దానికి తను పరిష్కారం వెదుక్కోవడం, తక్షణమే ఆలోచనను ఆచరణలో పెట్టి, సమస్యను పరిష్కరించుకోవడం – ఒక విద్యావంతురాలైన స్త్రీ తన జీవితాన్ని ఎలా మలచుకోగలదో వ్యాఖ్యానించే గొప్ప రచన. ఇక్కడ భర్త కూడా స్వతహాగా కొద్దో గొప్పో సంస్కారి, మంచివాడు కావడం కమలిని వ్యూహం ఫలించడం ఎవరూ కాదనలేని విషయం. కానీ గమనించాల్సింది ఏమిటంటే – స్త్రీలు తమ సమస్యలను గుర్తించడం, దానికి ఉద్వేగంతో, ఆవేశంతోకాక, తెలివితో, సంయమనంతో (కమలిని రాసిన లేఖ) దాన్ని ఎదుర్కోవడం.

ఇక "మీ పేరేమిటి"లో నాంచారమ్మ ఒక అసాధారణమైన స్త్రీ. ధైర్యం తెలివితేటలు, తక్షణం నిర్ణయాలు తీసుకోగల ఆమె ధీశక్తి, మతం పేరిట రాగల అపాయాన్ని ఆమె నివారించడానికి దోహదం చేశాయి. మామగారు నిస్సహాయులై, భర్తగారు పిరికివారై సమస్యను తప్పించుకోగా, పరిస్థితిలోని తీవ్రతను (అది ఎంత మూర్ఖపు కారణం వల్ల వచ్చినదైనా) గుర్తించి, "పీర్" మీద విశ్వాసం చూపడం ద్వారా అసలు దైవభక్తికి, విశ్వాసానికీ మతంతో నిమిత్తమే లేదని నిరూపించిన మహిళ నాంచారమ్మ. ఆధునిక మహిళకు ఈమె ఖచ్చితంగా మార్గదర్శకురాలు. నాయకత్వ లక్షణాలు

సమృద్ధిగా ఉన్న ఈమె స్త్రీలు చరిత్రను తిరగరాస్తారు అన్న విశ్వాసాన్ని కలిగించే పాత్ర.

సంస్కర్త హృదయంలో సరళ కావడానికి 'తప్పు' వృత్తిని నిర్వహించే వ్యక్తి అయినా, ఆమెలోని మేధ, సంస్కారం, అభిరుచి అతి తక్కువ సంసారుల్లో కనిపిస్తుంది. ఏ చెడులోనైనా మంచి చూడగలగడం, స్త్రీలు తమ గురించి తాము ఆలోచించాలని చెప్పడం, ఆమెను ఆధునిక స్త్రీగా నిలబెట్టే లక్షణాలు.

**నాటకంలో స్త్రీలు**

గురజాడ ఒక సందర్భంలో స్త్రీల బాధల్ని ఈ రకంగా విశ్లేషించారు. "ఈ సమాజంలో స్త్రీల కన్నీటి గాధలకు కారణం నాకు తెలుసును. తిరిగి వివాహం చేసుకోకూడదనే నియమం, విడాకుల హక్కులేని కారణం, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం - స్త్రీల కన్నీటి గాధలకు హేతువులు' అని, ఆ రోజుల్లో విడాకుల గురించి, స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యం గురించి ప్రస్తావన చేయడం అనూహ్యమైన విషయమే. భార్యభర్తల మధ్య ఉండాల్సింది స్నేహమని చెప్పడం ఎంత విప్లవాత్మకమైన భావనో (కాసులు) ఇవి కూడా అంతే. దీన్ని బట్టి ఆయన ఆలోచన ఎంత సుదూర భవిష్యత్తులోకి వెళ్ళిందో, స్త్రీల గురించి ఆయన ఎంత తపన పడ్డారో, ఎంత లోతుగా ఆలోచించారో తెలుస్తుంది.

కన్యాశుల్కం నాటకంలో మధురవాణి, మీనాక్షి, వెంకమ్మ, బుచ్చమ్మ, పూటకూళ్ళమ్మ - వీళ్ళందరి గురించి ఇప్పటికే చాలా చర్చలు జరిగాయి. ఇందులో కుటుంబ వ్యవస్థలో ఉన్న స్త్రీలు, వెలుపల ఉన్న స్త్రీలు ఇద్దరు ఎలా ఉన్నారో, ఎలా ఉండాలో కూడ గురజాడ సూచించారు.

కె.వి.ఆర్. "మహోదయం"లో అన్నట్టు గురజాడ ఉద్దేశంలో వేశ్యల సమస్యలను వేశ్యలే పరిష్కరించుకోవాలి. వారికే తమకేం కావాలో తెలుస్తుంది. అంటే స్త్రీలు తమ గురించి తామే ఆలోచించుకోవాలి. మధురవాణి, సరళ చేసిన పనే అది. అయితే మధురవాణి అంతకంటే ఓ అడుగు ముందుకు వేసి, సమాజాన్ని భ్రష్టు పట్టిస్తున్నారన్న ఛీత్కారాలకు గురయ్యే తాము సమాజంలో ఓ మంచి మార్పుకు సహాయపడగలమని నిరూపించింది.

కన్యాశుల్కంలోని స్త్రీ పాత్రల ద్వారా గురజాడ నిరూపించింది స్త్రీలలో ఉండవలసిన ఐక్యతను. కథలో కనిపించని సుబ్బి క్షేమానికి నాటకంలోని తక్కిన స్త్రీలు పాటుపడడం, అందరూ ఎవరికి తోచిన రీతిలో వారు సహాయం చేయడం - స్త్రీలలో ఉండవలసిన తోటి స్త్రీల పట్ల సానుభూతిని చాటి చెప్పే నాటకమిది. మధురవాణి కరటకశాస్త్రి పన్నిన వ్యూహంలో కీలకపాత్ర నిర్వహిస్తుంది. బుచ్చమ్మ, తన అమాయకత్వంతో, తను గిరీశంతో లేచిపోతే సుబ్బి పెళ్ళి నిలిచిపోతుందని నమ్మి, అందుకు సిద్ధపడుతుంది. వెంకమ్మ సరేసరి. భర్తతో అనునిత్యం సుబ్బి పెళ్ళి ఆపడం గురించే వాదిస్తుంది. మీనాక్షి తన తండ్రి ఈ వయసులో పెళ్ళి చేసుకోవడంలోని అసంబద్ధతను గుర్తిస్తుంది; ప్రశ్నిస్తుంది.

ఇలా కన్యాశుల్కంలో వేశ్యను ఒక సామాజిక చైతన్యమూర్తిగా చూపడమే కాదు. ఒక స్త్రీని విముక్తం చేయడానికి అన్ని వర్గాలకు చెందిన స్త్రీలు (బాలవితంతువులు, పునిస్త్రీలు, వేశ్యలు) ఎలా కలిసికట్టుగా పూనుకోవాలో కూడా చూపారు గురజాడ. ఇప్పుడున్న అన్ని సమస్యల విషయంలోనూ స్త్రీలలో ఇలాంటి ఐక్యత సాధ్యమైతే వాళ్ళు చరిత్రను నిజంగానే తిరగరాయగలరు.

గురజాడ స్త్రీలకు చూపిన చైతన్య మార్గాన్ని ఎంతవరకు ఇప్పటివారు అందుకున్నారన్నది ప్రశ్న. ఆయన సాహిత్యాన్నంతటినీ చూస్తే పురుషుల పట్ల ఆయనకు అట్టే గౌరవం గానీ, నమ్మకం గానీ ఉన్నట్టు కనిపించదు. ఏదైనా మార్పు అంటూ సమాజంలో జరిగితే అది స్త్రీల వల్లే జరుగుతుందని ఆయన నమ్మారేమో అనడానికి కమలిని, నాంచారమ్మ, మధురవాణి, సరళ మంచి ఉదాహరణలు. పురుషులను ఎక్కువగా కేరికేచర్లను చేసిన ఆయన, స్త్రీల మీద గొప్ప విశ్వాసాన్ని పెట్టుకున్నారనిపిస్తుంది.

అందుకేనేమో ఈనాడు స్త్రీలు గురజాడ చూపిన మార్గాన్ని కొంతైనా అర్థం చేసుకోగలుగుతున్నారు. తమ జీవితాలపై తమకు హక్కు ఉందని, ఆ హక్కుల కోసం పోరాడాలనీ గుర్తించారు. గురజాడ చూపిన బాటలో స్త్రీలు కొందరైనా నడవగలుగుతున్నారు. పురుషులు ఇంకా ఆ స్ఫూర్తిని అందుకోవడం మిగిలే ఉంది. ◈

**(2013)**



# దిద్దుబాటల్లో నడిచిన కథా శిల్పాలు

◈ రామతీర్థ

**కథానిలయం నిర్వాహకులు వివినమూర్తి సంకలనం చేసిన *92* కథల సంకలనం "దిద్దుబాటలు – దిద్దుబాటుకు ముందు కథలు *92*" పేరిట తానా ప్రచురణ గా వెలువడింది. దీని ద్వారా, తెలుగులో తొలి కథా రచనా ప్రయత్నాలు, గురజాడకు ముందర దాదాపు *31* ఏళ్ళు ముందుకు జరిగాయి. రాసిన రచయితలు, రచయిత్రులు చూడబోతే, పేర్లు తెలిసిన వారు పదమూడు మంది రచయిత్రులు, పదమూడు మంది రచయితలు కనిపిస్తున్నారు.**

గురజాడ తొలి కథానిక దిద్దుబాటుకు పూర్వ రంగ వీక్షణానికి వెసులుబాటు కలిగిస్తూ, ప్రముఖ కథా రచయిత, కథానిలయం నిర్వాహకులు వివినమూర్తి సంకలనం చేసిన 92 కథల సంకలనం "దిద్దుబాటలు – దిద్దుబాటుకు ముందు కథలు 92" పేరిట తానా ప్రచురణ గా వెలువడింది. దీని ద్వారా, తెలుగులో తొలి కథా రచనా ప్రయత్నాలు, గురజాడకు ముందర దాదాపు 31 ఏళ్ళు ముందుకు జరిగాయి. రాసిన రచయితలు, రచయిత్రులు చూడబోతే, పేర్లు తెలిసిన వారు పదమూడు మంది రచయిత్రులు, పదమూడు మంది రచయితలు కనిపిస్తున్నారు. వీరు రాసిన కథలు జనవినోదిని (1875), హిందూ జన సంస్కారిణి (1884), కల్పలత (1903), తెలుగు జనానా పత్రిక (1893)బాలిక (1896),చింతామణి (1881 లేదా 1891), మహారాణి (1889), శారద (1895), హిందూ సుందరి (1902) సావిత్రి (1904), క ృషా?పత్రిక (1902), ఆంధ్రభారతి (1910), సువర్ణ లేఖ (1905). ఈ పత్రికల డిజిటల్ ప్రతులు వేట పాలెం లైబ్రరీలో చాలా మటుకు, ఇంకొన్ని వేరే ఆధారాలనుంచి, దొరకగా, ఈ గురజాడ తొలి కథ పూర్వరంగాన్ని ఇంత విస్తృతంగా తయారు చేసిన ఘనత, వివినమూర్తికి, నవీన్‌కి, తదితర మిత్ర బృందానికీ, ప్రచురించిన గుర్తింపు తానా వారికి దక్కడం, తెలుగు వారు సంత ృప్తి చెందే విషయమే.

నిజానికి పేరు తెలియని రచయిత రాసిన "చిలుకను గురించిన సంభాషణ" 1879లోనే జన వినోదిని (జనవరి సంచిక) లో వెలువడింది. వివిన మూర్తి గారికి కూడా ఇది సులభమైన పనేమీ కాదు. పేరు తెలిసిన కథకుడి కథ ఇది అనుకునే సరికే, సంకలనంలో పేరు తెలియని కథకుల కథలు 17 అంతకు ముందరే, కాలక్రమేణా చోటు చేసుకున్నాయి. ఈ పేర్లు తెలియని వారి కథలు అచ్చు అయిన పత్రికల వివరాలు ఉన్నాయి తప్ప, కథ రచన చేసిందెవరు అన్నదాన్ని పరిశోధించడానికి ఇంకా అవకాశం ఉన్నది. ఒక వేళ ఆ పత్రికల సంపాదకులే ఆ కథలు రాసి ఉండవచ్చు అని వివినమూర్తి ఒక సూచన చేసినప్పటికీ, ఆ కథా శైలి విషయమై, లోతుగా పరిశీలిస్తే తప్ప అటువంటి నిర్ధారణలకు రాలేము. ఈ సంకలన సంపాదకులు కూడా అటువంటి పరిశోధనలకు ఈ ప్రణాళికలో చోటు ఇవ్వలేదు. మొదటి కథ ఏ రచయిత పేరుతో దొరుకుతున్నదో ఆయన రాయసం వెంకట శివుడు. 1895లో ఈయన రాసిన కథ "మృదు భాషణ విద్యా విశారదుల కథ" అచ్చు అయింది "తెలుగు జనానా" మాస పత్రికలో. ఈయన1893 నుంచీ వెలువడుతున్న "తెలుగు జనానా" మాస పత్రిక కు సంపాదకుడు కూడా.

అయితే ఈ కథకు ముందరి నాలుగు కథల్లో మూడు ( గోవిందసామి యను కాపువాని కథ(అక్టోబర్,

1889), ఒక కాపు వకీలు దగ్గరకు వెళ్ళిన కథ (మే, 1892), ఒక స్వార్ధ పరుని కథ (మే, 1892), ఇలాంటి శీర్షికలే కలిగి ఉన్నాయి. ఇవి అచ్చు అయిన పత్రికలు కూడా వేర్వేరు. మహారాణిలో రెండు, జనవినోదిని లో ఒకటి ఇవి అచ్చు అయ్యాయి. కొంత రచనా శైలిలో, క్రియ పదాల వాడుకలో, వాక్య నిర్మాణంలో, రాయసం వెంకట శివుడి రచనా పోలికలు ఉన్న మాట వాస్తవం. ఈ పుస్తకం ఇంకా అదనపు పరిశోధనలకు, దారులు తీసే లక్షణాలు కలిగి ఉన్నది అని చెప్పడానికే, ఈ వివరణ ఇచ్చాను.

ముఖ్యంగా ఉత్తరాంధ్రలో, గురజాడ ముందరి సాహిత్య వాతావరణం పట్ల మనకు ఎటువంటి ఆధారాలు దొరకని వర్తమానంలో, ఈ పుస్తకంలో ఒక రచన అందుకై కొత్త తలుపులను తెరుస్తుంది, దీనికి కూడా రచయిత పేరు మనకు తెలియదు. ఈ కథ పేరు "బాల భార్యా వ ృద్ధ భర్త ృ సంవాదము", రచనా కాలం 1896. అచ్చు అయిన మాస పత్రిక హిందూ జన సంస్కారిణి అక్టోబర్ 1886 సంచికలో. అది ఉత్తరాంధ్ర వారే రాసి ఉంటారు అని శైలి పట్టి చెప్పవచ్చు. లేదూ, వైదీక బ్రాహ్మణ కుటుంబాలలో గల ఈ కన్యాశుల్క దురాచారం పట్ల విముఖత గల వారు ఎవరేనా రాసి ఉండవచ్చు. వైదీక కుటుంబాల భాషలో గురజాడ కన్యాశుల్కం నాటకం రాస్తూ ఉన్న కాలం కూడా ఇంచు మించు ఇదే. కన్యాశుల్కం ఇచ్చి ఒక పసిపిల్లను భార్య గా ఒక ముసలి బ్రాహ్మణుడు తెచ్చుకున్నాక, ఆమె, వయసుకొచ్చి రణ పెంకె, రాలుగాయ అయితే, ఎలా ఉంటుందో ఆ ఇంటి వాతావరణం, శక్తివంతంగా చెప్పిన సంభాషణా పూర్వక రచన ఇది.

కన్యాశుల్కం నాటకం ప్రకారం అయితే, మీనాక్షి ఒక్కతికే, ఇటువంటి పాత్ర కాగల సత్తా ఉన్నది. ఈ 1886 నాటికే, ఆనందగజపతి కన్యాశుల్క వివాహాల పై చట్టం తీసుకురావడానికి యోచిస్తున్నది, ఆ ప్రైవేటు బిల్లు కు అడ్డంకులు ఏర్పడగా, ఏ విధంగా కన్యాశుల్క దురాచారం గూర్చి ప్రజల్లో చైతన్యం కలిగించాలన్న ఆలోచనలో పడ్డది కూడా ఇదే సమయం. గురజాడ, ఒకటి రెండు సంవత్సరాల్లో, ఈ నాటక రచనకు పూనుకొననున్నారు. అయితే గురజాడ 1892కు పూర్తి అయిన తన నాటకంలో ఎటువంటి వాడుక భాష వాడారో, అటువంటి వ్యవహారిక భాషనే 1886 కే, ఈ కథా రచన చేసిన వారు కూడా వాడుకున్నారు అన్నది గమనార్హం.

1862కల్లా చిన్నయసూరి చనిపోవడం, గురజాడ పుట్టడం జరిగాయి. గురజాడ తెలుగులో తొలి రచన చేయడానికి (కన్యాశుల్కం -1892 లో ప్రదర్శించారు) ఇంకా ముప్పయి ఏళ్ల కాలం పట్టనున్నది. అయితే ఈ కథల సంకలనంలో భాష ను చూస్తే, మొదటి కథ 1879లో వెలువడ్డ "చిలుకను గురించిన సంభాషణ" మొదలుకుని, చిన్నయసూరి వాడిన కృతక గ్రాంధికం కనిపించకపోవడం, ఒక స్పష్టమైన లక్షణం. ఇదీ చిన్నయ గారి శైలి.

"మృద్ఘటమువలె దుర్జనుని సులభముగా భేదింపవచ్చును గాని సంధింపగూడదు. హేమ ఘటమందు వలె సుజనుని యందీ లక్షణము విపరీతమై యుండును. ద్రవత్వము వలన సర్వ లోహములును, నిమిత్తము వలన మ ృగ పక్షులును, భయలోభముల వలన మూర్ఖులును, దర్శనము వలన సజ్జనులును కలసికొందురు. మరియు శుచిత్వము, త్యాగము, శౌర్యము, సుఖ దుఃఖములయందు సామాన్యము, దాక్షిణ్యము స్నేహము సత్యవర్తనమును సుహృద్గుణములని చెప్పుదురు. ఈ గుణము లన్నియు నీయందుఁగాన బడుచున్నవి. ఇతరుని నీవంటి వానిని కని విని యెరుఁగఁను. నీ బోఁటి వానితో సఖ్యము సంపాదించుకొనుట కంటె మేలొకటి లేదు. నా కోరిక యీడేచితివా మేలయ్యెను. లేదా యింతే నా యదృష్టమని యెంచుకొనియెదను".

గురజాడ 1910లో "దేవుళ్ళారా మీ పేరేమిటి" లో వాడినటువంటి భాషే, కొద్దిపాటి తేడాలతో, 1879లో వెలువడ్డ కథలోనూ కనిపించడం, మామూలు విషయం కాదు. చిన్నయసూరి ప్రభావం, వచన రచన పై లేని విషయం, ఈ సంకలనంలోని తొలి ఇరవై తొమ్మిది కథలనుంచే నిరూపించ వచ్చును, ఎందుకంటే, అవి 1879 నుంచి 1899 వరకూ ఇరవై ఏళ్ల కాలంలో రాయబడ్డవి. చిన్నయ గారి ప్రభావం ఏమైనా ఉంటే ఆ 1880-99 కాలపు కథలపై మిక్కిలి గా ఉండాలి. కానీ ఈ కథలు రాసే వారు, మంచి తెనుగు రాశారు, వీటిలో ఎన్నో నుడికారాలు, వ్యవహారిక పదాలు. మాండలికాల సొబగులుఉన్నాయి. గురజాడకు ముందరే, తెలుగు భాషా రచన ఎటువంటి మార్పులకు లోనవుతున్నదో, ఈ కథలు అన్నీ కూడా మనకు వివరిస్తాయి.

పేరు తెలియని రచయితల కథల్లోనే, ఉన్నమరొక మంచి ఉదాహరణ, రుతువుల గురించి అజ్ఞాత రచయిత

**ఈ “ దిద్దుబాటలు” పరిశోధనాత్మక సంకలనంలో మనకు పలు కోణాలనుంచి కథాపరమైన భాష, నిర్మాణం, క్రియా పదాల ఆధునికత, సరళ వ్యవహారికాన్ని వినియోగించడంలో ఈ కథలు రాసిన వారి సానుకూలత, స్త్రీ విద్య, స్త్రీ వికాసం అనే విషయాలపై చాలా వరకు దృష్టి ఉంచి ఈ కథారచనలు చేయడం, వంటి లక్షణాల కోసం ఈ కాల్పనిక ( ఫిక్షనల్) డేటాను విశ్లేషించడానికి వీలుగా ఇవి అందుబాటులో ఉండడం, నిజంగా 2015లో తెలుగు కథ విషయంలో జరిగిన మంచి పరిణామం అని నిస్సందేహంగా చెప్పవచ్చును.**

1882లోరాసిన కథలు. ఇవి జూలై, సెప్టెంబర్, నవంబరు సంచికల్లో “జన వినోదిని” పత్రికలో వెలుగు చూశాయి. “ఒక సంవత్సరము పల్లెటూరి యందునికి లేక ఋతుచర్య, గ్రీష్మఋతువు, వర్షఋతువు మూడు ఒక కథా శృంఖల వలె తోస్తాయి. ఎందుకంటే పాత్రలు చెంచునాయుడి బిడ్డలుగా కొండల రాయుడు, బాలక్క, పేరక్క ఇతర చెన్నపట్నపు స్నేహితులు, ఇదొక పెన్నా తీర గ్రామాల కథా స్రవంతి. కథ మాట ఎలాఉన్నా ఋతువర్ణనలు, (పేజీ 47 లోని వసంతం కోసం ఎదురు చూసే వర్ణన) వచనంలో, రాయలవారి పద్యాలకు తీసిపోకుండా ఉన్నాయన్నది, కొన్ని వందల ఏళ్ల కిందటి రాయల వారి ఆముక్త మాల్యద పద్యాలతో పోల్చి స్పష్టంగా నిరూపణ చేయవచ్చును, (ఈ కథా రచయిత చేసిన ఇంత పెద్ద వర్ణనలోనూ, ఒక్కటి కూడా చిన్నయ సూరి భాష పోలిక, ప్రభావం కనపడక పోవడం గమనార్హం). అంతేకాక భావ కవుల్లో ముఖ్యుడైన క ృష్ణశాస్త్రి, తన ముద్రగా1920ల్లో వాడుకున్న తెలుగు పలుకు నయగారం అంతా, నలభై ఏళ్ల ముందరే, ఈ పేరు తెలియని రచయిత వచనంలో, రస రమ్య అస్తిత్వంలో పలకరిస్తుంది. ఇంత మంచి వచనం, గురజాడకు ముందరే ఉన్నది అని చెప్తున్న ఈ కథలను సంకలనం చేసి అందించడానికై వివిన మూర్తి, వాసిరెడ్డి నవీన్, ఇతర మిత్రుల శ్రమకు ఫలితం దక్కింది.

ఈ “ దిద్దుబాటలు” పరిశోధనాత్మక సంకలనంలో మనకు పలు కోణాలనుంచి కథాపరమైన భాష, నిర్మాణం, క్రియా పదాల ఆధునికత, సరళ వ్యవహారికాన్ని వినియోగించడంలో ఈ కథలు రాసిన వారి సానుకూలత, స్త్రీ విద్య, స్త్రీ వికాసం అనే విషయాలపై చాలా వరకు ద ృష్టి ఉంచి ఈ కథారచనలు చేయడం, వంటి లక్షణాల కోసం ఈ కాల్పనిక ( ఫిక్షనల్) డేటాను విశ్లేషించడానికి వీలుగా ఇవి అందుబాటులో ఉండడం, నిజంగా 2015లో తెలుగు కథ విషయంలో జరిగిన మంచి పరిణామం అని నిస్సందేహంగా చెప్పవచ్చును.

ఈ కథల రచయితల (ఇంకా పేర్లు తెలియని వారి దగ్గరే, 1895 కి ముందరే ఉన్నాము) రచనల్లో ఒకటి “ఇష్టము కలిగెనా దారియుం గలదు” అనేది, ఆంగ్ల భాషా పాండిత్యం, పరిచయము కూడా ఈ రచయితలు 1881 నాటికే కలిగి ఉండడమే కాక తమ సాహిత్య రచనల్లో ఆ జ్ఞానాన్ని పొందుపరుస్తున్నారు కూడా అని చెప్పడానికి మంచి ఉదాహరణ. ఈ శీర్షిక ఆంగ్లంలో అయితే, “వేర్ దేర్ ఈజ్ ఎ విల్ దేర్ ఈజ్ ఎ వే” అన్న సూక్తికి తెలుగు సేత మాత్రమే, కానీ కథ చాలా వినోద భరితం. చిత్రణ చేసినది మన తెలుగు జీవితం. ఇందులో కొంత తెలుగు ఇప్పుడు మనకు తెలుసు, చాలా పదాలు మారిపోయాయి. అందుకే ఈ కథలు నాకు ముచ్చట గొలిపాయి. ఆంగ్ల భాష ఇంకా చిన్న టవున్లూ, గ్రామాల్లోకి ప్రవేశించనప్పుడు, మన తెలుగు ఎలా ఉండేదో, ఈ కథ బాగా చెప్తుంది. కథ చెప్పేది అంతా ఒక పల్లె లోని వ్యక్తి పక్క ఊరికి తన వ్యాపార వ్యవహారమై వెళ్ళేందుకు పొరుగింటాయనను గుర్రం ఎరువివ్వమని కోరడంతో, సంభాషణ తోనే ప్రారంభమవుతుంది.

ఇక్కడ మనకు అర్థమయ్యే సామాజిక విషయం, 1881 నాటికి, లేదా అంతకు ముందరి కథా కాలంలో, మన దేశంలో, మన ప్రాంతాల్లో కూడా గుర్రం ప్రధాన ప్రయాణ వాహనం. పదుల మైళ్ళ దూరాలు వెళ్ళి రావాలి అంటే, ఒక్కనికి అయితే గుర్రమూ, కుటుంబం అయినా, కొంత ఫాయాలో ఉన్న వారికైనా ఎద్దుల బండి, గుర్రబ్బగ్గీ, లేదా, మరీ సంప్రదాయ వ్యవహారాల్లో పల్లకీ, ఆనాటి ప్రయాణ సాధనాలుగా అర్థం చేసుకుంటాము. 1890ల్లో గురజాడ రాస్తున్న కన్యాశుల్కం నాటకంలో కూడా రామప్పంతులు గుర్రం ఎక్కే తన వ్యవహారాలకై వెళ్తుంటాడు. అయితే ఈ 1881 నాటి కథలో “రికాబు” అని గుర్రం ఎక్కడానికి అనువుగా ఉండే దాన్ని “పల్లం” అని మాండలిక పరిభాషలో పిలవడం అలాగే, పావు గంట అనడానికి “పాతిక గంట” అనడమూ చూస్తాము. రచనా భాష వ్యవహారిక స్వభావం పై మనకు ఏ సందేహమూ అక్కరలేనంత స్పష్టంగా, గురజాడ పూర్వ రంగంలో, దాదాపు పదేళ్ళు ముందరే, ఇటువంటి

ప్రజల భాష అలనాటి తొలి ఆధునికతలో భాగంగా, రచనల్లో కనిపించడం ఒక గమనించ దగ్గ పరిణామం. దర్జీ అనే మాటకు బదులు నవంబర్ 1882 సంచిక "జనవినోదిని"లో అచ్చు అయిన కథ శీర్షిక "వడ్లంగియు కుట్రపు వాడును" అని ఉంటుంది. ఇక్కడ మరియు (అండ్) ప్రయోగం లేకపోడం తో పాటు "కుట్రపు వాడు" అనే మాట అప్పట్లో కుట్టు పని వారికి, వాడుకలో ఉండేదని తెలుసుకుంటాము.

చింతామణి పత్రిక జూన్ 1898 సంచికలో "ఎ ఉమెన్ ఇన్ డిస్ట్రెస్" అన్న ఆంగ్ల శీర్షిక తో సహా "దుర్దశనున్న యొక స్త్రీ" అన్న స్వగత రూప కథా శకలం ఒకటి కనిపిస్తుంది. 1898 అంటే, కన్యాశుల్కం నాటకం ప్రదర్శన జరిగి ఆరేళ్లు, నాటకం అచ్చు అయి ఒక ఏడు అయ్యాయి. వీరేశలింగం పంతులు గారి వితంతు పునర్వివాహ మహెూద్యమం సాగుతున్నది. ఆ ఖ్యాతి, ప్రభావం, ఆనాటి మన రాజధాని అయిన మదరాసు వరకూ పాకింది. ఈ నేపథ్యంలో ఒక బాల వితంతువు పాత్ర , చాలా నిష్కర్షగా తన స్వరంలో తన బాధను నమోదు చేసిన రచన ఇది. కథ రాసిన వారి పేరు లేదు కానీ అప్పటి సంస్కరణలు, వితంతువుల కష్టాల పట్ల ఖచ్చితమైన అవగాహన, ఈ రచనలో కనిపిస్తాయి. " నల్లని కాటుక కొనలును, కుంకుమ బొట్టును, చక్కని శిఖయు, గలుగల్లను కడియములు, అందెలు, గొలుసులును, జరీ కోకలును, పట్టు రవికలును, గాజులును, కలలోని వార్తలయ్యే. సన్యాసము వచ్చే. నాకీ సైను పంచె తప్పదు. విభూతి బొట్టు తప్పదు.ఒంటి పూట భోజనము, రాత్రి రొట్టె తప్పవు. తెల్లారుజామున నాలుగు గంటలకు నుండి పది గంటలవరకు బానిస వలే పని చేయవలెను గదా. ఎవరి ఉపయోగమునకు నేనిట్లు బతికియు చచ్చి యుండుట? నా కొరకా? నాకిప్పుడేమి సౌఖ్యమున్నది? ముందేమి రానై యున్నది? కాదు ఇతరులకొరకా, తప్పక వారి కొరకే. ఓ తల్లితండ్రులారా!చిన్నప్పటి నుండియు నింత ప్రేమతో నన్ను బెంచి నా సంసారము నట్టేట గలిపి మీ దాసినిగ జేసికొనుటకై నాకీ వికార రూపమొసంగుటకు మీకు చేతులెట్టు లాడెను?". ఇటువంటి రచనలు చూస్తే, ఆ నాటి తెలుగు సమాజం అంతటా, స్త్రీల దురవస్థలో సాంఘిక సంప్రదాయం పోషిస్తున్న ఆధిపత్య పాత్ర పట్ల వ్యతిరేకత, ధర్మావేశం, తమకే తెలిసిన భాషలో ఈ భావనలను రచనలు గా చేయడం, గురజాడ కాలపు ఒక సాంఘిక వాతావరణంగా మనం భావించ వచ్చును.

ధన త్రయోదశి మొదలుకుని భండారు అచ్చమాంబ గారివి ఈ సంకలనంలో మొత్తం పదమూడు కథలు ఉన్నాయి. కథల్లో స్త్రీ సర్వతోముఖ వికాసం ముఖ్య ఇతివృత్తంగా గమనిస్తాము. 1900 నాటికి విద్యావంతులైన స్త్రీలు నూటికి ఒక్కరూ అని మదరాసు లెక్కలు చెప్పగా, విశాఖపట్నం, గంజామ్ జిల్లాల్లో నూటికి ముగ్గురు ఉన్నట్టుగా గణాంకాలు ఉన్నాయి. ఈ నేపథ్యంలో, స్త్రీలు చదువు నేర్వడమే కాకుండా, పదముగ్గురు స్త్రీలు కథలు కూడా రాశారు అన్నది, వారి సంఖ్య ఎంత తక్కువో, అయినా సాంఘిక ప్రభావ రీత్యా ఇది ఎంత ముఖ్యమైన మార్పో, మనం తెలుసుకోవడానికి ఉపయోగ పడుతుంది. అందువల్ల ఇవి కథ లక్షణాలు కలిగి ఉన్నాయా లేదా అన్న చర్చ కన్నా, స్త్రీల వికాస శతాబ్దం గా పందొమ్మిదివ శతాబ్దం ఎలా వారికి నూతన స్వరాలను ఇవ్వడం మొదలు పెట్టింది అన్న కోణం నుంచి చూస్తే, ఈ రచనల ఘనత మనకు బాగా విశదం అవుతుంది.

గురజాడ "దిద్దుబాటు" కథలో కొంత దారి తప్పిన భర్తను ఎలా ఒకింత చతురతతో ఆమె మారుస్తుందో, అటువంటి ప్రయత్నాలు ఈ 92 కథల్లో చాలా చోట్ల స్త్రీ పాత్రలు చేస్తాయి. ఆ కథలకు ముఖ్యంగా "అంతపురోపన్యాసము" అని పేరు ఉన్నది, 1,2,3,4 అని ఈ కోవన నాలుగు కథల్లో, భర్తలను మార్చగోరు స్త్రీల పాట్లు చిత్రణ చేయడం, గురజాడ తొలికథానిక పూర్వ రంగం కావడం కాకతాళీయమైన విషయం ఏమీ గాదు. కొన్ని చోట్ల "ఆడవారే ఆడవారి శత్రువుల"న్నట్టు, తమ ఇంటి ఆడపిల్లకు, రజస్వల పూర్వ వివాహమే ముఖ్యము అంటూ మొండి పట్టు పట్టే భార్యలు కూడా ఈ కథల్లో కనిపిస్తారు. 1900 నాటి "తెలుగు జనానా" పత్రికలో "భార్యా భర్తల సంభాషణ" కథలో అటువంటి భార్య, కొంత అభ్యుదయ భావాలున్న భర్త కనిపిస్తారు. కథ చివర్లో "శ్రీమజ్జనానా" పత్రికవారి సూటి సందేశం కూడా చూస్తాము. అది బ్రిటిష్ వారికి, బోయర్ సైన్యములకు దక్షిణాఫ్రికాలో జరుగుతున్న యుద్ధం గురించి ప్రస్తావిస్తూ, అక్కడి బోయర్ల సైన్యాధికారి జనరల్ జౌబర్ట్ కు సాయపడుతున్న ఆయన సతీమణి వలె, ఇక్కడి స్త్రీలు కూడా కార్య శూరులు కావాలన్న ఉద్బోధ చూస్తాము.

> ***ఫిబ్రవరి 1910 లో గురజాడ "దిద్దుబాటు" కథ ప్రస్తావించి ఈ సంకలనాన్ని ఆపుదల చేయాలని సంపాదకులు అనుకున్నదానికి పెద్ద హేతువు కనిపించదు. కనీసం 1910 సంవత్సర కాలాన్ని పూర్తిగా పరిగణనలోకి తీసుకుని ఉండాల్సింది. ఇప్పటికే సంకలనంలో ఒకటికి మించి భండారు అచ్చమాంబ, మొసలిగంటి రామాబాయమ్మ, రాయసం వెంకట శివుడు, ఈశ్వరప్ప పంతులు, ఆచంట సుందర రామయ్య, ఆచంట సాంఖ్యాయన శర్మ ఇలా రచయితల కథా రచనలు ఉండగా, అదే 1910లో వచ్చిన గురజాడ రెండు కథలకు ఈ సంకలనంలో చోటు లేదని ఎలా సంపాదకులు భావించారో, అందువల్ల సాధించిన ప్రయోజనం ఏమిటో కూడా, స్పష్టం కాదు.***

గంజాం ప్రాంతపు నౌపడాకు చెందిన బుద్ధిరాజు ఈశ్వరప్ప పంతులు రాసిన హాస్య స్ఫోరకమైన పదమూడు కథలు ఈ సంకలనంలో ఉన్నాయి. 80 నుంచి 92 దాకా వరుస సంఖ్యలో ఉన్న ఈ రచనలు "విచిత్ర మంజరి" పత్రికలో ముద్రితాలు. ఈ సంకలనంలో పొందు పరిచేందుకు ఈ పత్రిక వివరాలు లభ్యమైనట్టుగా లేదు. కానీ ఉత్తరాంధ్ర మాటలు అయిన "సంగోరు", "శానా యేళ" " గుంట పువ్వులు పూస్తూ" "బరాటం" "కవిలికట్ట"వంటి మాటలు, పలుకుబడుల వాడకం వీరి హాస్య రచనల్లో కనిపించడమే కాక, ఒకప్పుడు రామనవమి, దసరా పూజల్లో, పూజా పందిళ్లలో ఏర్పాటు చేయిచ్చే దిమిలి పొడుగు మనిషి చెప్పే హాస్య ఉత్తరాలు, చతుర్లు వంటి వాటికి, అవసరమైన నవ్వు పుట్టించే పేర్లు వీరి వాడుకలో మనం చూస్తాము. "అంధకార పురం" "గందరగోళరావు తహసీలు దారు", మహారాజశ్రీ అవివేకరావు పంతులు" "దేశదిప్పకాయ పంతులు", "నియోగీ - వైదీకి సంభాషణాలూ", ఇలా ఈశ్వరప్ప పంతులు విశాఖపట్నం జిల్లా మరియు గంజామ్ జిల్లాల సాంస్కృతిక బహుళతను గురజాడ కథలకు ముందరే మన కళ్ల ముందర ఉంచారు.

ఇక ఫిబ్రవరి 1910 లో గురజాడ "దిద్దుబాటు" కథ ప్రస్తావించి ఈ సంకలనాన్ని ఆపుదల చేయాలని సంపాదకులు అనుకున్నదానికి పెద్ద హేతువు కనిపించదు. కనీసం 1910 సంవత్సర కాలాన్ని పూర్తిగా పరిగణనలోకి తీసుకుని ఉండాల్సింది. ఇప్పటికే సంకలనంలో ఒకటికి మించి భండారు అచ్చమాంబ, మొసలిగంటి రామాబాయమ్మ, రాయసం వెంకట శివుడు, ఈశ్వరప్ప పంతులు, ఆచంట సుందర రామయ్య, ఆచంట సాంఖ్యాయన శర్మ ఇలా రచయితల కథా రచనలు ఉండగా, అదే 1910లో వచ్చిన గురజాడ రెండు కథలకు ఈ సంకలనంలో చోటు లేదని ఎలా సంపాదకులు భావించారో, అందువల్ల సాధించిన ప్రయోజనం ఏమిటో కూడా, స్పష్టం కాదు. "ఆంధ్ర భారతి" ఫిబ్రవరి-మార్చ్ సంచిక లో గురజాడ కథ దిద్దుబాటు, అలాగే ఏప్రిల్-మే సంచికలో వచ్చిన "దేవుళ్ళారా మీ పేరేమిటి? కథ కూడా ఈ సంకలనంలో ఉండి ఉండాల్సిన కథ. అలా చేయడం గురజాడ రచనా శక్తికి సంపూర్ణమైన తులనాత్మకమైన ఫోకస్ ఈ సంకలనంలో ఏర్పర్చినట్టు ఉండేది. అలాగే 1910 ఆంధ్ర పత్రిక సాధారణ ఉగాది ప్రత్యేక సంచికలో వెలువడిన "యాబదివేల బేరము" క. రామానుజ రావు కథ కూడా ఈ సంకలనంలోనికి రాలేదు. సంకలనం అబ్ రప్ట్ గా ఆగినట్టు కూడా అనిపిస్తుంది. అయితే ఇవి చిన్న అసంతృప్తులు మాత్రమే.

కొత్త పరిశీలనలకు, ప్రక్రియా వికాసం పై పరిశోధనలకు ఈ సంకలనం ఎన్నో అవకాశాలను కలిగిస్తున్నది అన్నది నిర్వివాదాంశం. అందుకే వివిన మూర్తి తన విపులమైన ముందు మాటలో ఇలా ముక్తాయించారు. "తెలుగులో తొలి కథ ఏది అన్న వెదుకులాట ఈ పుస్తకం ప్రకారం చూస్తే ఏదో ఒకటి అనవచ్చు గాని రచయిత ఎవరూ అంటే సమాధానం దొరకదని నిశ్చితంగా చెప్పగలను. అంటే కాదు ఈ కథలను శ్రద్ధగా చదివితే మంచి కథకి కావలసిన ఊహాశక్తీ, కల్పనాశక్తీ, సామాజిక బాధ్యతలను ఆరంభంలోనే తెలుగువాడు గ్రహించాడని మనం గర్వపడగలం . సామాజిక శృంఖలాలను స్త్రీలు బద్దలు కొట్టుకుంటున్న చప్పుళ్ళు వినగలం". ఈ మాటలు సత్యాలే కాక ముందు ముందు జరగాల్సిన కృషికి దోహదకారులు కూడా. అందుకే గురజాడ శతవర్ధంతి సంవత్సరంలో ఈ "దిద్దుబాటలు" ఇంత సమగ్రంగా అందించిన రచయితలు, సంపాదకులు, సాహిత్య కారులు, ప్రచురణ కర్తలు అందరికీ అభినందనలు. ◈



# మనసు దోచిన మధురవాణి

◈ డా॥ కె. శ్రీదేవి

**అగ్నిహోత్రావధాన్లు లాంటి ఛాదస్తపు శోత్రియ బ్రాహ్మణులు కాని, వైధవ్యం పొందిన స్త్రీలు కఠినమైన ఆచారాల కింద నలిగిపోవడం కాని, ముసలి పెళ్ళికొడుకులు గాని, చివరకి ఆనాటి రకం బాజాభజంత్రీలు, గుర్రపు బళ్ళవాళ్ళు కానీ ఈనాడు కనపడరు అనేది నిజమే అయితే కన్యాశుల్కంలో హాస్యం ఆ పరిస్థితుల మీద మాత్రమే కాక ఆ పరిస్థితులలో జీవిస్తున్న మానవుల మౌలిక మనస్తత్వాల మీద ఆధారపడింది కావడం వల్ల ఆ హాస్యం ఈనాటికీ ప్రేక్షకుల మధ్య, పాఠకుల మధ్య పండుతుంది.**

తెలుగు సాహిత్య చరిత్రలో ముఖ్యంగా ఆధునిక తెలుగు సాహిత్యంలో సాహితీప్రియుల మనస్సుల మీద చెరగని ముద్రవేసిన పాత్రలో మధురవాణి పాత్ర ప్రముఖమైనది. ముఖ్యంగా ఆకర్షణీయమైన స్త్రీ పాత్రల పరంపరలో మధురవాణి పాత్ర స్థానం తెలుగు సాహిత్యంలోని ఏ స్త్రీ పాత్రతో పోల్చినా బలమైనదేనని చెప్పవచ్చు. సాధారణంగా ప్రాచీన సంస్కృత నాటకమైనా 'మృచ్ఛకటకంలోని వసంతసేన' అనే వేశ్యపాత్రతో మధురవాణి కూడా వేశ్యపాత్ర కావడం వల్ల ఈ పాత్రతో పోల్చుతూ ఉంటారు. కానీ నిజానికి సందడిగా గలగలలాడుతూ రంగస్థలమంతా తానై వెలిగిపోతూ నాటకంలో ఆద్యంతమూ తిరుగులేని ప్రాముఖ్యత ప్రదర్శించడంలో వసంతసేన పాత్రకంటే మధురవాణి పాత్రే శక్తివంతమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

విమర్శకులు తరచు మధురవాణిని గురజాడ వారి గొంతుక అంటుంటారు. ఈ అభిప్రాయం సమంజసమైనా కాకపోయినా గురజాడవారు ఈ అభిప్రాయం కలిగేంతగా మధురవాణి పాత్రకు ప్రాముఖ్యమిచ్చారన్నది మాత్రం నిర్వివాదాంశం. కన్యాశుల్క నాటకంలోని అత్యంత ప్రముఖ స్త్రీ పాత్ర కావడం వల్ల మధురవాణిని కొందరు ఈ నాటకానికి నాయికగా భావించారు.

ఏదేమనా మధురవాణి పాత్రకు కన్యాశుల్కంలోని మిగిలిన పాత్రలవలెనే అది సంకీర్ణ పాత్ర కావడంలో ప్రత్యేకత ఉంది. కన్యాశుల్కంలోని మిగిలిన పాత్రల వలెనే ఈ పాత్రకూడా మంచిపాత్ర అనిగానీ చెడ్డ పాత్ర అనిగానీ యిదమిద్ధంగా తేల్చిచెప్పడం కష్టం. గురజాడవారు తన ఆదర్శాలకనుగుణంగా తీర్చిదిద్దిన అనుకూల పక్షంలోని పాత్ర (ప్రోటోగోనిస్ట్) మధురవాణి అని చెప్పడం కూడా సమంజసం కాదు.

మధురవాణి అపార్థాన్ని తొలగించే ప్రయత్నంలో ప్రవేశపెట్టబడిన పాత్ర. వేశ్యలను వాస్తవంలో దగ్గరగా చూడని మార్యదానిబద్ధ కుటుంబాల వాళ్ళకు వేశ్యలపట్ల గతానుగతికంగా వున్న స్టీరియో టైప్ అభిప్రాయాలను తొలగించి వేశ్యలలోని మానవతా కోణాన్ని, మంచితనపు కోణాన్ని నైతిక విలువల కోణాన్ని అటువంటి వారికి తెలియచేసే ప్రయత్నంతోనే ఈ పాత్రలలోని అటువంటి లక్షణాలకు ప్రాముఖ్యాన్ని యిచ్చారే తప్ప ఒక ఆదర్శస్త్రీగా

స్త్రీలందరికి అనుసరణీయురాలుగా చూపించే ఉద్దేశ్యంతో కాదు. ఆనాటి ధనికుల పోషణలో జీవించిన వేశ్యల కుటుంబాలన్నింటివలెనే మధురవాణి కుటుంబంలో కూడా వారసత్వంగా వచ్చిన ధనసంపద ప్రత్యేక శ్రద్ధతో పెంచి పోషించబడిన అందచందాలు, ఎవ్వరినైనా యిట్టే ఆకట్టుకోగల వయ్యారాలు, నయగారాలు, శ్రద్ధతో నేర్చుకున్న సంగీత, నృత్య సాహిత్యానికి విద్యలు అన్నీ మధురవాణికి కూడా వంటబట్టాయి. వేశ్యగా అమోఘమైన వృత్తి నైపుణ్యమున్న మనిషి ఆమె. ఒకరికి తెలియకుండా ఒకరితో గిరీశం- రామప్పంతులును అటుపంపించి, వెనక తలుపు నుంచి పేకాడేందుకు స్నేహితులను రప్పించేకోగలిగే నెఱజాన తనమూ వుంది. లుబ్ధావధానులలోని పండుముసలి వాడిని కూడా కవ్వించి, బులిపించి, మురిపించి బోసినవ్వులు తెప్పించగలిగే వేశ్యానైపుణ్యం ఆమెలో వుంది. కరటకశాస్త్రి లాంటి వాళ్ళు చాటుమాటు జాతకాల్ని కనుక్కోగల చురుకుతనం, సౌజన్యరావు పంతులు లాంటి 'నిగ్రహపూర్ణాలనే' పేరున్న వాళ్ళను కూడా ఒక్కసారి కదిలించి చూడాలన్న కుతూహలమున్న అచ్చమైన పాత్ర మధురవాణిది.

ఆమెలో వున్న ఈ వృత్తి లక్షణాలను మంచిదనిగాని, చెడుదనిగానీ తేల్చకుండా ప్రేక్షకుల, పాఠకుల దృష్టికోణానికే ఆ తీర్పును వదిలి పెడతారు గురజాడవారు. కానీ తన వృత్తి పరిధిలోనే ఎన్నో ఉత్తమ నైతిక విలువలను సాధించే గౌరవనీయ వ్యక్తి కాకుండా మధురవాణిని ఎప్పటికప్పుడూ గురజాడవారు చెప్పిస్తారు. ఆ నైతిక విలువల పరిధికి కట్టుబడబట్టే చివరిదశలో నైపుణ్యంతో పందెం గెలిచి సాధించుకున్న సౌజన్యరావు గారి ముద్దును కూడా "చెడని వారిని చెడగొట్టవద్దని మాతల్లి చెప్పింది ". అంటూ తిరస్కరించ గలుగుతుంది. నిజానికి ఈ నైతిక విలువల గీటురాయిమీద చూస్తే మధురవాణి ముందు బయట మర్యాదస్తులుగా చలామణీ అవుతున్న రామప్పంతులు, గిరీశం పంతులు లాంటి పెద్దమనుషులెందరో వెలవెల బోతారని ఎప్పటికప్పుడూ చూపించే ప్రయత్నం చేశారు గురజాడవారు. గిరీశం లాగా నమ్మించి మోసం చేయటం కానీ, రామప్పంతులు లాగా మాయచేసి దోచుకోవటంగానీ మధురవాణిలో వున్న లక్షణాలు కావు. రామప్పంతులు గారు తనపోషణలో మధురవాణి వుంది అని లోకానికి చూపించాలన్న తరుణంలో అతనినుంచి తనకు అర్థలాభం ఏమాత్రం లేకపోయినా అతనిపట్ల మర్యాద నిలబెట్టే ప్రయత్నం ఎప్పటికప్పుడు చేస్తూనే వుంటుంది మధురవాణి. ఆమె వృత్తిరీత్యా ఆమెకు ఏర్పడ్డ గొప్పసౌకర్యం ఎంతటివారినైనా నిలదీసి నిజం మాట్లాడేయడం మధురవాణి గురజాడవారి గొంతుక అని విమర్శకులు భావించడానికి నాటకంలోని సామాజిక విమర్శలు, గురజాడవారు తరచు ఈమె మాటలద్వారానే వ్యక్తం చేయడమే కారణం.

నాటక వస్తువు దృష్ట్యా ముఖ్యంగా కన్యాశుల్క ఆచారంలోని అమానుషత్వం పట్ల అగ్నిహోత్రావధాన్లు , రామప్పంతులు, లుబ్ధావధాన్లు లాంటి బ్రహ్మణ పురుషులకు లేని ఇంగితజ్ఞానం, మానవత్వంతో కూడిన అవగాహన మధురవాణిలో ఉన్నట్లుగా ఆమె సుబ్బి పెళ్ళి తప్పించే ప్రయత్నంలో " చక్రం తిప్పేందుకు " సిద్ధపడ్డట్లు చూపించడం ద్వారా నిరూపించారు గురజాడవారు. తమ, తమ లౌక్యం విషయంలో గిరీశానికి, రామప్పంతులుకు ఎంత ఆత్మవిశ్వాసముందో మధురవాణికూడా తన లౌక్యం విషయంలో అంతకంటే ఎక్కువ నమ్మకముంది రామప్పంతుళ్ళను, గిరీశాలను సులభంగా బోల్తా కొట్టించేయగలను అన్న ధీమా " చక్రం అడ్డువేయనూ" అనడంలో వ్యక్తమౌతుంది. ఎప్పటికప్పుడు రామప్పంతుల్ని తెలివితక్కువ వాడుగా చూపించేసి పొట్టపగిలేలా నవ్వుకుంటుంది మధురవాణి.

గిరీశంమీద, రామప్పంతుల మీద ఆమెకు లోలోపల కసి, తగిన శాస్తి చేయాలనే సంకల్పమూ వున్నాయని ఎప్పటికప్పుడు తెలుస్తూనే వుంటుంది. గిరీశంను వెతుక్కుంటూ పూటకూళ్లమ్మ రాగానే గిరీశం ఆచూకి తెలిసి తమాషా చూడాలనుకోవడం యిటువంటి ఉద్దేశ్యంతోనే. వీళ్ళ మోసాలను బయటపెట్టాలన్న పట్టుదల వల్లనే చివరి దశలో గిరీశంలోని కపటాన్ని సౌజన్యరావు దగ్గర బయటపెట్టి అతని నిష్క్రమణానికి దోహదం చేస్తుంది. బయటికి గలగలా నవ్వుతూ కనపడే మదురవాణి గుండెలోతుల్లో తన దయనీయస్థితి పట్ల తనమీద తనకి జాలిబయటపడే మార్గం లేదన్న నిరాశ గూడకట్టుకున్నాయన్న వాస్తవం నాటకం చివరి దృశ్యంలో ఆమె సౌజన్యరావుతో అన్న మాటను బట్టి తెలుస్తుంది.

" వితంతువులను పెళ్ళాడడం యాంటీనాచ్చికి కూడా మంచికి ఆదర్శమే నాంది".

జపాన్ దేశంలో గైషాలనే వేశ్యలున్నారని వారిని గొప్పగొప్ప వారు కూడా పెళ్ళాడతారనీ ఈ గిరీశంగారే కాబోలు

ఆధునిక తెలుగు సాహిత్య పాఠకుల హృదయాల్లో చెరగని ముద్రవేసుకొని సుపరిచితమైన వ్యక్తిలా మనఃప్రపంచాల్లో మిగిలిపోయిన పాత్రలో కన్యాశుల్కం నాటకంలోని గిరీశం పాత్ర ఒకటి. గిరీశం అనేమాట సమకాలీన ప్రపంచంలో కూడా ఒకరకం మనుషులనుద్దేశించి ఒక లాక్షణిక ప్రయోగంగా తెలుగువాళ్ళు ఉపయోగిస్తూ ఉంటారు. అంటే ఈ పాత్ర తెలుగువారి హృదయాల్లోకి ఎంతగా చొచ్చుకు పోయిందో ఊహించవచ్చు.

చెప్పగా విన్నాను. అయితే పెళ్ళి చేసుకోగోరిన వేశ్యలకు కోరతగిన వరులు దొరకడం ఎలాగండీ?

వేశ్యజాతి చెప్పదని తాము సెలవు ఇచ్చినట్లు చెడ్డలో మంచి వుండకూడదా? మంచి ఎక్కడున్నా గ్రాహ్యం కాదాండి?

"మృచ్ఛకటిక చదివిందేమోనండి" లాంటి మాటల ద్వారా మృచ్ఛకటికంలో వసంతసేన చారుదత్తుడు పెళ్ళాడినట్లుగా సౌజన్యరావు గారు లాంటి వారు పెళ్ళాడితే బాగుండునన్న కోరిక వుందని అర్థమౌతుంది. ఆమె ఈ మాటలు అటున్నప్పుడు ఎంత కఠినాత్ముడికైనా జాలి కలుగక మానదు. ముఖ్యంగా ఆమె తన నైతిక విలువలకు కట్టుబడి సౌజన్యరావు గారు సానుకూలపడే అవకాశం వచ్చినా దాన్ని సులభంగా కాలదన్ని వెళ్ళగలగడం చూస్తే ఒక్కసారిగా జాలి, గౌరవం కల్గుతాయి.

మధురవాణి నిష్క్రమణను గురజాడవారు భగవద్గీత కృష్ణుడు విగ్రహం చేతబట్టుకొని "కృతార్థురాలను" అంటూ వెళ్ళిపోతున్నట్లుగా చూపించడం గురజాడవారి అభ్యుదయ భావాలకనుగుణంగా లేదని కొందరి అభిప్రాయం. ఆనాటి చింతామణి మొదలయిన నాటకాల్లో కూడా వేశ్యల జీవితాలకు ఇటువంటి ముగింపునే ఆదర్శముగింపుగా చూపించడం ఈ సందర్భంగా గమనించాలి. గురజాడవారు ముగింపు రచిస్తున్నప్పుడు ఆనాటి సంఘసంస్కరణోద్యమ నాయకులు మొదలయిన వారి మన్నన కోసం చూశారామో తెలియదు. కానీ యాంటీనాచ్చి ఉద్యమం ప్రబలంగా ఉన్న ఆ రోజుల్లో ఒక వేశ్య పాత్రకు తన నాటకంలో ప్రాముఖ్యాన్నిచ్చి వేశ్యలను తక్కువగా చూస్తున్న ఆనాటి సంస్కరణోద్యమ నాయకులకు తమపక్షం వాదాన్ని వినిపించుకొనే హక్కును, అవకాశాన్ని మధురవాణి పాత్రద్వారా యిచ్చి గురజాడవారు గొప్ప సాహసం చేశారని మాత్రం చెప్పక తప్పదు.

కన్యాశుల్కాన్ని కడుపుబ్బ నవ్వించే నాటకంగానే సాధారణంగా గుర్తించడం జరుగుతుంటుందని తాను ఈ నాటకాన్ని ఆద్యంతం హాస్యం తొణికిసలాడేలా రచించాలనుకున్నానని నాటకం ప్రిఫేస్ లో రచయితే స్వయంగా చెప్పుకున్నందువల్ల కన్యాశుల్కాన్ని హాస్యరస నాటకంగా చూడడం రచయిత అభిప్రాయానికి విరుద్ధం కాదు కానీ, కన్యాశుల్కాన్ని కేవలం హాస్య దృష్టితో మాత్రమే చూడడం వల్ల కొందరు కన్యాశుల్కాన్ని 'ప్రహసనంగా' భావించారు. ప్రహసనాన్ని ఆంగ్లంలో ఫేస్ అంటారు. ప్రహసనం అనేది గాంభీర్యం లేని కేవలం సరదాకోసం నవ్వులాట కోసం రచింపబడిన హాస్య నాటకం తెలుగులో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి 'కంఠాభరణం' ప్రహసనాల్లో ప్రసిద్ధమైనది. కానీ కన్యాశుల్కం గాంభీర్యం లేని హాస్య రచన అని భావించరాదనే ఉద్దేశ్యంతో ఈ నాటకంలోనే గంభీరమైన ఉద్దేశ్యాన్ని వెలికి తీసుకువచ్చే ఉద్దేశ్యంతో శ్రీ శ్రీ ఈ నాటకంలో ఉన్న హ్యాస్యేతరాంశ్శాలను నొక్కి చెబుతూ "ఇది ఒక భీభత్సరస ప్రధాన విషాదాంత నాటకం అంటారు.

నిజంగానే ఈ నాటకంలో చర్చించబడుతున్న ప్రధాన వస్తువైన కన్యాశుల్కం నవ్వు తెప్పించే విషయంకాదు. పాలబుగ్గల పసిపాలను కాటికి కాలుచాచిన పండు ముసళ్ళకు కట్ట బెట్టి వారి జీవితాలను బుగ్గిపాలు చేసే బాల్య వివాహాలతో ముడిపడిన అప్పారావుగారి భాషలో చెబితే "సెల్లింగ్ గర్ల్స్"పాపాయిలను అమ్మికోవడము అనే ఘోరమైన దురాచారం ఈ నాటకపు వస్తువు అయినప్పుడు ఆ వస్తువు దానంతట అది నవ్వు తెప్పించేది కాదని స్పష్టంగా గుర్తించవచ్చు. అప్పారావు గారే స్వయంగా ఇదే వస్తువుతో "పూర్ణమ్మ కథ" అనే కరుణరసగేయాన్ని రచించడం ఇక్కడ గమనించాలి. పూర్ణమ్మ కథలోని పూర్ణమ్మ సుబ్బిపేరుతో కనబడితే మరోచోట కనబడవచ్చు. ఎక్కడ ఏ రూపంలో కనబడినా కన్యాశుల్కపు పెళ్లికథ కరుణ రసాత్మక గాథే అవుతుంది. ఈ వస్తువులోని దు:ఖాన్ని కడుపులో దిగమింగుకొని బయటికి ముఖానికి నవ్వు పులుముకొని తిరగడం కన్యాశుల్క నాటకంలో కనబడే పరిస్థితి.

ఇక్కడ అప్పారావు గారికి హాస్యం, సంస్కరణం, ఆయుధం, సామాజిక విమర్శకు మాధ్యమం తాను సమాజానికివ్వదలుచుకున్న ఔషధానికి తీయని పూత ఆ

రోజుల్లో ప్రత్యక్ష సామాజిక విమర్శలో ఎదుటివారి మనస్సులు నొప్పించటం కంటే సన్నితమైన హాస్యం ద్వారా, అధిక్షేపం ద్వారా సామాజిక విమర్శ చేసి సున్నితంగా మనస్సులు మార్చేందుకు ప్రయత్నించడమే మంచిదని రచయిత వ్యాఖ్యానించారు. 'సాక్షి', 'ఉపన్యాస తోరణము', వరదబోతు' మొదలైన అధిక్షేపాత్మక రచనలో మధ్యలో వుంచి చూడవలసిన అవసరం ఉంది.

కన్యాశుల్క వివాహానికి సంబంధించిన దు:ఖం అగ్నిహోత్రావధాన్లు భార్య ఆత్మహత్యాయత్నం చేసిన సంఘటనలో ప్రత్యక్షంగా కనబడుతూ వుండగా నాటకంలోని మిగతా ఘటనలన్నిటిల్లోనూ అంతర్ గర్భితంగా, అనుస్రుతంగా ధ్వనిస్తూ వుంటుంది. సుబ్బిపెళ్ళి తప్పించడానికి ప్రయత్నిస్తున్న ప్రతిపాత్ర వెంకటమ్మ గారి దు:ఖంతో పాలుంచుకుటున్న వాళ్ళే అవడం వల్ల లోలోపల దు:ఖిస్తూ బయటకు నవ్వుతూ నవ్విస్తూ ఆ పాత్రలు తిరగడం గమనించవచ్చు.

ఈ నాటకంలో స్త్రీ పాత్రల్లో ఒక్క వెంకమ్మగారు తప్ప మిగతా వాళ్ళందరూ విధవరాళ్ళుగానీ, వేశ్యగానీ కావడం గమనించవచ్చు. వైధవ్యం పొందిన స్త్రీ పాత్రలతో అప్పారావు గారు ఒక వైపు హాస్యాన్ని సృష్టిస్తున్నట్లుగా కనబడినా, ఆ పాత్రల జీవితాల్లో గూడు కట్టుకుపోయిన దు:ఖ సముద్రాలను ఎప్పటికప్పుడు ఆయన ఆ హాస్యం వెనకే ధ్వనింపచేయడం మరిచిపోలేదు. బుచ్చమ్మ అమాయకత్వం చూస్తే, పూటకూళ్ళమ్మ గయ్యాలితనం చూస్తే మీనాక్షి పిచ్చిమాలోకాన్ని చూస్తే ఎంత నవ్వు వస్తుందో అంత జాలివేస్తుంది. వారి ప్రమేయం ఏమీ లేకుండా అటువంటి దౌర్భాగ్యస్థితికి వీరిని బలిచేయబడడం వల్ల నిజానికి ఆక్రోశం కూడా కల్గుతుంది. నిజానికి ఈ మూడు పాత్రలు సుబ్బికి భావి చిత్రాలు.

సుబ్బివాళ్ళ నాన్న నిర్ణయించిన పెళ్ళే జరిగిపోతే కాటికి కాళ్ళు చాచిన లుబ్ధావధాన్లు టపాకట్టేస్తే మరుక్షణం సుబ్బి మగవాళ్ళకు దూరంగా వుండే బుచ్చమ్మ, రామప్పంతులును నమ్ముకున్న మీనాక్షి మీద తాను బతకాల్సి వచ్చి నోరెట్టుకు బతికే పూటకూళ్ళమ్మ అయిపోయే ప్రమాదం వుందన్న వాస్తవాన్ని తలచుకొని నాటకంలో అనుకూల పాత్రలు, నాటకపు ప్రేక్షకులు కూడా ప్రతిక్షణం భయపడి పోతూ వుండే పరిస్థితి అప్పారావు గారు కల్పించారు.

ఒక కన్యాశుల్క సంబంధమున్న పాత్రలేకాక నాటకంలోని బైరాగి, బంట్రోతు, ఇన్‌స్పెక్టర్ లాంటి ఏ పాత్రలు చూసిన అధిక్షేపం ద్వారా సామాజిక విమర్శ జరుగుతూ వుండడం నవ్వు వెనుక సమాజపు దుస్థితిపట్ల ఆవేదన శకలం కూడా ఎప్పటికప్పుడు జరుగుతూ వుంటాయి. చివరికి ప్రతికూల పాత్రలైన అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాన్లు, రామప్పంతులు లాంటి పాత్రల చిత్రణలో కూడా వారి మీద కోపమొస్తుందో వారి ప్రవర్ధన చూస్తే ఎంత నవ్వు వస్తుందో ఒక కోణంలోని వారి అమాయకత్వం చూస్తే అంతజాలి కూడా వేసేలా జాగ్రత్త పడ్డారు అప్పారావు.

చిత్రణలో కూడా యిటువంటి జాలిగొలిపే సన్నివేశాలను కల్పించారు అప్పారావు గారు. వెంకటేశం ప్రవర్తన చూస్తే ఎంత నవ్వు వస్తుందో గిరీశం చేతిలో దారుణంగా మోసపోతున్న ఆ కుర్రవాడి జీవితం తలుచుకుంటే అంతజాలి వేస్తుంది. బ్రిటీష్ పరిపాలన వల్ల ఏర్పడిన కాల పరిస్థితుల కారణంగా పనికి రాకుండా పోయిన సంస్కృతపు చదువులను తలచుకొని గిరీశం పంతులులాగా చదువుకున్నా బాగుండేదని పశ్చాత్తాప పడుతున్న కరకటశాస్త్రి శిష్యుణ్ణి చూస్తే అదేవిధంగా జాలి కలుగుతుంది.

ఒక్క మాటలో చెప్పాటంటే దాడిచేసిన బ్రిటీష్ సాంస్కృతిక వ్యవస్థ ఉక్కుపాదాల కింద నలిగిపోతున్న ఆనాటి సాంప్రదాయిక భారతీయ సమాజాన్ని ఇసుక పర్రలుగా మృతశరీరాలుగా మాత్రమే మిగిలిన ఆచారాల శవాలను పటుకుని వేలాడుతున్న హృదయంలేని చాదస్తులను చూస్తే కడుపులో కలచివేస్తుంది. ఇలా వుంటే జుగుప్సను దృష్టిలో వుంచుకొని "శ్రీశ్రీ భీభత్సరస ప్రధానం" అన్నారు. కొందరు సాంప్రదాయికులు వ్యసన పరుడైన పాత్ర నాయకుడుగా కల నాటకం "కన్యాశుల్కం ఒక బాణము" అని నిర్ణయించడాన్ని చూసి గిరీశంను కేవలం వ్యసనపరుడుగా చూడటాన్ని వ్యతిరేకించారు. సాంస్కృతిక సంధిదశలో ఎటుపోవాలో తేల్చుకోలేక పరాన్న భుక్తులుగా మారిపోయి తన అయోమయం పట్ల కలిగిన దు:ఖాన్ని కడుపులో దిగమింగుకుని బయటికి నవ్వుతూ నవ్వేస్తూ బతికేస్తున్న పాత్రగా గిరీశాన్ని శ్రీశ్రీ చూశారు. అందుకే ఆ పాత్ర "డామిట్ కథ అడ్డం తిరిగింది" అంటూ నిష్క్రమించరావలసి రావడం శ్రీశ్రీ కి విషాదాంత నాటక లక్షణంగా కన్పించింది. అందుకే ఆయన ఈ నాటకాన్ని 'భీభత్సరసప్రధాన విషాదాంత నాటకం' అన్నారు. ◈

# గురజాడ దేశభక్తి గేయం - సమకాలీనత

- ఎం.వి.ఎస్. శర్మ


'దేశభక్తి' గీతానికి గురజాడ చేసిన దిద్దుబాట్లు. చివరి నాలుగు పంక్తులు తొలగించారు.

ఇది గురజాడ అప్పారావు శత వర్ధంతి సంవత్సరం. నవంబరు 30,2015కి పూర్తవుతుంది. 21.9.1862లో ఎస్ రాయవరం, విశాఖపట్నం జిల్లాలో గురజాడ జన్మించారు. 1915లో మరణించారు. గేయాలు, కథలు, నాటకం - ఇలా అన్ని సాహితీ ప్రక్రియలూ గురజాడ చేపట్టారు. వాడుక భాష ఉద్యమంలో ప్రముఖపాత్ర పోషించారు.

కాంగ్రెస్ పార్టీ సంపూర్ణ స్వాతంత్ర్యం తన లక్ష్యంగా తీర్మానం చేసింది 1929లో. అంతకు ముందు 19 సంవత్సరాలకు మునుపే స్వతంత్ర్యం అంటే ఏమిటో, అది సాధించిన తరువాత భారతదేశం ఎలా ఉండాలో వివరంగా మనముందు గురజాడ "దేశభక్తి" గేయంలో ఆవిష్కరించారు.

ప్రస్తుత కాలంలో మనం ప్రపంచీకరణ దాడిని ఎదుర్కొంటున్నాం. మొన్నటికిమొన్న రాష్ట్ర రాజదాని శంకుస్థాపన హడావుడిలో అన్ని ప్రాంతాల మట్టినీ మోసుకురావడమే గొప్ప విషయమైపోయింది ముఖ్యమంత్రికి. ప్రధాన మంత్రి కూడ మనకు ఇంత మట్టే తెచ్చి ఇచ్చాడు. ప్రజల నుంచి లక్షల ఎకరాల భూమిని ఊడలాక్కొని పారిశ్రామిక వేత్తలకు అందించాలని చూస్తున్నారు. ఈ భూమి అంతా ప్రజలదని మరిచిపోయారు. దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్.. అన్న గురజాడ గేయం ఈ పాలకుల సిద్ధాంతాన్ని ప్రజల్లో ఎండగట్టడానికి ఒక మంచి సాధనం.

ముందు ప్రాధాన్యత పాడి పంటలకి ఇవ్వాలన్నాడు. ఆహారంలో స్వావలంబన అవసరం చెప్పాడు. దానికి భిన్నంగా ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి. తిండి గింజల ధరలు, పప్పుదినుసుల ధరలు, కూరగాయల ధరలు దారుణంగా పెరిగిపోతున్నా ప్రజలు నలిగిపోతున్నా పట్టించుకోవడం లేదు. పాడి పంటలు పొంగిపొరిలే దారిలో నువు పాటుపడవోయ్ అని గురజాడ చెబితే పాలకులు రియల్ ఎస్టేట్, నిత్యవసర సరుకుల ధరలు పొంగిపొరిలే దారిలో నడుస్తున్నారు. అభివృద్ధి అంటే స్థూల జాతీయాదాయం పెరగడమే కొలబద్ధ. షేర్ మార్కెట్ సూచీ పెరగడం, బంగారం రేటు పెరగడం ఇవీ కొలబద్దలై పోయాయి. తలసరి ఆహార లభ్యత తగ్గిపోయింది. రక్తహీనత, ప్రసూతి మరణాలు, శిశు మరణాలు అంటు వ్యాధులు పెరిగిపోతున్నాయి. అయినా పాలకులు మన దేశం అగ్రరాజ్యం అయిపోతుందని డబ్బా కొట్టుకుంటున్నారు.

ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయి అని గురజాడ అడుగుతున్నాడు.

మోడీ మేక్ ఇండియా అంటున్నాడు. ప్రధాని, ముఖ్యమంత్రి ఇద్దరూ అమెరికా, జపాన్, సింగపూర్ ఇలా విదేశాల భజన చేస్తున్నారు. వాళ్లు వస్తే తప్ప అభివృద్ధి జరగదని ఢంకా బజాయించి చెప్తున్నారు. విదేశీ పెట్టుబడులను ఆకర్షించడమే పాలకుల అభివృద్ధి పాలసీ. గురజాడ దీనికి పూర్తి రివర్స్‌లో మనమే అన్ని దేశాలనూ మన సరుకులతో నింపేయాలన్నాడు. "అన్ని దేశాల్ క్రమ్మవలెనోయి దేశి సరుకుల నమ్మవలెనోయ్" అన్నాడు.

అంతే తప్ప వాల్ మార్ట్ లాంటి వాళ్ల సరుకులకు మన దేశాన్ని మార్కెట్‌గా దిగజార్చమని చెప్పలేదు.

విశ్వహిందూ పరిషత్, అరెస్సెస్ లాంటి మతోన్మాద శక్తులు, కులతత్వవాదులు, మన గత మంతా గొప్పదని గొప్పలు పోతూ తిరిగి మనువాదపు ఛాందసానికి మనని నెట్టాలని వాదిస్తున్నారు. ప్రజల్ని పీడించిన రాజుల ఫ్యూడల్ పాలనని వాళ్లు ఆకాశానికెత్తుతున్నారు. ప్రధాని గారేమో మహాభారత కాలంలోనే స్టెమ్‌సెల్ టెక్నాలజీ వుందని, వినాయకుడికి ఏనుగు తలకాయ ఉండడం బట్టి ప్లాస్టిక్ సర్జరీ గురించి మనకు ఎప్పుడో తెలుసని, ఇంధనం లేని విమానాన్ని మనం ఏనాడో కనిపెట్టామని ప్రకటనలు చేస్తూ ఇంకోపక్క శాస్త్ర పరిశోధనలని నిర్లక్ష్యం చేస్తున్నాడు. వెనుక చూసిన కార్యమేమోయి? మంచి గతమున కొంచెమేనోయి, మందగించక ముందు అడుగేయి అన్నాడు గురజాడ.

పొరుగుదేశాలతో ముఖ్యంగా పాకిస్తాన్‌తో అవకాశం దొరికితే తగువు పెంచే విధానం బిజెపి ప్రభుత్వానిది. అందరితోనూ కయ్యానికి కాలుదువ్వే ఇజ్రాయిల్ బిజెపికి మంచి మిత్రుడు. అందరి మీదా కర్రపెత్తనం చేసి అంతర్జాతీయంగా యుద్ధాలు రేగొట్టే అమెరికా ఆప్తమిత్రుడు. సైనిక విన్యాసాలు జరపడం బిజెపి ప్రభుత్వానికి చాలా గొప్పగా అనిపించే వ్యవహారం. వ్యర్థ కలహం పెంచబోకోయి, కత్తివైరం కాల్చవోయి అన్నాడు గురజాడ.

మేం అధికారంలోకి వస్తే అది చేస్తాం, ఇది చేస్తాం అని కబుర్లు చెప్పి, ఆ తరువాత తమ సేవల్ని పెద్దవాళ్లకే అంకితం చేస్తున్న ధోరణి పాలకవర్గాలది. అలా చేయడమే దేశాభివృద్ధి అని, రాష్ట్ర అభివృద్ధి అంటే తాము చెప్పిందేనని వాళ్ల వాదన. దాన్ని కాదని విమర్శించేవారు అభివృద్ధిని ఆటంకపరుస్తున్నారని ఎదురుదాడి చేయడం వాళ్ల వ్యూహం.

దేశాభిమానం నాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పుకోకోయి, పూని ఏదైనాను ఒక మేల్ కూర్చి జనులకు చూపవోయి అని గురజాడ అడుగుతున్నాడు. జనాలకి ఉపయోగపడే పని ఏదైనా చెయ్యండయ్యా అంటున్నాడు.

వినిమయతత్వం, స్వార్థం, "పక్కవాడెలా పోయినా ఫర్వాలేదు, నాకు మాత్రం కోరుకున్నది జరిగిపోవాలి" అనే ధోరణి కళ్లెదురుగా ప్రజల ఆస్థులు, ప్రభుత్వ స్థలాలు, గనులు కబ్జా అయిపోతున్నా పట్టించుకోని నిర్లిప్తత మన చుట్టూ ఆవరించి ఉన్నాయి. సొంత లాభం కొంత మానుకు పొరుగువాడికి తోడుపడవోయ్ అన్న గురజాడ ఉపదేశం ఆ ప్రజలందరికీ చేరాలి. మనం చేర్చాలి.

మత విద్వేషాలు, ఘర్షణలు, గౌరవహత్యలు ఇలా రానురాను మరింత ఆటవిక ధోరణుల వైపు మన దేశాన్ని మతోన్మాదులు దిగజార్చుతున్నారు. పాలకులు వంతపాడుతున్నారు. దీన్ని ఎదిరించి మనం చేస్తున్న పోరాటంలో "అన్న దమ్ముల వలెను జాతులు, మతములన్నియు మెలగవలెనోయ్" అన్న గురజాడ ప్రబోధాన్ని మనం ఒక ఆయుధంగా వాడుకోవాలి. మతం వేరైతేను ఏమోయి మనసులొకటై మనుషులుంటే అని గురజాడ వేసిన ప్రశ్న దేశమంతటా మారుమోగాలి; మతోన్మాదుల చెవులు బద్దలైపోవాలి.

ప్రపంచీకరణ శకం అంటే ఉపాధి రహిత అభివృద్ధి. ఇదే గొప్ప అభివృద్ధి అని పాలకులు చెప్పుకోవచ్చు గాక. కాని గురజాడ ఏమన్నాడు?" నరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండవలెనోయి" అన్నాడు. మనుషులందరికీ చేతినిండా పని కల్పించితే సంపద వృద్ధి జరుగుతుందని. అదే నిలకడైన అభివృద్ధి అని చెప్పాడు. ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాన్ని చక్కగా గురజాడ చెప్పాడు.

ఈనాడు భావస్వాతంత్ర్యం మీద జరుగుతున్న దాడులు మనల్నందరినీ కలవర పెడుతున్నాయి. మేధావులు, రచయితలు తమ నిరసనలు రకరకాలుగా తెలుపుతున్నారు. ఆకులందున అణగిమణగి కవిత కోకిల పలుకవలెనోయి పలుకులనువిని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయి అన్నాడు గురజాడ. రచయితను, కవిని కోకిలతో పోల్చాడాయన. కోకిల ఎవరో బెదిరిస్తేనో, భయపెడితేనో పాడదు; ఎవరికో భయపడి కూయడం మానెయ్యదు. దానికి సంపూర్ణ స్వేచ్ఛ ఉంది. ఉండాలి. అదే ఆయన భావం. ఆ కవి/ రచయిత చేసే రచనలకి ప్రజా ప్రయోజనం ఉండాలి అన్నది రెండో అంశం.

కనుక ప్రజలంతా కవులకి, రచయితలకి అండగా నిలవాలి; కవులు, రచయితలు ప్రజల కోసం కలం పట్టాలి. 115 సంవత్సరాల క్రితం రాసినా, నేటి పరిస్థితులలో గురజాడ దేశభక్తి గేయం ఎంతో ప్రయోజన కరంగా ఉందో చూడండి. ఈ గేయాన్ని మన ఉద్యమాలకు చైతన్య స్ఫూర్తినిచ్చే సాధనంగా ఉపయోగిద్దాం

**"నా అడుగు జాడ - గురజాడ - శ్రీశ్రీ"** ◈




# కళింగ రాజ్య కావ్య నాయిక

◈ డాక్టర్ శమంతకమణి

“మధురవాణి అనే ఒక వేశ్యాశిఖామణి యీ కళింగ రాజ్యంలో ఉండకపోతే భగవంతుడి సృష్టికి ఎంత లోపం వచ్చి ఉండును?” అని కరటక శాస్త్రులు ఓ చోట అంటాడు.

మధురవాణి ఓ సుభాషిణి. చతుర సంభాషిణి. చమత్కార వాహిని, నవ్వుల రాణి, వెన్నెల జల్లు, మెరుపు తీగ, శృంగార రసాధి దేవత, విషాదమూర్తి, రౌద్రం, కారుణ్యం, తాపం, సంతాపం, వర్తమానం, వైముఖ్యం, వేదనాజ్వాల, అమ్మతనం ఇలా పలుపార్శ్వాలు కలగలసిన వనిత. గురజాడ అప్పారావు గారు. తన కళా ప్రజ్ఞంతా కలగలిపి ఓ గంభీర వ్యక్తిత్వానికి రూపం ఇచ్చి, ఆంధ్ర సాహిత్యంలో అనన్య సాధ్యంగా, అతి సజీవంగా చిత్రించిన అద్భుత పాత్ర “మధురవాణి”.

“ అభిరుచి, గుణదోష నిశ్చయ జ్ఞానము” ఉన్న రచయిత ఒక కావ్యాన్ని రచిస్తున్నప్పుడు అతని సృజన, విమర్శనాత్మక శక్తులు రెండూ, కుడి ఎడమలుగా ఆ కావ్య సృష్టిని చేస్తాయి. భావ భావోద్వేగ పాత్ర సన్ని వేశాలను మేధ సృష్టిస్తూ ఉంటే వాటికి విమర్శనాత్మక శక్తి గీటు పెట్టి, కొన్నింటిని తిరస్కరిస్తుంది. కొన్నింటిని స్వీకరిస్తుంది.

“ప్రతిభా క్షేత్రం ఒక టంకశాల లాంటిది. రచయిత సృష్టించేవి. అందులో తయారయే నాణెముల లాంటివి. టంకశాల తయరు చేసిన నాణెములు చెల్లునో, చెల్లవో మోగించి చూసినట్లుగా, విమర్శనా శక్తి ఉపాధేయములగునో, కావో పరీక్షిస్తుంది”.

ఇవి గురజాడ గారి మాటలు. అందుకే ఆయన కన్యాశుల్కాన్ని తిరగరాశారు. మొదటి రచన 19వ శతాబ్దంలో, రెండవ రచన 20వ శతాబ్దంలో చేశారు. రెండిటిలోనూ మధురవాణి ఉంది. మొదటి రచనలో ఆమె కేవలం ఓ వేశ్య మాత్రమే! జీవం లేని పాత్ర. రెండవ రచనలో నాటకం రచిస్తున్న కొద్ది మధురవాణి పాత్రపట్ల ఆయనకే దృక్పథం మారుతూ వచ్చింది. ఈ విషయాన్ని ఆయనే స్వయంగా ఒంగోలులోని నన్ను తన మిత్రుడికి లేఖలో రాశారు.... “మొదటి ముద్రణ కంటె ఇది సమగ్రతను వ్యక్తం చేస్తున్నది. పైకి కనబడేదానికన్నా బలమైన నైతిక భావాన్ని పొందింది. నా పుస్తకం జీవితాన్ని చులకనగా భావించలేదని తెలుస్తుంది. హాస్యంతో పొంగిపోయే పుస్తకంలో జీవితంలో గంభీరత్వాన్ని జూపడం చాలా కష్టమైన పని. ప్రయత్నించాను నేను” అని అంటారు గురజాడ. ఆ గంభీరతా శిఖరమే “మధురవాణి”పాత్ర. పాత్ర సృష్టికర్త కానీ ఆయన కావ్య నాయిక మాత్రం జనుల్లో నిలిచిపోయింది. “పెన్నేపల్లి గోపాలకృష్ణ” హృదిలో, చెరగని ముద్రగా నిలబడిపోయింది. “గోపీ” మధురవాణితో స్నేహం చేశాడు. ప్రేమించాడు. ఆరాధించాడు. అంతేగాక, మధురవాణి హృదయకుహరాన్ని దాటి ఆమె ఆత్మలో పరకాయ ప్రవేశం చేశాడు. అందుకే మధురవాణి అంతరాంతరాల్లో అణగి ఉన్న అనేకానేక భావాలను 14అధ్యాయాలుగా అక్షర రూపం ఇచ్చాడు. కన్యాశుల్కం నాటకంలోని 33దృశ్యాలలో, మధురవాణి కనిపించేది ఎనిమిది దృశ్యాలే! అయినా ఆమె లేని కన్యాశు ల్కాన్ని ఊహించడం, మధురవాణి ఊహాత్మక ఆత్మకథ రాయాలన్న ఆలోచన రావడం రెండూ కూడా సామాన్య మస్తిష్కానికి అందని ఊహలే!

ఆధునిక చరిత్ర పరిశోధన, తెలుగు, ఇంగ్లీషు

సాహిత్య విశ్లేషణ, సామాజిక రాజకీయ వ్యాఖ్యానాల మీద వ్యాసాలు వెలువరించిన రచయిత "మధురవాణి" అనే సృష్టి జరక్క పోయి ఉంటే సాహిత్యలోకానికెంత లోటు కలిగి ఉండును" అనే బలీయమైన నమ్మకంతో తెలుగు సాహిత్య రంగంలో ఎవ్వరూ చేయని ఓ ప్రయోగాన్ని చేశారు. అదే పెన్నేపల్లి గోపాలకృష్ణ గారు రాసిన "మధురవాణి - ఊహాత్మక ఆత్మకథ".

ఆత్మకథలు రాయడం చాలా మంది చేసే పనే! కానీ ఓ పాత్రలోకి పరకాయ ప్రవేశం చేసి స్వగతంగా, ఆత్మకథ రాయడం అంటే నిస్సందేహంగా ఆ రచయిత ఆ పాత్రని అమితంగా ప్రేమించాడనే అర్థం.

భావుకత, ఉత్తరాంధ్ర భాషపై పట్టుతో పాటు ఓ శతాబ్దం వెనక్కి వెళ్లి ఆనాటి భాషలో ఈ కాలంలో తిరిగి మధురవాణి పాత్ర రాయడం నిజంగా కత్తిమీద సామే! ముద్రణలో 149 పేజీల రచన చేయడానికి రచయిత గోపాలకృష్ణ చేసిన పరిశోధన సామాన్యమైనది కాదు.

కన్యాశుల్కంలో మధురవాణిని అగ్రహారిక బురదగుంటలో కలువలాగా తీర్చిదిద్దాడు "కవిశేఖరుడు". ఆ కలువసోయగాన్ని, సమాజ గమనంలో ఆమె ఎదుర్కొన్న అనేకనేక అనుభవాలను, ఆమె చుట్టూ జీవితాన్ని అల్లుకున్న అనేకానేక పాత్రలతో సహచరించాడు రచయిత. అందుకే మధురవాణి ఊహాత్మక కథనం పాఠకుడిని చదువుతున్నప్పుడు శతాబ్దం వెనక్కి తీసుకువెళుతుంది. ఆనాటి కాలానికి పరుగులు తీస్తుంది.

ఉత్తరాంధ్ర యాసతో వారికే ప్రత్యేకమైన పదాలతో సహవాసం చేయిస్తుంది. అర్థంకాని సమయంలో ఆఖర్లో ఉన్న పాదసూచికలు సహకరిస్తాయి.

మధురవాణి "చింతన"గా ఆమె భావాలు, స్వభావాలు తనవిగా మార్చుకుని, వాంచనీయ, అవాంచనీయ వ్యక్తుల, సంఘటనల మధ్యన సంఘర్షించిన ఆమె పరిస్థితిని "ఊరు - పేరు"తో మొదలు పెట్టి, "ఎంత యోగ్యురాలో" అంటూ ఆమె తల్లిని తెలియజేస్తూ, "యవ్వనం - జీవనం" లో నేర్చుకున్న విద్యలను చెబుతారు. "కించిత్ తిక్క" ఉన్న ఆమె "యాంటీనాచినే" నంటూ వేశ్యవృత్తిలోని వెలుగునీడలను, "అచ్చాడీ ఆషాఢభూతి"లతో "వేశ్యవలపు" ఎలా ఉంటుందో? "ఆడ ముండల్తోనూ ఆలోచన" అనే మగవారి స్వభావాలను ఎదుర్కొంటూ "మొగుడుతాత - పుత్తడి బొమ్మ" ల వ్యవహారాన్ని ఎండగడుతుంది. "అంత ఆనందమెక్కడిదనో" అనుకునే బాలవితంతువుల ఇక్కట్లను విశదపరుస్తూనే "చదువన్నదెందుకో" చక్కగా తెలుపుతుంది. "మనమెప్పుడు" మనవాడతా మనే మగువల మనోవాంఛలను చర్చిస్తూనే "కంట్రీలైఫ్" కష్టసుఖాలను విపులంగా వివరిస్తుంది.

వేశ్యకూతురు, వేశ్యగా తప్ప మరో మనుగడ సాగించలేని సమాజంలో "చెడనివారిని - చెడగొట్టని - చెలి" గా మిగిలిపోయింది.

సౌజన్యరావుకి, గిరీశానికి మధ్య జీవితానికీ దానికి మూలమైన స్త్రీత్వానికి ప్రత్యేకంగా, ఎవ్వరితో సంచరించినా, సహజీవనం చేసినా వారి ప్రభావం తనపై పడకుండా వ్యక్తిత్వాన్ని నిలుపుకున్న మహిళ మధురవాణి.

"కన్యాశుల్కం"లో నాయక పాత్రలకు అర్హమైన పాత్రలేవి లేవు. మధురవాణి ఆ స్థాయికి అర్హమైన స్థానాన్ని సాధించుకుంది. ఆ రకపు నాయికల్లో మధురవాణి ఎవ్వరికీ తీసిపోదని "విమర్శకులు" సర్దేశాయి. తిరుమలరావు అంటారు. "శ్రీశ్రీ" సైతం ఇదే భావనను వ్యక్తీకరిస్తారు.

వేశ్యలో మానవత్వాన్ని మహాకవి సృజిస్తే, వేశ్యావృత్తిలో ఉన్న మధురవాణి అంతరంగాన్ని అణువణువునా శోధించి రచయిత పెన్నేపల్లి గోపాలకృష్ణ తన కలాన్ని నడిపించారు. కళింగరాజ్య కావ్యనాయకి మధురవాణిలోకి కూతుర్ని, సహాధ్యాయిని, ప్రేమమూర్తిని, సాహసవనితను అన్నింటికీ మించి, "అమ్మతనాన్ని" తెలుగు సాహిత్యానికి మరో పార్శ్వంలో సృజించి అందించారు రచయిత.

నలుగురు సాహిత్యవేత్తలు కూర్చున్న సమయంలో ఖచ్చితంగా చర్చించే రచయిత, సాహిత్యపతాక "కవిశేఖర గురజాడ అప్పారావు. వారు నిండు మనస్సులు, మేధస్సుతో సృష్టించిన ఓ సంపూర్ణ పాత్రకు, ఆత్మతో దర్శించి, అక్షర రూపం ఇవ్వడంలో పెన్నేపల్లి వారు సంపూర్ణంగా కృతార్థులయ్యారు.

కృతార్థురాలను - శెలవు" అంటూ గురజాడ మరణాన్ని ఆ దు:ఖాన్ని అనుభవించే సమయంలో మధురవాణి ఓ అనుభవాల రాశిగా మనకు దర్శనమిస్తుంది. మాటలు రాని వేళ మూగగా గుండెలో మిగిలిపోతుంది. మధురవాణి ఊహాత్మక ఆత్మకథ - సాహిత్య పిపాసులందరూ ఆస్వాదించవలసిన రచన.: తెలుగునాట ఓ నూతన సమాప్తం సాహిత్యానుభవం ఈ ఆత్మకథ ◈



# లంగరెత్తుము

నవంబరు వచ్చింది గాని ఎందుకో ఎండలు తగ్గలేదు. ఆయనకు జ్వరం తీవ్రంగానే వచ్చింది. మృత్యువు ఆహ్వానిస్తున్న వేళ కలం తీశాడు. లంగరెత్తుము అన్న కవిత రాశాడు. జీవితాన్ని తేరిపార చూసుకున్నాడు. ఇంతలోనే విజయరామ గజపతి నుంచి కబురు- ఈ ఆఖరి దశలో మీ కోరిక ఏమిటో చెబితే తప్పక నెరవేరుస్తామని. ఏముంది? అంతా అయిపోతున్నది. కాకపోతే ఇంతకాలం తనకు జ్ఞానదీపాలుగా నిల్చిన వేలాది పుస్తకాలను ఏం చేయాలన్న చింత పట్టుకుంది. తనకు జీవితమిచ్చిన మహారాజా విద్యా సంస్థలలో వాటిని వుంచి విద్యార్థులు చదువుకునే అవకాశం కల్పించాలని మాత్రమే కోరాడా మహాకవి.

గురజాడ గేయాలతో పరిచయమున్న వారికి ఆయన రాసిన లంగరెత్తుము ఒక సింహావలోకనంలాగా కనిపిస్తుంది. నిజమే, స్వతహాగా దుర్బల దేహుడూ అనారోగ్య పీడితుడూ అయిన గురజాడ యాభై మూడేళ్లకే మంచం పట్టాడు. అన్ని అనారోగ్యాలు అవరోధాల మధ్యనే ఆశయాల కోసం అంతులేని పోరాటం చేసి అనేక ఫలితాలు సాధించాడు. అలసిపోయాడు. చేయవలసిన పనులు ఇంకా చాలా వున్నాయి. ఆరాటం వెన్నాడుతున్నది. 'మీరిప్పటికే వృద్ధులయిపోయినారు. చరిత్రరచన అలాగే వుంచి వేశారు. ఇతర వ్యాపకాలు తగ్గించుకుని మీరు తలపెట్టిన చరిత్రను పూర్తి చేయడం మంచిది' అని ఒక మిత్రుడు లేఖ రాశాడు. ఇదంతా ఆయన రాయాలనుకుంటున్న కళింగదేశ చరిత్ర గురించిన తపన.... మీమీద నాకింకా ఆశపోలేదు. చరిత్రను మీరే పూర్తిచేస్తారని నా ఆశ' ఈ వాక్యాలు చూస్తే దగ్గరున్న వారికి ఆయన ఆరోగ్యం క్షీణిస్తున్నట్టు తెలిసిపోయిందని వేరే చెప్పనవసరం లేదు. విద్యావేత్త ఫౌలర్ మరింత సూటిగా ఆ సంగతి రాశాడు:

మీరు ఆత్మజ్ఞాన సంపన్నులు. మానవులకు తెలియకుండా వచ్చిపడే మృత్యువును చూసి భయపడేవారు కాదని నాకు తెలుసు. చిరునవ్వుతో మృత్యువును పలకరించి చిత్త స్థయిర్యంతో వెళ్లిపోతారు. మరణమును సంతోషంగా స్వీకరించగల పరిపక్వత సాధించేందుకు మీరు జీవితం గడిపారు. ఆ విధమైన దృఢమైన ఆత్మశక్తి నాకు కూడా వుండాలని కోరుకుంటాను'

ఇతరుల సంగతి అటుంచి గురజాడ స్వయంగా చాలా జాగ్రత్తలు తీసుకుంటున్నారు. డాక్టర్లను కలుస్తున్నారు. మందుల అలవాట్ల వివరాలు సేకరించి అమలు జరిపేందుకు పెనుగులాడుతున్నారు. చివరి రోజుల ఆయన డైరీలు చూస్తే కాలకృత్యాల వివరాలతో సహా నమోదు చేసి వున్నాయి.

బహుశా 1915 ఏప్రిల్ నాటికి పరిస్థితి మరీ దిగజారినట్టుంది. రీవారాణి లలిత కుమారి చాలా ఆందోళనతో విశాఖపట్టణం పెద్దాసుపత్రి సర్జన్ వెల్లింగ్టన్ దొరకు ఉత్తరం రాసింది. అందుకయ్యే ఖర్చులు పూర్తిగా తాము భరించగలమనీ శ్రద్ధగా కంటికి రెప్పలా చూసి వైద్యం జరిపించాలని కోరింది. ఏప్రిల్7న గురజాడ విశాఖ పట్టణం వెళ్లాడు. కుమారుడు రామదాసు గాక ఒక సహాయకుడూ వున్నాడు. ఎవిఎస్ కాలేజీ ప్రిన్సిపాల్ పి.టి.శ్రీనివాసయ్యర్ ఇంట్లో వుండి చికిత్స చేయించుకుంటున్నాడు. చాలా సార్లు గిడుగు రామమూర్తిని పిలిపించుకుని మాట్లాడేవాడు. చివరకు

వైద్యులు ఆయనను వెళ్లవద్దని హెచ్చరించారు. మిమ్మల్ని చూస్తే ఆయన అనారోగ్యం సంగతి మర్చిపోయి సాహిత్య చారిత్రిక చర్చలతో విపరీతమైన అలసటకు గురవుతున్నారు. దీనివల్ల ఆరోగ్యం మరింత దిగజారుతుంది' అని చెప్పారు. మన భాషా పోరాటాన్ని నీవు కడకంటా కొనసాగించు అని ఒకసారి గురజాడ ఆయనకు చెప్పినట్టు రామదాసు రాశాడు. గిడుగు కూడా రామదాసును పక్కకు పిలిపించి తండ్రి ఆరోగ్యం గురించి చర్చించాడు. ఆయన పరిస్థితి బాగాలేదు గనక ముందు ముందు కర్తవ్యాలకు సిద్ధం కావాలన్నాడు. కర్మకాండల పట్ల నమ్మకం లేని ఆయన మరణానంతరం అనవసర తతంగాలు పెట్టుకోవద్దని సలహా ఇచ్చాడు. మొత్తంపైన ఆయన మరణిస్తారనే వాస్తవానికి అందరూ సిద్ధమవుతూ వచ్చారు. జులై నెలలో కొద్దిపాటి మెరుగుదల కనిపించేసరికి ఆశలు చిగురించాయి. గొప్ప వాస్తవికవాదిలా ఇంతకు ముందే మరణం గురించి కూడా రాసిన ఫౌలర్ పండితుడే ఇప్పుడు 'మీరు చివరకు జయించారు. మీరు అందుకోవలసిన ఆదర్శాలు అందుకుంటారు' అంటూ సందేశంతో పాటు ఫలాలు కూడా పంపించాడు. చరిత్ర రచనకు సామాగ్రి సమకూర్చుకోవాలని కోరాడు. సెప్టెంబరు నెలలో ఆయన పరీక్షాధికారి పదవిని మరో ఏడాది పొడగించినట్టు ఉత్తర్వు రావడంతో ఆ పనిలో మునిగిపోయాడు కాని తర్వాతి నెలలో కూడా అనుకున్నట్టు ఆరోగ్యం బాగవలేదు.

ఆ చివరి ఘట్టంలోనూ మహాకవిని ఆర్థిక బాధలు పట్టిపీడిస్తున్నాయి. కృష్ణ సాగరం దగ్గర వున్న భూములు సాగుచేసుకుంటున్న రైతులు తనకు కౌలు ఇవ్వకుండా ఇబ్బంది పెడుతున్నారనే పేరుతో సంస్థానం వారిని కొనుగోలు చేయవలసిందిగా ప్రతిపాదన పంపించాడు.

నవంబరు వచ్చింది గాని ఎందుకో ఎండలు తగ్గలేదు. ఆయనకు జ్వరం తీవ్రంగానే వచ్చింది. మృత్యువు ఆహ్వానిస్తున్న వేళ కలం తీశాడు.లంగరెత్తుము అన్న కవిత రాశాడు. జీవితాన్ని తేరిపార చూసుకున్నాడు. ఇంతలోనే విజయరామ గజపతి నుంచి కబురు– ఈ ఆఖరి దశలో మీ కోరిక ఏమిటో చెబితే తప్పక నెరవేరుస్తామని. ఏముంది? అంతా అయిపోతున్నది. కాకపోతే ఇంతకాలం తనకు జ్ఞానదీపాలుగా నిల్చిన వేలాది పుస్తకాలను ఏం చేయాలన్న చింత పట్టుకుంది. తనకు జీవితమిచ్చిన మహారాజా విద్యా సంస్థలలో వాటిని వుంచి విద్యార్థులు చదువుకునే అవకాశం కల్పించాలని మాత్రమే కోరాడా మహాకవి. ఇంకేం పెద్ద కోర్కెలు లేవు. అప్పటికే రామదాసు ద్వారా ఒక మనవడు కలిగాడు. ఇక లంగరెత్తేయ వచ్చు!

బహుశా డాక్టర్ మేంగో కూడా దానికి అనుగుణంగా పద్ధతి మార్చుకున్నాడు. గురజాడను పథ్యాలతో వేధించడం లేదు. కోరినవన్నీ చేసి పెట్టమని చెబుతున్నాడు. సాగితే రోగమంత సుఖం లేదని డైరీలో తాను రాసుకున్న మాటలు గుర్తుకు వచ్చాయి. నవంబరు 29న కుమారుడు రామదాసును పిలిపించి చివరి ఉత్తరం రాయించాడు. మరొక రోజు.. అంతా ఉక్కిరి బిక్కిరిగా వుంది. మహాకవి జీవిత కథ ముగింపుకొస్తున్నది.

## చివరి చిరునవ్వు

నవంబరు 30. నవంబరు నెలలో ఇరవై తొమ్మిది రాత్రుళ్ళు గడిచిపోయాయి. తెల్లవారింది.

మేడమీద గదిలో మంచంమీద మహాకవి మామూలుగానే దుస్తులన్నీ ధరించి పడుకున్నాడు. మంచం పక్క కొడుకూ, ఎదుట డాక్టరు మంగయ్యనాయుడుగారూ దిగులుగా నించున్నారు. మహాకవి తల్లీ, పిల్లలూ, బంధువులూ ఆందోళనతో అటూ, ఇటూ తిరుగుతున్నారు.

బయట కిటికీలోంచి ఎండపొడ గదిలో పడుతున్నది. చలిగాలి రొప్పుకొస్తున్నది. రొజ్జగాలీ, ఎండపొడా, మహాకవికి పడవుకదా!

దగ్గర నిలబడిన వారిని మెల్లగా దరికిపిలిచి మహాకవి, తాము ధరించిన దుస్తులన్నీ తీసివేయమన్నారు. వొక్క ప్లానలు లాల్చీని మాత్రం వుంచుకున్నారు.

తన మంచం ప్రక్కనే దిగులుగా నించున్న కొడుకును చేరువకు రమ్మని పిలిచి "కొంచెం కోకోనైనూ, దంపిన తాంబూలమూ తెచ్చిపెట్టు బాబూ!".

వీటిని తండ్రి తీసుకుంటే ఏమవునో అనే భీతితో కొడుకు, డాక్టరు నాయుడుగారిని చూపులతో ప్రశ్నించాడు. డాక్టరుగారు ఇవ్వవచ్చునని తల ఊపారు. కొడుకు తండ్రికి వాటిని అందిచ్చాడు.

తాంబూలము చప్పరిస్తూ మహాకవి, డాక్టరుగారి చేయి పట్టుకుని "వీటిని వేసుకో వచ్చునో, కూడదో, నేను బతికుంటే ఆహార శాస్త్రం మీద వొక గ్రంథం రాస్తాను, డాక్టరుగరూ!" అంటూ చిరునవ్వు నవ్వారు.

అదే మహాకవి చివరి చిరునవ్వు. అదే ఆయన తుది పలుకు. అప్పటికి గోడనున్న గడియారం ఎనిమిది దాటి ఇరవయ్యో నిమిషము వద్ద ఆగిపోయినది! ఆయన ఆఖరి శ్వాసవిడిచారు. తండోపతండాలుగా జనం తరలివచ్చి కన్నీటి నివాళిఅర్పించారు. పత్రికలు వార్తలిచ్చాయి.







గురజాడ వారి ఆత్మీయ మిత్రులు గిడుగు రామ్మూర్తి, పి.టి. శ్రీనివాసయ్యంగార్, జె.ఎ. ఏట్స్

1. Profession:- Lecturer for some years in the College, Private Secretary to successive Maharanis.

Age:- - - - 53 (4) years.

Weight:----- 78 lbs/now, at 33 years 81 to 84 lbs.

2. My body is very sensitive to the atmospheric temperature. I cannot stand draft even ordinary breeze except rarely. When walking or driving, I hold an umberalla against the direction of the wind. The adjustment of my shawl or shawls, caps, coats or flannels to suit atmospheric conditions and avoid discomfort is a constant travail with me. On the hills I put on shirt over shirt and coat over coat. For the last 4 or 5 years my body has failed to respond to the stimulus feeling of the bracing cold of the hills. Though my appetite is excellent there and I feel a little energetic, I generally feel miserable.

3. For some years I have to take rest after the midday meal; lying in the bed for 2 or 3 hours. Otherwise I feel heat in the body. About 3 or 4 in the evening I felt lassitude. If I took coffee and a little bread at 4 P.M I felt stronger and I could walk and work in the evening. I walked very rapidly. My movements were very quick. I gave up coffee and bread not being able to digest it, on account of the acidity which it induced and the sleepêessness which followed. Even now I feel the need for a strengthening food which does not form acid for tiffin. If bland food goes into the stomach, I feel immediately happy. I want some good tiffin.

4. Years ago I used to feel that my skin felt hotter than the skin of most people. Frequently I used to feel some discomfort; a burning sensation in the stomach which used to be relieved after the night meal.

5. For years I used to take a cup of claret or a small quantity of cocoa-wine before the night meal; and milk, rice and sugar formed a substantial part of the meal. Whenever I had acid eructations, I used to suffer from insomnia and pass large quantities of pale urin. Claret disagreed and I gave it up. Three years ago there was ulceration in the tongue for months and I was advised to give up milk. A mixture of nitrohydrochloric acid gave immediate relief and I did not suffer from that complaint afterwards.

6. Curiously enough I feel ravinous appetite on the hills. I took coffee in the morning and in the evening there, but the tongue was not ulcerated on that account.

7. I go to bed with all my clothing on, but the face felt hot generally and had to be fanned. Even on the hills with all the wrappings I used to feel the need sometimes for fanning the face. And the burning sensation in the face soon disappeared. The temperature was then probably above normal.

8. Twenty three years ago and for many years afterwards, my chief trouble was with my nerves and bowels. They were irritable. I passed semi-consistent stools and watery sometimes, 4 or 5 times a day. This started, I suppose, because I took for about one year(1890-91) as my night meal, large quantities of rollon boiled in milk into a thick mass. Crows used to eat up the faeces in the morning. Thereafter pieces of boiled curry used to pass out undigested with the faeces.

9. About that time (1891) one morning in winter at about 10 O'clock, I commenced climbing a hill in the heat of the sun without shelter. To reach the house on the summit soon I climbed up a steep short-cut and felt fainting for a few seconds. Since that evening, I began to feel <u>vertigo</u>.

10. Owing to much intellectual work, there has been complete nervous break-down. After sexual intercourse, I used to feel excitement of the brain and sleepêessness and sometimes nervous stwitching at the points where the arms join the chest. I had insomnia but foolishly persisted in taking coffee. I was a lecturer in the college and was addicted to hard study.

గురజాడ అప్పారావు గారు తనను గురించి తను రాసుకున్న స్వీయ నివేదిక

## కీర్తిశేషులయిన
## గురజాడ వెంకటప్పారావు పంతులు గారు

నవంబరు నెల 30 వ తేదీ యుదయమున విజయనగరమున 55 సంవత్సరాల ప్రాయమున అప్పారావు పంతులు గారు కాలచోదితులైరి. వీరు మహారాజావారి కళాశాలలోనే చదివి బిఎ పరీక్షనిచ్చిరి. చాలా కాలమా కళాశాలలో బోధకులుగా పనిచేసిరి. పిమ్మట కీర్తిశేషులగు ఆనంద గజపతి మహారాజా వారిచే ఆంతరంగిక కార్యదర్శిగా నియమింపబడిరి. మహారాజా వారి మరణానంతరము రీవా మహారాణి యొద్ద గూఢ కార్యదర్శిగా నుండిరి. చెన్నపురి విశ్వవిద్యాలయము వారిచే ఆంధ్ర భాషా పరీక్షకులుగా నియమింపబడిరి. మూడు సంవత్సరముల క్రితము విశ్వ విద్యాలయ సభ్యులుగా నియమింపబడిరి. వీరికి ఆంగ్లభాషా కవిత్వము నందభిమానము మెండు. వీరు కొన్ని గీతములు వ్రాసిరి. రయిసు అండు రియతు పత్రికకు వెనక సంపాదకుడిగ నుండిన డి.వి.శంభుచంద్రముఖర్జీ గారీ గీతముల నెంతయు కొనియాడిరి. వీరాంధ్రమున కన్యాశు ల్కమను నాటకమును వ్రాసిరి. కార్యదర్శిగా రాష్ట్ర పాలనమున గూడ తోడ్పడిరి. వీరి గౌరవార్థము మహారాజావారి కళాశాల 30వ తేదీన మూసి వేయబడినది.
*(ఆంధ్ర పత్రిక,డిసెంబరు 1, బుధవారము , 10 వ పేజీ)*

## కీర్తిశేషులైన గురజాడ అప్పారావు గారు
### ఆంధ్ర పత్రిక సంపాదకీయం 1915 డిసెంబరు 1

విజయనగర వాస్తవ్యులును ఆంధ్ర దేశమున సుప్రసిద్ధులునునై యుండిన గురుజాడ అప్పారావు పంతుల వారు ఏబదియైదు సంవత్సరముల వయస్సున నిన్నటి దినమున స్వగ్రామమున పరలోక ప్రాప్తి జెందిరని వ్రాయుటకు మిక్కిలి చింతిల్లుచున్నాము. ఆంధ్ర మండలములలో విద్యాశాఖకు జేకయున్నను వాఙ్మయాభిరుచి కలిగి విమర్శాసూత్రముతో తనివినందక కల్పనాశక్తి జూపి యశస్సునందిన వారిలో అప్పారావు గారు ప్రముఖ స్థానమలంకరించగలరనుటకు సందేహము లేదు. వీరు సామాన్య స్థితిగల కుటుంబమున జన్మించిన వారు. విజయనగర సంస్థానమున వీరి తండ్రి అమీనుగా నుండిరి. వీరి పూర్వీకులు గ్రామ కరణములుగా నుండిన వారు. వీరు చదువుకున్నప్పుడు సుఖముగా కాలము గడిపినారు. బిఎ పట్టపరీక్ష యందు తేరి అప్పారావు గారు మహారాజులుంగారి కళాశాల యందు కొంతకాలము నుపాధ్యాయులుగా నుండిరి. వీరు యౌవనమున నుండిన కాలమున నీ దేశమున ఆంగ్ల కోవిదత్వము ఎక్కువ గణ్యత నందుచుండినది. ఆ కారణము చేత వీరు విశేషముగా నా భాషయందే కృషి చేసి పత్రికలకు వ్రాయుచు కవిత్వము జెప్పుచు మెప్పు పడయు చుండిరి. పండిత చంద్రశేఖర శాస్త్రి గారి ప్రోత్సాహమున వీరికి సంస్కృతమునను నభిలాష మెండుగ నుండెను. నుపాధ్యాయత్వము నుండి విజయ నగర సంస్థానము వారికి వీరు ప్రాచ్య లిఖిత శాసన పరిశోధకులుగా ఏర్పడుట చేత వీరికి ఆంధ్ర భాషయెడలను దృష్టి మరలి వుండవచ్చును. ఆ సందర్భముననే వీరు కళింగ దేశ చరిత్రను వ్రాయు నుద్దేశమున తదనుకూల సామగ్రి సమకూర్చుకునిరనియు దానిని ఆధారము చేసుకునే విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి వారికి గ్రంథము వ్రాసి యిచ్చుటకు నంగీకరించినియు వాడుక యున్నది. ఈ పని జరగియుండనందున వారు సంతరించిన సామగ్రిని ఆ విషయమెరిగిన వారి యొక్క సమర్థులైన మిత్రులెవరైనెనను నుపయోగించుకుని గ్రంథమును వ్రాసిన యెడల మిక్కిలి యుపయోగకరము కావచ్చును. ప్రాచ్య లిఖిత పరిశోధకత్వము నుండి అప్పారావు గారు ఆనందగజపతి మహారాజులుంగారికి ఆంతరంగిక కార్యదర్శులై వారి మరణానంతరము వారి సోదరులగు రీవారాణి గారి వద్దనదే పని యందుండిరి. వీరు మహారాజులుంగారికి నాంతరంగిక కార్యదర్శిగ నున్నప్పుడే వీరి ప్రోద్బలమున విజయనగరమున మహారాజుగారి ఆంగ్ల కళాశాలయు సంస్కృత కళాశాలయు రెండును స్థిరపడినవని తెలియుచున్నది. అప్పారావు గారు యాంగ్ల రచనను వీడి యాంధ్ర ఆంధ్రము వైపు తిరుగునప్పటికి వయసు ఎంతో దూరము కడచిపోయి యుండినది. సాంఘిక దురాచార దూషణమునకై వ్యావహారిక భాషలో తాను రచించి ఆ రచన తాత్కాలికముగానూ స్థానికముగానూ మాత్రమే గాక కొంతవరకూ ఆంధ్ర మండలములలో నుత్సాహముగా జూడబడుటచే కాబోలు అప్పారావు వ్యావహారిక భాషా పక్షమవలంబించి ఆ పద్ధతికి కొంచెమించుక నాయకత్వము వహించిరి. వ్యావహారిక భాషా చర్చ యిచ్చుటననవసరము. వారా భాషకు గలదని వాదించిన యౌత్కృష్టము విషయమున నెంతో భేదాభిప్రాయములుండుట ఆంధ్రలోకమునకు మిక్కిలి చక్కగా తెలిసిన సంగతియే. కాని అప్పారావు గారు వ్యావహారిక భాషలో వ్రాయదొడంగి వ్రాసిన 'కన్యక' మున్నగు కొన్ని భావగీతములు మాత్రము వారు వ్యావహారిక భాషయందే రసవత్తర రీతిని ఇతరులకు ననువు గాని భంగిని కవిత్వము చెప్పగల ప్రౌఢులని స్పష్టపరిచినవి.

వారి కన్యాశుల్క గ్రంథము కన్న నీ చిన్ని కబ్బములలో రసౌచిత్యమపారముగా నున్నదని మా యభిప్రాయము. తక్కుంగల పోరాటములను మానివేసి ఈ విధపు రచనకే తమ కాలమును వినియోగపరచిన యెడల అప్పారావు గారు ఆంధ్ర లోకమునకు నిత్య నూతన కవిత్వ మార్గమును బాగుగా కరిపియుందరని నమ్ముచున్నాము. రచకులుగా మాత్రమే గాక అప్పారావు గారు ఆంధ్ర భాషా పక్షమున విశ్వ విద్యాలయ సభ్యులుగను పరీక్షకులుగను ప్రశంసనీయమైన పరిశ్రమ జేసిరనుటలో తప్పేమియు లేదు. వాఙ్మయ వక్షపాతమింతకలిగి గంజామువిశాఖ పట్టణ మండలములలో ప్రాముఖ్యము వహించి శాంతులై ఎదటివారలను మర్యాదించుటలో నసామాన్యులై దంభము లేక పనిచేయుచుండిన అప్పారావు వంటి పుత్రుని గోల్పోయిన యాంధ్రమాత మిక్కిలి దు:ఖించుననుటకు సందేహము లేదు. ఆమెకును అప్పారావు గారి కుటుంబమునకును మా సానుభూతిని తెలియజేయుచు వారి ఆత్మకు శాంతి కలుగునుగాక యని ప్రార్థించుచున్నాము.

.....

గురజాడ మరణించిన మరుసటి రోజునే వార్త ఇవ్వడంతో పాటు సంపాదకీయం కూడా రాయడం ఆసక్తికరమైన అంశం. ఈ సంపాదకీయంలో గురజాడ ఔన్నత్యాన్ని చెబుతూనే భాష విషయంలోనూ కన్యాశ్కులం విషయంలోనూ విడగొట్టుకోవడం చూడొచ్చు. ఆంధ్ర పత్రిక అధినేత కాశీనాథుని నాగేశ్వరరావు గురజాడ అప్పారావుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, వ్యావహారిక భాషను పత్రికలో ప్రవేశపెట్టకపోవడం ద్వారా మహాపాపము చేస్తున్నానంటూనే మార్చుకోవడానికి నిరాకరించడం 'వ్యావహారిక భాషాజ్యోతి ' అన్న అధ్యాయంలో వుంది.

### జగపతివర్మ లేఖ

ఈ సంపాదకీయం తర్వాత కూడా ఆంధ్ర పత్రికలో వార్తలు లేఖలు వచ్చాయి. వాటిలో వత్సవాయి రాయ జగపతి వర్మ రాసిన లేఖ చెప్పుకోదగింది. ఆయన ఆంధ్ర మహాజన సభ నాయకుడు. గురజాడ అప్పారావు 'విశాఖ పట్టణమున సముద్ర తీరమున ఔషధ సేవనము చేయుచు లేవలేని స్థితిలో వుండగా నేను జూచితిని' అని రాశారు. తమ సభల పట్ల ఎంతో ఆసక్తి ప్రదర్శించారని, అసహాయ స్థితిలో వున్నందును బయిటపడగానే ఆంధ్రోద్యమము గురించి తీవ్రముగా నాలోచింతుమనియు తనతో అన్నారని జగపతి వర్మ రాశారు. కళింగ దేశ చరిత్ర అప్పటికి పది పుటలు రాసినట్టు విజ్ఞాన చంద్రికా గ్రంధ మండలి ద్వారా ప్రచురణ కుదరకపోవడం వల్ల తమకు ఇస్తామని మాట ఇచ్చినట్టు తెలిపారు. కూడా బంధుమిత్రులెవరైనా దాన్నిపూర్తి చేస్తే తాను ప్రచురిస్తానని కూడా ఆ లేఖలో ప్రతిపాదించారు. ' విజయనగర సంస్థానము వారికి వీరు చేసిన మహోపకారములెన్నియో గలవు. వారి సంస్థాన మిప్పటికినీ మహోన్నత స్థితిలో వుండుటకు వీరొక ముఖ్యకారకులై యున్నారు.... ఈ మహాత్ముడు లోకోపకారి. వాగాడంబరము వీరికెంత మాత్రమును పనికిరాదు' అని కూడా వర్మ రాశారు. తర్వాత ఆ పుస్తక ప్రచురణ మాత్రం జరగలేదు. పరిశోధకులు కూడా దానిపై పెద్దగా సమాచారం తీసినట్టు కనిపించదు.

### మదరాసులో సంతాప సభ

గురజాడ అప్పారావుగారి మృతిపై డిసెంబరు 8న మదరాసు ఆండర్సన్ హాలులో తెలుగు రీసెర్చి సొసైటీ ఆధ్వర్యాన సంతాప సభ జరిగింది. చిరకాల స్నేహితులు శ్రీనివాసయ్యంగారు సభకు అధ్యక్షత వహించారు.

"వారు విజయనగరంలో శివసాయుజ్యం పొందిన దినములలో నేను మదరాసు విశ్వవిదాలయములో 'రీడరు'గా వుంటిని. అప్పుడు ఆండర్సన్ హాలులో పెద్ద సానుభూతి సభ చేస్తిమి. అప్పారావుగారు 'కన్యక' అనే ఖండకావ్యం ప్రత్యేకంగా ప్రకటించి పంచితిమి. మన ఆంధ్రులలో ఆనాడు చెన్నపురిలో వుండిన పెద్దలంతా వచ్చిరి. సర్. హోరాల్డు స్టువర్టుగారున్ను; శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారున్ను సానుభూతి వచనములు వ్రాసిరి. "చాణుక్యుని, యుగంధరుని జ్ఞాపకము చేసిన మహానీతిజ్ఞుడ"ని పలువురు ప్రశంసించిరి. అట్టి మహనీయుని భరవసా ఆంధ్రులకు పోయినదని శ్రీ చెన్నా ప్రగడ భానుమూర్తిగారు చాలా వగచిరి. "మహాధనికుడు కాగలిగిన పరిస్థితులలో వుండిన్నీ, సంస్థానమునకు ఋణపడి గతించినవాడని" శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు తమకు విజయనగరం పెద్ద దావా నడిపించుటలో గలిగిన అనుభవముతో అనిరి" అంటూ డాక్టరు శ్రీ బుర్రా వేషగిరిరావు, ఆంధ్రపత్రికలో ఒక వ్యాసం రాస్తూ వివరాలు ఇచ్చారు. . మహాకవి సంస్మరణ సంచికను ప్రకటించుటకు విరాళములకోసము విజ్ఞప్తి చేయగా సభలో అయిదు వందల రూపాయలు వెంటనే వసూలయ్యాయట. అప్పటికది మంచి మొత్తమే.

### ఆనరబుల్ సర్ హోరాల్డు స్టువర్టు

తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియచేస్తూ ఆనరబుల్ స్టువర్టు పంపిన సందేశాన్ని శ్రీనివాసయ్యంగారు సభవారికి

చదివి వినిపించిరి. "శ్రీ అప్పారావు పంతులుగారి మరణమునకు సానుభూతి తెలుపడానికై సభ జరుగుతున్నట్లు నాకిప్పుడే వర్తమానం వచ్చింది. చాలా జరూరుపనులు వుండడం వల్ల నేనీ సభకు హాజరు కాలేకపోతున్నందుకు నాకెంతో దిగులుగా వుంది. అప్పారావు పంతులు వంటి మహాపండితుని కోల్పోయినందుకు దురపిల్లుతున్న. తెలుగువారి సంతాపములో నాకూ భాగమున్నది."

ఈ దిగువ సంతాప తీర్మానమును సభవారు దుఃఖసూచకముగ కొన్ని నిముషములు మౌనముగ నిలబడి ఏకగ్రీవముగ ఆమోదించారు:

"శ్రీ గురజాడ అప్పారావుగారి మరణం వలన తెలుగు సాహిత్యమునకు యెంతో నష్టం వాటిల్లింది. వారి కుటుంబానికి యీ సభ వారు తమ సంతాపాన్ని తెలియచేస్తున్నారు."

**చెన్నాప్రగడ భానుమూర్తి**

సంతాపతీర్మానాన్ని ప్రతిపాదిస్తూ మద్రాసు ప్రభుత్వ తెలుగు ట్రాన్సులేటరు శ్రీ భానుమూర్తిగారిలా ఉపన్యసించారు:

"శ్రీ అప్పారావుగారి ఉపజ్ఞ మాత్రమే గొప్పదికాదు; ఆయన హృదయం నవనీతం వంటిది. అనేక శాస్త్రాలలో నికటమైన పాండిత్యమూ, అపార విజ్ఞానసంపత్తీ గల మేధావులు, తమ స్నేహితులను హృదయమిచ్చి ప్రేమించేవారు. సోదర ప్రజానీకంపట్ల ఆయనకు గల ప్రేమ యెనలేనిది. డాబూ, దర్పమూ యేకోశానా యెరగనివ్యక్తి. మిత్రులైననూ, శత్రువులైననూ, వారి వారి సుగుణములను సరిసమానముగా గుర్తించి శ్రీ అప్పారావు పంతులుగారు వారిని మన్నన చేసేవారు. వారితో పరిచయమైతేచాలు; కలిగిన ఆకాస్త పరిచయమూ యితరుల ప్రేమను, గౌరవాన్నీ సదా పొందుతూ వుండేది. దీనికి, శ్రీ అప్పారావుపంతులుగారి సుగుణ సంపత్తియే కారణం."

శ్రీ అప్పారావు మృతి వలన, దేశము ఒక ఉత్తమ పుత్రుని కోల్పోయినదనీ, తెలుగు వారొక ఆత్మీయుని పోగొట్టుకొనిరనీ చెబుతూ శ్రీ భానుమూర్తిగారు గ్రాంధిక, వ్యావహారిక భాషావివాదములను ప్రస్తావిస్తూ యిలా అన్నారు:

"వ్యావహారిక భాషావాదానికి ఆయన నాయకులు. నేనూ నా మిత్రులమూ దీనికి వ్యతిరేకులము. వారికీ, మాకూ తీవ్ర భేదాభిప్రాయాలుండేవి. రవీంద్రనాథ్ టాగూరు యే భాషలోఅయితే, బెంగాలీ సాహిత్యాన్ని సృష్టించారో, అట్టి భాష మన తెలుగు సాహిత్యానికెంతో ప్రయోజనకారి. ప్రజలను విద్యావంతులను చేయడానికీ, దేశ అభివృద్ధికీ, జాతీయాభ్యున్నతికీ యిట్టి భాషా సాహిత్యాలెంతో అవసరం."

శ్రీ అప్పారావుగారు రచించిన ఖండకృతుల ప్రాశస్త్యమును ఉపన్యాసకులు వుగ్గడిస్తూ, ప్రజలను విద్యాసంపన్నులను చేసే, జాతీయౌన్నత్యాన్ని సాధించే రచనా విధానాన్ని రవీంద్రునివలె, శ్రీ అప్పారావుపంతులుగారు కొనసాగించారని యిలా అభిలాషించేరు:

"శ్రీ అప్పారావుగారి కవితాశక్తి మహత్తరమైనది. విశ్లేషించి చూసే దృష్టీ, తార్కిక శక్తీ, తమ ఆశయాల కనుగుణంగా రచించే నేర్పూ ఆయనకు కలదు. తమ ఆదర్శాలేమో, వాటిని సాధించడానికి యేమి చేయవలెనో తెలిసిన ఆత్మశక్తీ, చైతన్యమూ గల రచయిత."

అనంతరం, శ్రీ హరిసర్వోత్తమరావుగారు ఉపన్యసిస్తూ శ్రీ అప్పారావుగారు నాయకత్వం వహించిన వ్యావహారిక భాషా వాదమునకు తాము వ్యతిరేకులమే అయినా, శ్రీ అప్పారావు గారిలో గల రెండు ఉత్కృష్ట గుణములను ఆయన శత్రువులు సైతము మెచ్చుకోక తప్పదన్నారు: "గొప్ప గొప్ప పండితులకు సైతం, తమ వాదమును నచ్చచెప్పి, తమకు సుముఖులుగ చేసుకుంటూ వారిని మార్చేశక్తి శ్రీ అప్పారావుగారికి వుంది. తమ వాదానికి తామే ఆదర్శముగ నిలబడి కావ్యరచన సాగించడమనే ఉత్కృష్ట ఆశయాన్ని ఆయన సాధించారు.

మరికొన్ని సంవత్సరాలు ఆయన జీవించి, తాము అవలంబించిన రీతులలో రచనలను అధిక సంఖ్యాకంగా సృష్టించివుంటే, ఈసరికి, ఆయన తెలుగుదేశానికి రవీంద్రులయ్యేవారు."

**ఆనరబుల్ శ్రీ శర్మ**

(శ్రీ బయ్యా నరసింహ శర్మ)

"శ్రీ అప్పారావు పంతులుగారు మరికొన్నేళ్ళు సాహిత్య రచనలోనేతమ జీవితకాలమును గడిపివున్నట్లయితే, ఈపాటికి ఆంధ్రసాహిత్యం మహా సంపన్నవంతమై వుండేది. ఆయనకు అనేక యితర కార్యకలాపాలు వుంటూ వుండేవి. మీదపడ్డ యీ కార్యభారమంతా తొలగి యిక తీరిక చిక్కింది కదా అనుకునేసరికి, సాహిత్యసేవ మిక్కుటముగా చేసే అవకాశం తిరిగి లభించినది కదా అని ఆశించేతరి, ఆకస్మికంగా మృత్యువు సమీపించింది. ఇటువంటి దురదృష్టకర సంఘటనలవల్ల ఆంధ్రదేశానికి తీరని నష్టం వాటిల్లింది. నిజంగా యిది తెలుగువారి దురదృష్టమనక తప్పదు.

ఇంతవరకూ వచ్చిన సాహిత్యం ప్రజలకు చేయవలసిన

సేవ చేయతగ్గంత చేయలేకపోయిందనీ, దీనికి అనేక కారణాలు కలవనీ, దీనిని సంస్కరించి నూతన దృక్పథంతో ముందు అడుగు వేయాలనీ గమనించినవారు అరుదు. ఇట్టి వినూత్న మార్గములను అన్వేషించి కొత్త కొత్త పోకడులపోయి ప్రజలకు సాహిత్యాన్ని సన్నిహితంగా తెచ్చినవారు శ్రీ అప్పారావు పంతులుగారు. ఆయన ఈ మార్గంలో మహోత్కృష్ట విజయాన్ని సాధించారు. మాతృభాషకు, సాహిత్యానికి యింతటి ఆత్మస్నేహితులు మరొకరు లేరు."

అనంతరం సానుభూతి తీర్మానాన్ని బలపరుస్తూ వొక పండితుడు తెలుగున వుపన్యసించాడు.

**అధ్యక్షుడు**

ఉపన్యాసకుల పలుకులలో అతిశయోక్తులేవీ లేవని చెబుతూ సభాధ్యక్షులు శ్రీ యస్. శ్రీనివాసయ్యంగారిలా అన్నారు: "అప్పారావుగారు సునిశిత విమర్శకులు. ఇతరుల రచనలనే కాదు; తమ రచనలను సైతం వారు విమర్శించుకుని చూసుకునేవారు. కావ్యవస్తువులోనూ, రీతిలోనూ ఆయన ఆదర్శమల్లా పరిపూర్ణతను సాధించడం."

తమకూ, శ్రీ అప్పారావుగారికీగల స్నేహాన్ని గురించి ముచ్చటించి, అధ్యక్షులు కొన్ని మధుర స్మృతులను పేర్కొన్నారు. విజయనగరం పెద్ద దావా జరుగుతున్న సందర్భంలో ఆయనతో తాము వాల్తేరులో కొన్నాళ్ళు గడిపే అవకాశం లభించిందని చెపుతూ శ్రీ శ్రీనివాసయ్యంగారిలా అభిభాషించారు: "సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషా సాహిత్యాలలో, శాసన పరిశోధనలో పురావస్తుతత్వ శాస్త్రంలో ఆయనకుగల జ్ఞానం అపారం. ఆయన విషయ పరిజ్ఞానం నన్నాశ్చర్యచకితుణ్ణి చేసింది. సాహిత్యపు పోకడలనేకాక, లోకమున మనుసుల ప్రవర్తనను, తీరు తెన్నులను, స్వభావాన్ని ఆకళించుకున్న రచయిత శ్రీ అప్పారావు పంతులు. ఆయనతో అయిదారు నిముషాలు ప్రసంగిస్తే చాలును, ఆయన నఖశిఖపర్యంతమూ మహాపండితుడనీ, గొప్ప మేధావి అనీ మనకు బోధపడుతుంది. ఆయన సాహిత్యసేవయే, పరిశోధనమే జీవిత పరమాశయంగా ఉపలక్షించిన రచయిత. పరిశోధనలో మిక్కుటమగు ఆసక్తి వలన, ఎక్కువ ఖండకృతులను రచించే వ్యవధి ఆయనకు లేకపోయింది. ఇంతటి ధీశాలి యింకా అధికంగానే రచనలు చేసే అవకాశం వుంది మరి. కాని సంస్థాన వ్యవహారాలు ఆయనకు ఊపిరాడనీయలేదు. విజయనగర రాజ కుటుంబీకు లాయనకు యెంతో ఋణపడ్డారని చెప్పవచ్చును. ఆయనతో పరిచయమౌతున్న కొద్దీ, ఆయన మనకు సన్నిహితులయేవారు. మానవునిగా ఆయనలోగల లోపములకంటే, సుగుణములనే మనం దర్శించగలం."

అధ్యక్షుని ఉపన్యాసానంతరం, మద్రాసు యూనివర్సిటీ రీడరు శ్రీ బి. శేషగిరిరావుగారు సభవారు కావించిన సంతాప తీర్మానాన్ని, శ్రీ అప్పారావుగారి కుటుంబమునకు అందచేయవలసిందిగా సూచించిరి.

**గిడుగు రామమూర్తి చిరకాల మిత్రుని మరణంపై రామదాసుకు లేఖ రాశారు:**

పర్లాకిమిడి,
5 డిసెంబరు, 1915.

ప్రియమైన రామదాసూ,

ఎంత విషాదకరము! అతను గతించినాడు! ప్రియమైన ఆత్మ! నీవలెనే, నాకూ దుఃఖం పొంగుకువస్తున్నది. నీ విచారములో సగోరుభాగమును పంచుకుంటున్నాను. నా అత్యంత ప్రియమిత్రుడు పరమపదించినాడు!

ఎలాగవున్నదో చూసివద్దామని విశాఖపట్టం వెళ్లాను. అదే ఆఖరుసారి అతన్ని చూడడం. నేనతన్ని చూడ్డానికి వెళ్లినపుడు డాక్టరు నాకిలా సలహా యిచ్చాడు : "మీరు యెదట కనిపించేసరికల్లా ఆయన వుద్రేకం పట్టలేకపోతున్నారు. అదే పనిగా, జబ్బుమాటే మరిచి మీతో సాహిత్యగోష్టి చేస్తున్నారు. చారిత్రక విషయాలను గురించీ, సారస్వతాన్ని గురించీ చర్చలుజరుపుతున్నాడు. విపరీతమైన అలసట కలుగుతున్నా లెక్క చేయడం లేదు. ఇలా అయితే ఆయన ఆరోగ్యం మరీ పాడవుతుంది కద!"

డాక్టరు, అతనికి ఉత్తరాలు వ్రాయవద్దని నాకు చెప్పాడు. నాటినుంచీ, అతనికి ఉత్తరాలు వ్రాయడం మానుకున్నాను. జబ్బు నిమ్మళిస్తుందికదా. ఆరోగ్యం తిన్నబడుతుందికదా అని ఆశిస్తూ వుంటిని. కాని యింత త్వరలోనే మరణం ముంచుకు వస్తుందనుకోలేదు.

నీ దస్తూరీతో వున్న అతని ఉత్తరం ఇరవైతొమ్మిదో తేదీన కాబోసు పోస్టులో వేశావు. అది, అతను, చెప్పగా నువ్వు వ్రాసిన ఉత్తరం కదూ! అవును, అదే కట్టకడపటి ఉత్తరం!

అతని మరణంతో వొక గొప్ప వ్యక్తిని, వొక పరోపకార పరాయణుని, మహాపండితుని మనదేశం పోగొట్టుకొన్నది.

మీ నాయనమ్మను తలచుకొన్నపుడల్లా నా హృదయం ద్రవించిపోతున్నది. గుండె చెరువవుతున్నది. పాపం, ముసలి తనంలో యెంత విపత్తు! ఏమని చెప్పి ఆమె దుఃఖాన్ని నివారించగలం! దుఃఖమును ఆదుకొనేశక్తిని భగవంతుడు

ఆమెకు ప్రసాదించుగాక. మీ తల్లిగారినీ, నాన్నమ్మనూ, అప్పచెల్లెళ్ళనూ వోదార్చి, నువ్వు ధైర్యముతో వుండవలెను.

మానాన్నగారు పోయేసరికి నాకు పధ్నాలుగేళ్ళు మాత్రమే. దుఃఖం పట్టలేకపోయాను. అవును, నాకింకా జ్ఞాపకం వుంది. దుఃఖిస్తోన్న నన్ను ఊసి దుఃఖం పట్టలేక అప్పారావు భోరున దుఃఖించసాగేడు. అదే నన్ను ఉపశమింపచేసింది.

తెలుగు ప్రజల స్మృతి పథంలో అప్పారావు సదా జీవిస్తాడు. చనిపోయినప్పటికీ అతను జీవిస్తున్నాడు. అతన్ని తలచుకోవడమంటే మన జీవితములలోని అత్యంత ఆనందమయ సంఘటనలను మన స్మరణకు తెచ్చుకోవడమే.

### మిస్టర్ జె.ఎ.ఏట్సు

4 సౌత్ పెరేడ్

బెంగుళూరు

24 డిసెంబర్ '15

ప్రియమైన శ్రీరామదాసుగారూ,

. . . .మీ తండ్రిగారి మరణవార్త విన్నంతనే నా ప్రగాఢ సానుభూతిని మీకు అందచేయవల్సిందిగా రావు సాహేబ్ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారిని కోరితిని. మీ నాయనగారి ఆప్తమిత్రులు, బంధువులూ శ్రీరామమూర్తి పంతులుగారిని తప్పిస్తే నేను మరెవ్వరినీ యెరుగను.

ఈ విషాద వార్తను నేను మొదట నమ్మలేకపోయాను. ఇది నిజంకాదనుకున్నాను. ఏమీ అంటే ఇలాంటి దురదృష్టకర సంఘటన జరగకూడదనీ, జరగదనీ నా మనస్సు ఊహిస్తూ రావడమే. నేనీ వార్తను విశ్వసించకపోవడానికి హేతువు. మొన్నమొన్ననే యీ మధ్యనే ఆయన నాకు లేఖ వ్రాశారాయె! తరువాత తెలుగు వ్యావహారిక భాషమీద ఆయన వ్రాసిన మెమోరాండము పన్నెండు కాపీలు పంపారాయె! తెలుగు భాషా సంస్కరణకు నడుముకట్టి అహోరాత్రాలు కృషి చేసిన మహాపండితుడు పరమ పదించడం తీరని లోటు. అంతటి హాస్యరస ప్రధానమైన గొప్ప నాటకాన్ని రచించి, సంస్కరణోద్యమాన్ని శక్తివంతమైన దానినిగా చేసిన ప్రతిభాశాలి ఆయన. ఆయనకు బదులుగా ఆయన రచనలు యెల్లకాలమూ జీవిస్తాయి. మహత్తరమైన ప్రయోజనమును సాధించి, ఉదాత్త ఆశయములకోసం ఆయన మరణించాడు. ఆ ఆశయములు నెరవేరినవి. కనుక ఆయన లేరనే దిగులు పడనక్కరలేదు. భవిష్యత్తులో వొక్కొక్క యేడాదీ పైబడుతున్న కొద్దీ మానవులు గతం వెనుక కొకసారి తిరిగి చూసుకుని నమ్రతతో, గౌరవముతో మీ నాయనగారికి జోహారు లర్పిస్తారు. రచయితగా, పండితునిగా, దేశ భాషా సంస్కరణోద్యమ ఆద్యులుగా లోకము ఆయనకు హారతులు పడుతుంది.

ఆయనతో నాకు పరిచయం లభించడం ఎంత అదృష్టం! తెలుగు భాషా సాహిత్యములను గురించి యెన్నో విషయములను తెలుపుడుచేస్తూ ఆయన నాకు లేఖలు వ్రాస్తూ వుండేవారు.

### మిస్టర్ మార్క్ హంటర్

ఆండర్సన్ హౌస్

నుంగంబాకం, మద్రాసు.

9 డిసెంబరు '15

డియర్ మిస్టర్ రామదాసు,

నా మిత్రుడు శ్రీ అప్పారావు మరణవార్త విని క్రుంగిపోయాను. ఆయన సాధించినది ఉన్నతమైనది. దక్షిణ భారతదేశములో గల మేధావులలో పండితులలో ప్రథమ శ్రేణికి చెందిన వ్యక్తి. తన రచనలతో తెలుగు భాషా సారస్వతములకు యెనలేని సేవచేసిన రచయిత. ఆయన ఉద్యమ స్వభావమును కొందరు అపార్థము చేసుకొంటే చేసుకొందరుగాక! కాని ఆయన తన ఉత్తమ లక్ష్యసాధనకు యెడతెరిపిలేని పోరాటమును నడిపినాడు. ద్రవిడ భాషలకు, వాఙ్మయమునకు ఆయన మరణం వలన తీరని నష్టము వాటిల్లినది.

### బుర్రా శేషగిరిరావుగారు

ఆయన మన ఆంధ్రులలో మాకు ముందటితరము వారిలో చాలా ప్రసిద్ధ పురుషులు. తనమాట చెల్లివచ్చిన చోటనల్లా మన ఆంధ్రులకు, ఆంధ్ర సంస్థలకు సాయపడిన, సిసలైన దేశాభిమాని... "దేశాభిమానం నాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్, పూని యేదైనాను వొక మేల్ గూర్చి జనులకు చూపవోయ్!" అని తన ముత్యాలసరములలో పాడినట్లు తాను లోకోపకారమని నమ్మిన 'వ్యావహారిక భాషోద్ధరణ' మనే ఉద్యమమునకు ధారవోసిన మహితాత్ముడు. ''నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను" అని ప్రవచించిన శ్రీ అప్పారావు పంతులు గారు నాకు గురుతుల్యులు. ◈

## మహాకవి

- దేవులపల్లి కృష్ణశాస్త్రి

గుత్తునా యని జాతిముత్యాల్
గుచ్చినాఁడే మేలిసరముల
ఇత్తునా యని తెలుఁగుఁదల్లికి
ఇచ్చినాఁడే భక్తితో!

నవవసంతము, నవ్యవనరను,
మావికొమ్మల గమ్మచివురులు,
పాటపాడెడి పరభృతంబును
ఎవ్వరాపుదురో!

పొడుపుమలపై రంగవల్లిక
మింటినడుమఁ బ్రచండతేజము
సంజమబ్బులపైని కెంపులు
చూడకుంటిరిగా!

రంగవల్లిక మాయమయ్యెను
చండ తేజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను
వెదకుచున్నారా!

కారుచీఁకటి గ్రమ్మినప్పుడె
చదల మబ్బులు కప్పినప్పుడే
మిణుఁగురైనను మెఱయనప్పుడే
వెదుకుచున్నారా!

చుక్కలన్నియు సొక్కి సోలెను
గిరులు కదలెను, దిరుగఁబాడెను
లోక మోహనమధురగానా
స్వాదమోదమున!

యుగయుగంబులనుండి మ్రోఁగెడు
విశ్వగానవియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీత శీకరముల్!

పాటపాడిన పరభృతంబును
మూఁగబోయిన ముద్దుకోయిలఁ
జిన్ని పికములు చిఱుతపాటలఁ
బిలుచుచున్నవి రా! ◈

## శ్రీ గురజాడ అప్పారాయ స్మృతి

- బసవరాజు అప్పారావుగారు

కోకిలా! పారిపోతివె కోర్కెలన్ని
వమ్ముజేసి, శోకమ్మున మమ్ముముంచి
చూపులకు నందరానిదై చౌరనశక్య
మైన మరుభూమికొచ్చితే మందు నిన్ను
శీతకాలమ్ము నందెట్లో చిక్కి స్రుక్కి
చాటుమాటున దాగుండి సరసమగు వ
సంతకాలము వచ్చెడు నంతవరకు
ఓపికను పట్టలేనైతివే! ప్రియసఖా!
నెఱ్ఱపడియెదుగాని యీ విధము క్రొత్త
ప్రకృతి మార్గమ్ములను నడ్డువచ్చుచుండె!
వేసవి చనంగ, దాని వెన్వెంట వచ్చు
శీతకాలము రాకుండ, జేయగలవె?
దివ్యమౌ నీదు గానమ్ము తీపి వీర
లకు రుచింపక పోయెను, వికల మతిని
"కొయ్యబొమ్మల"నే మెచ్చుకొనెడి వీరి
మతుల కెట్లెక్కునౌర, "కోమలులు సౌరు"?
అంతమాత్రాన వీరిపై కలుగనేల?
వెలుగుచీకటియొక్కచో వెలయుగాదె?
ప్రకృతి వైచిత్ర్య మిట్టుల బరగ, మమ్ము
నలుకమైనీదు నిన్నేమి యనగలమయొ?
ముందువచ్చు వసంతమ్మునందు నీదు
క్రొత్తగీతము విన నెంతో కోర్కెనుంటి
నింక నేను వసంతమీ యిగురుపాట
వినపడదుకాదె యింక మావీనులకును?
మరచిపోకుము నెచ్చెలీ మమ్ము, దలపు
మమరులలరి చేష్టలు దక్కియాలకించ
లీనమై హాయి, నీదివ్య గానరసము
చిలుకునప్పుడు నీదు నెచ్చెలులమంచు! ◈

# గురజాడ జీవితంలో ప్రధాన సంఘటనలు

| | |
|---|---|
| జననం (తండ్రి రామదాసు, తల్లి కౌసలమ్మ) | 21-9-1862 |
| ప్రాథమిక విద్య చీపురుపల్లిలో | 1869-1872 |
| హైస్కూలు విద్య విజయనగరంలో | 1872-1882 |
| మెట్రిక్ : మహారాజా హైస్కూలు | 1882 |
| ఎఫ్.ఎ. మహారాజా కళాశాల | 1882-84 |
| ఇంగ్లీషులో కుక్కా' గేయం | 1882 |
| 'సారంగధర' ఇంగ్లీషు గేయం ప్రచురణ | 1883 |
| 'ఇండియన్ లీజర్ అవర్', విజయనగరం | |
| 'సారంగధర' ప్రచురణ కలకత్తా నుంచి: | ఆగస్టు 11 & 18, 1883 |
| వెలువడే రయస్ అండ్ రయత్ జర్నల్‌లో | |
| బి.ఎ. పట్టా మహారాజా కళాశాల నుండి | 1884-1886 |
| అప్పల నరసమ్మతో వివాహం | 1885 |
| మహారాజా కాలేజీలో ఉపన్యాసకులు (ఇంగ్లీషు) ఉద్యోగం: | 1886 |
| డిప్యూటీ కలెక్టర్ ఆఫీసులో హెడ్ క్లర్కు ఉద్యోగం | 1887 |
| మహారాజా కాలేజీలో ఉపన్యాసకులు | 1887 |
| కుమార్తె లక్ష్మీ నరసమ్మ జననం | 1889 |
| డిబేటింగ్ క్లబ్‌కు ఉపాధ్యక్షుడు | 1889 |
| కుమారుడు రామదాసు జననం | 12-10-1890 |
| మూడవ స్థాయి ఉపన్యాసకులుగా పదోన్నతి | 1891 |
| తమ్ముడు శ్యామలరావు మరణం | 1890-92(?) |
| 'కన్యాశుల్కం' మొదటి ప్రదర్శన (జగన్నాథ విలాసినీ సభ) | ఆగస్టు 1892 |
| మద్రాసుకు వైద్య సహాయం కోసం పయనం, "టీటీ" ప్రచురణ | 1895 జనవరి 9 నుండి జులై 3 |
| ఎస్టేట్ ఎపిగ్రాఫిస్ట్‌గా నియామకం | జూన్ 45, 1896 |
| 'ప్రకాశిక పత్రిక' డిక్లరేషన్ | 1896 |
| 'కన్యాశుల్కం' మొదటి కూర్పు; ముద్రణ | జనవరి 1897 |
| ఆనంద గజపతి మరణం | మే 23, 1897 |
| 'హరిశ్చంద్ర' ఇంగ్లీషు నాటకానికి పీఠికా రచన | 1897 |
| కుమార్తె వివాహం | మే 12, 1898 |
| రేవా రాణీగారికి ఆంతరంగిక కార్యదర్శిగా నియామకం | జూన్, 1898 |
| మద్రాసులో పరిశోధన | 1899 |
| ఎస్టేటు కేసులపై సలహా కోసం కలకత్తా ప్రయాణం | 1900 |
| మద్రాసులో భాష్యం అయ్యగారితో సమావేశం | డిసెంబర్ 18, 1900 |

| | |
|---|---|
| రెండవ కుమార్తె జననం | 1902 |
| వారసత్వ దావా; ఎస్. శ్రీనివాస అయ్యంగారితో స్నేహం | 1903 |
| ఇంగ్లీషు కథా రచనా కాలం (Stooping to Raise) | 1903 |
| తండ్రి రామదాసు మరణం | ఏప్రియల్ 24, 1905 |
| 'కొండుభొట్టీయము' నాటక రచన | మే 1906 |
| వ్యావహారిక భాషోద్యమం | 1906 |
| 'నీలగిరి పాటలు' ప్రచురణ | 1907 |
| 'కన్యాశుల్కం' మలికూర్పు; ముద్రణ | 1909 |
| ఆంధ్ర భారతిలో 'దిద్దుబాటు' కథానిక ప్రచురణ | ఫిబ్రవరి, 1910 |
| బరంపురంలో భిన్నకులాల సహపంక్తి భోజనం | నవంబర్, 1909 |
| 'బిల్హణీయం' మొదటి భాగం ప్రచురణ | 1910 |
| ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో | |
| 'మీ పేరేమిటి' పెద్ద కథ ప్రచురణ, ఆంధ్రభారతి | ఏప్రిల్–జూన్ 1910 |
| 'ముత్యాలసరము' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి | జూలై 1910 |
| 'కాసులు' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి | ఆగస్టు 1910 |
| 'డామన్ పితియస్' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి | సెప్టెంబర్ 1910 |
| 'లవణరాజు' కల' గేయం, ప్రచురణ ఆంధ్రభారతి | నవంబర్ 1910 |
| 'భిల్హణీయం' రెండవ భాగం ప్రచురణ | 1911 |
| ఆంధ్రపత్రిక, ఉగాది సంచికలో | |
| మద్రాసు విశ్వవిద్యాలయం బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో సభ్యత్వం | 1911 |
| కలకత్తా రవీంద్రనాథ్ టాగోర్‌తో భేటీ | అక్టోబరు 1912 |
| 'కన్యక' గేయం ప్రచురణ, ఆంధ్రభారతి | అక్టోబరు 1912 |
| 'పూర్ణమ్మ' గేయం రచన | 1912 ? |
| రేవారాణి మరణం | డిసెంబర్ 1912 |
| మద్రాసు విశ్వవిద్యాలయం – ఫెలోషిప్ | జనవరి 1913 |
| వారసత్వ దావాలో రాజీ | 1913 |
| 'సుభద్ర' పద్యకావ్య రచన | 1913 ? |
| పదవీ విరమణ | 1913 |
| 'దేశభక్తి గేయం' ప్రచురణ; కృష్ణాపత్రిక | ఆగస్టు 9 1913 |
| 'డిసెంటుపత్రం' (ఇంగ్లీషు) ప్రచురణ | 1914 |
| 'దించు లంగరు' గేయ ప్రచురణ, కృష్ణాపత్రిక | ఏప్రిల్ 1914 |
| అనారోగ్యం | నవంబర్ 19, 1914 |
| వైద్య పరీక్షలు | 1915 |
| 'లంగరెత్తుము' గేయ రచన | సెప్టెంబర్ 1915 ? |
| గృహప్రవేశము | 1915 |
| మరణం | నవంబర్ 30, 1915 |

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20,

50 సాహిత్య సాంస్కృతిక, కళా, సామాజిక సంస్థల ఆధ్వర్యంలో గుంటూరులో
ఏ.సి. కళాశాలలో 28.09.2015న జరిగిన గుర్రం జాషువా 120 వ జయంతి ఉత్సవాలు





































|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A165 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K.Daveed |
| పేజీలు విడదీసినది | K.Daveed |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | Nandini |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |